# సమర్పణ



సీ॥ శ్యామసుందర రాధికామనోహర కృష్ణ, పరమేశ దేవ కృపాసముద్ర
నిజకర్మమయ పాశ నిగళబద్ధుండనై, క్షమలోన బెక్కు జన్మముల నొంది
కడలేని సంసార జడధిలోన మునింగి, యేమియు దోచక యింతకాల
మునకు భవత్పాదవనజంబు లర్చించి, పొందుగా శరణంబు నొందినాడ
తే.గీ॥ నన్ను కడతేర్చి ప్రోవు మనాధనాధ, భక్తిమంత్రక్రియా వస్తుహీన
మైన మత్కర్మ మెయ్యది దాని మోద, మలరఁ బరిపూర్ణముగఁ జేయు మంబుజాక్ష [1]

అని మోక్షప్రదాయకుడైన శ్రీకృష్ణుని కలలోగాంచి తరించి ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ అని ధర్మ ప్రబోధమైన శ్రీ మద్రామాయణము శ్రీ కృష్ణాంకిత మొనర్చుటే కాక, కీర్తియు భోగసంపదలు కేవల మోక్ష మొసంగు రామునిన్ భర్తను చేసి, శ్రీ కృష్ణ జన్మఖండమును కార్తిక కౌముదీ రుచిర కావ్యముగా రచించి తరించిన పుణ్యుడవు నీవు. శ్రీ కైవల్య రమాధినాథుడగు శ్రీ కృష్ణపరమాత్మచే ఉపదేశింపబడిన సర్వోపనిషదర్ధ ప్రతిపాదకంబైన మోక్షయోగమైన శ్రీ భగవద్గీతాశాస్త్రమును తెనుగు పద్యకావ్యముగా చేసిన ఆధ్యాత్మ విద్యావిచ్ఛ్రేష్ఠుడవు నీవు.

"త్వాదృక్ నో భూయా న్నచితకేత ప్రష్టా" (ఓ నచికేతా! నీ వంటి మరొకడు ఉండకుండుగాక) అని గురువుచే ప్రశంసనందిన జ్ఞానసంపన్నుడవు నీవు.

కొవ్వూడి కోదండ రామాలయమునకు, లక్ష్మీపుర సమీపపు .రామాలయమునకు (15–5) 20 ఎకరములు భూమి ఇచ్చిన పుణ్యుడవు నీవు. లక్ష్మీపురమునకు ప్రాణమైన చెఱువు నుద్ధరించిన[2] పుణ్యుడవు నీవు. నన్నయ, తిక్కన, పోతన యక్షరలక్షణములు ప్రకాశింపచేసిన యక్షరుడవు నీవు.

దేవ, పితృ, ఋషి ఋణములతో పుట్టిన నేను పితృబీజ ప్రయోజకుడుగా యీ చిన్న పుస్తకమును సమర్పించుకొనుటకంటే ఏమి చేయగలను?

–గోపినాధ శ్రీనివాసమూర్తి

---

1. ఈ పద్యము శ్రీకృష్ణ జన్మఖండ కథాభాగము లోనిది.
2. దీనిని వెంకయ్య చెఱువు అంటారు.

శ్రీరస్తు
శ్రీ గణేశాయనమః
శ్రీరామ చంద్రపర బ్రహ్మణే నమః

# గోపినాథ వేంకటకవి పూర్వ్యకవి పరంపర


గోపినాథ శ్రీనివాసమూర్తి
(వేంకటకవి మనుమని మనుమడు)



ప్రచురణ కర్త :
గోపినాథ వసుంధరా దేవి

గోపినాథ వేంకటకవి సాహితీ (ట్రస్టు) నికేతన ధర్మనిధి
8-2-351, ఫ్లాట్ నం. 4 మరియు 5, త్రివేణి సంఘం అపార్ట్‌మెంట్,
ఆంధ్రజ్యోతి ఎదురుగా, బంజారాహిల్స్, రోడ్ నం. 3, హైదరాబాద్ - 500 034.

గ్రంథనామము : గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

గ్రంథ కర్త : గోపినాథ శ్రీనివాసమూర్తి (వేంకటకవి మనుమని మనుమడు)

ప్రథమ ముద్రణ : మార్చి, ఏప్రిల్ – 1994
శ్రీముఖ సంవత్సరము

ప్రతులు : 1000

వెల : రూ. 80/– (ఎనుబది రూప్యములు)

ప్రతులకు : గోపినాథ వసుంధరా దేవి
గోపినాథ వేంకటకవి సాహితీ (ట్రస్టు) నికేతన ధర్మనిధి
8–2–351, ప్లాట్ నం. 4 మరియు 5,
త్రివేణి సంఘం అపార్ట్‌మెంట్,
ఆంధ్రజ్యోతి ఎదురుగా,
బంజారాహిల్స్, రోడ్ నం. 3,
హైదరాబాద్ – 500 034.



ముద్రణ : మహాలక్ష్మి ఆర్టు ప్రింటర్స్,
అమీర్‌పేట్, హైదరాబాద్

# నివేదనము

మా నాన్నగారు పోయే సమయానికి మేము పసిపిల్లలం కావడం మూలాన్నూ, ఆస్తి నాస్తి కావడం మూలాన్నూ మేము మా మేనమామల పైనా, ధర్మసత్రాలపైనా, వారాలపైనా ఆధారపడ వలసి వచ్చింది. 12 ఏండ్ల అమ్మాయి, 10నెలల అమ్మాయి మధ్య ముగ్గురు మగబిడ్డలతో తల్లి పోషణకై ఎంత కష్టపడిందో చూచిన వారికి, దైవానికి ఎఱుక ! పై పరిస్థితులలో మాకు మా ప్రప్రపితామహులు – గోపినాధ వేంకయ్య శాస్త్రిని (వేంకటకవిని) గుఱించి, వాఙ్మయంలో వారికి గల స్థానం గుఱించి తెలియదు. వెంకయ్య శాస్త్రి గారిని చూచిన మా నాయనమ్మ రంగమ్మవ్వ, వారిని గుఱించి, వారు పొందిన గౌరవాలను గుఱించి తెగ చెప్పేది. మేము పెడచెవిని పెట్టి వినలేదు. సరిగదా, మనవాళ్లెప్పుడూ మన పూర్వులను పొగుడుతూ ఉంటారు. అది లోక సహజం అనుకునేవాళ్లం. మా యింట్లో వారు వ్రాసిన పుస్తకాలు కనీసం గోపినాధ రామాయణము కూడా ఉండేది కాదు.

భగవత్కృపవల్ల కాలం ఎలాగో గడిచిపోయింది. అందరము ఉద్యోగాలలో చేరాము. నేను ప్రభుత్వకార్యం మీద 1968లో కడపకు వెళ్ళి అక్కడ సాయంత్రం కాలయాపనకు గ్రంథాలయమునకు వెళ్ళి పుస్తకములు చూచుచుండగా నా అదృష్టవశమున 'గోపినాథ వేంకటకవి' అని, ఒక పుస్తకమందు చూచి అం దేమనియున్నదో చూతమని చూడగా 'ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహము' న నిట్లున్నట్లు చదివితిని,

"... ఇత డాధునికుడగుట నితని విలువఁజూచుటకు మన మశక్తులమేమో? ... ఇతని యధామూల వాల్మీకి రామాయణ మాంధ్రీకృత యధామూలము లన్నిటిలో నుత్తమోత్తమ మైనదని యయ్యై పుస్తకముల నొకేచోట, నొకప్పుడే చదివిన యెడల పాఠకులకు తప్పక విశదమగును. సంస్కృత పంచకావ్యములలో నొకటియగు మాఘము నితడు తెలిఁగించిన తెఱంగునకు శ్రీనాధుడును దలయూచవలసినదే! శైలి "విద్వత్ప్రశంస్తవనీయ కవితావేశంబును" మెఱయించుచు, సలలిత పద ప్రయోగ నైపుణ్యమును జూపుచు, చదువఁ జదువ నింపులు పుట్టించుచున్నది".

పై విషయములను చదివిన తదుపరి, అందలి ప్రఖ్యాత కవులగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారిని కలిసి, వారివలన మా ప్రప్రపితామహులు వారికి ప్రత్యేకాభిమానముగల కవులలో ఒకరని తెలిసికొని, వారు అంతకు పూర్వము వ్రాసి అచ్చయిన 'మాఘుడు–గోపినాధ వేంకటకవి' అను వ్యాసమును యివ్వగా తీసికొంటిని. అందు ముగింపు వాక్యము లివి. "గోపినాధులు చాల ప్రసిద్ధులైన విద్వత్కవులు. శాస్త్ర పాండిత్యముతో పండి పక్వమైనది, వారి సాహిత్యము. ప్రాచీన మహాకవుల కోవకు చెందినవారిలో వీరు కడపటివారు."

అప్పటినుండియు మా ప్రప్రపితామహులను గూర్చి ఎవరెవరేమేమి వ్రాసిరో గ్రహించుటకు ప్రారంభించితిని. తెలుగు భాషా సమితి వారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము - తెలుగు సంస్కృతి - యందు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు - వేంకటకవి కడపటి కృతి రాధికా పరిణయమనియు, అది ముద్రితమనియు - చదివి, వారికి నన్ను పరిచయము చేసికొనుచు, వారికృతులు వారి వారసులమైననూ మా వద్ద లేవనియు, అవి లభించు చిరునామా తెలుపుడని ఉత్తరము వ్రాయగా వారిట్లు వ్రాసిరి.

"I am overjoyed to learn that you are the direct descendent of Sri Late Gopinatha Venkatakavi garu, the greatest poet of the 19th century As a matter of fact I am the first person to bring to the notice of the public his great and everlasting contributions toTelugu literature . . .. As for his works . Radhikaparinayam partly printed in Ratnakaram, a journal in Masulipatnam in 1894, this journal is not available . . . .. .

I take opportunity of writing to you to know something about the family of Sri Venkatakavi garu. Are there any elder persons in your family now who can give some information about your family ... I will most willingly do what all I can in bringing to light the greatness of Sri Venkatakavi garu".

వేంకటకవీంద్రుల రచనల నుండి పార్వ్యగ్రంధములకు నిర్ణయింపబడకుండుటవలన కవిని గుఱించి లోకము మరచిపోవుటకు కారణమని ఊహించి మద్రాసు, వేంకటేశ్వర, ఉస్మానియా తెలుగుశాఖాధ్యక్షులకు ఉత్తరపూర్వకముగను, ఆంధ్రవిశ్వవిద్యాలయ తెలుగుశాఖాధ్యక్షుని ప్రత్యక్షముగను అభ్యర్థించితిని. శ్రీ నిడదవోలు వెంకటరావు గారికి విమర్శనాదృష్టితో వేంకటకవిపై వ్యాసములు వ్రాసిన ప్రచారమునకు తోడ్పడగలరని అభ్యర్థించితిని. శ్రీ నిడదవోలు వెంకటరావుగారిట్లు వ్రాసిరి.

" .. ... .As for a critical study of the works of Sri Venkata Kavi garu, I am equally happy to note that you have anticipated my intention of writing the same. As a matter of fact I wanted to write about this and also critical biography of Sri Venkatakavi garu to you even before But since it was my first letter to you I did not mention it. It was with the intention of writing a biography and critical study of his works, I wrote to you for details. I am writing to the persons whom you have mentioned. Can I get any information regarding the date of birth at least the year and date of his death ?

This is the time when a critical and exhaustive study of his works should be made and his place in the history of modern literature has to be evaluated. In the opinion of competent critics, Sri Venkatakavi garu is the last of the great galaxy of poets commencing form Nannaya in Telugu literature

If a biography with a critical study of his works is first brought out then it will go a long way in popularising the works of Sri Venkatakavi garu, which is our cherished desire The biography and the studies should not be a big volume it will be about 300 pages and on the lines of Indian Men of letters series I have already published a biography of that type of Potana. It is published by National book trust of India"

పై ఉత్తరము చూచిన తదుపరి నేను వెంకయ్యశాస్త్రి జీవిత విషయములు సేకరించుటకు వారి నివాసస్థానమైన లక్ష్మీపురమునకు వెళ్ళి మా చినతాతగారి భార్య గోపినాధ సుబ్బమ్మ ద్వారా కొన్ని విషయములు సేకరించి, తన భర్త (కవి మనుమడు పేరు వెంకయ్యశాస్త్రి) జననమునకు 6 నెలల పూర్వము గోపినాధ వెంకయ్యశాస్త్రి (కవి) వేంకటగిరికి సకుటుంబముగా వెళ్ళి, ఆకస్మికముగా మరణము నొందినారని విని, వెంకటగిరి వెళ్ళి మా చినతాత జనన తేదీ హైస్కూలు వారి ద్వారా 15–12–1892 అని తెలిసికొని జనన మరణ రిజిష్టారు కార్యాలయమున ప్రతులు తిరుగవేయగా 8–6–1892న వెంకయ్యశాస్త్రి మరణించినట్లు తెలిసికొంటిని. వెంకటగిరి యందు రాజుగారి అనుమతిని వేంకటకవీంద్రుల గ్రంధములను సేకరింపగలిగితిని. ముద్రణకు సహకరించుచు శిశుపాలవధ వ్రాతపతి యిచ్చిన శ్రీ వేంకటగిరి ప్రస్తుత రాజులకు నా కృతజ్ఞత యిందు మూలముగా తెలియచేయుచున్నాను.

శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు నా ఉత్తరము చూచి పాఠ్య భాగములుగ నిర్ణయించుటయే గాక "వెంకటగిరి సంస్థానము సాహిత్యసేవ" అను అంశముపై పరిశోధన చేయుచున్న శ్రీ కాళిదాసు పురుషోత్తం అను విద్యార్థిని పంపి, లోకమునకు తెలియని ఎన్నో విషయములు ప్రకటింప జేయుట కెంతో సహాయము చేసినవారైరి. డా||. కాళిదాసు పురుషోత్తంగారు వెంకటగిరి సంస్థాన గ్రంధములను పరిశోధించి అందుగల అముద్రిత గ్రంథములు వెలుగులోనికి తెచ్చుటవలన వారి సాహిత్య సేవ ప్రస్తుతింపతగినది. మారుతిశతకము, తిరునాళ్ళ దండకము, వెలుగోటి వారి వంశావళి కొన్ని పద్యాలు, కొన్ని తారావళి పద్యాలు, వేంకట కవీంద్రులచే రచింపబడిన మరికొన్ని లఘు రచనలు వెలుగులోనికి తెచ్చినందుకు వెంకటకవీంద్రుల వంశీయులుగా మా కృతజ్ఞత వారి కిందుమూలముగా తెలియజేయుచున్నాను.

మదరాసు విశ్వవిద్యాలయమునుండి శ్రీ ఎస్. రామకృష్ణ శాస్త్రి గారు యిట్లు వ్రాసిరి. "మీ ముత్తాత గోపినాధ వేంకటకవి గారు ప్రఖ్యాత కవులనుట సర్వవిదితమైన విషయము. వారి గ్రంథములనుండి కొన్ని భాగములు మాత్రము యూనివర్శిటీ పరీక్షలకు పాఠ్యగ్రంధములుగా నిర్ణయించుట కెవరును కాదనరు. కాని అచ్చుపడిన గ్రంథములేవో, ఎక్కడ దొరుకునో తెలియదు. వారి రామాయణము మాత్రము పూర్వము వావిళ్ళ వారివద్ద కేటలాగులో గోచరించెడిది. ఇప్పుడదికూడ కానరాదు. కాన, వారి గ్రంధములు కాపీయొక్కటైన

పంపగలిగితే Meeting of Board of Studies లో తెచ్చి ఏదేనొక గ్రంధములోని కొంతభాగమును పాఠ్యభాగముగా ఒకొక్క మారు నిర్ణయింపగలము. ఇది నా చేతనయిన పని".

కవిసామ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాధ సత్యనారాయణ గారిని ప్రచారమునకై అర్థింపగా వారిట్లు వ్రాసిరి. "మీ తాతగారు రచించిన గోపినాద రామాయణము ప్రసిద్ధ గ్రంధమే. రామాయణ కర్తలలో మీ తాతగారి పేరు తక్కువగా లేదు. తక్కువది కాదు. గ్రంధము నచ్చువేయించి ప్రచారములో నుంచవలసిన బాధ్యత మాత్రము తత్సంబంధీయులకు కలదు. ఒక కవి యెన్ని గ్రంధములు వ్రాసినను ఏదో ఒకటియే ప్రసిద్ధికి వచ్చును. దానితోనే వారిపేరు నిలుచును. వారి గ్రంధము లన్నియు అచ్చువేయించి మార్కెట్‌లో పెట్టినచో ప్రచార మెక్కువగా నుండును. ఇదియే రహస్యము.

లేదు, మీరునన్ను వారి గ్రంధములకు ఏ విధముగా ఉపకరించుమందురో, వ్రాసినచో, అది నాకు సాధ్యమయినచోఁ జేయగలను".

పై పండితాభిప్రాయ మొకవైపు, వెంకయ్యశాస్త్రిగారి వినయత, భక్తి ఒకవైపు, మిళితమై నాకు వారిపై భక్తి భావములు, వారి పుస్తకములు ప్రచారములో లేనందున, అందుకు ప్రయత్నత గలుగ జేసినవి.

ఇంతేకాక కవివ్రాసిన "నీ కేసేవ చేసితి నీరజలోచన చేకొని నను బ్రోవరా" అను లక్ష్మీపుర భజనలలోని భక్తిపూర్వకమైన కీర్తన గుర్తున్నదని మా అమ్మమ్మ గాడేపల్లి సుబ్బమ్మ పాడినది. అందలి భావము వారిపై భక్తి నినుమడింప జేసినది.

విశాఖపట్నం జిల్లా, కణితి గ్రామం జిల్లా పరిషత్ హైస్కూలు తెలుగు పండితులు శ్రీ కొక్కిరగడ్డ శ్రీ రామమూర్తిగారు శిశుపాల వధ ననువదించుట చాల కష్టమనియు, యిది తిరిగి ముద్రింపబడి పండితుల హస్తగతమైన కవికి పండితలోకమున మంచి కీర్తి సంపాదింప గలదనియు చెప్పి, నాకు సాహిత్య ప్రవేశము గల్గ జేసి నందున వారికి నా కృతజ్ఞత.

కొంతకాలమునకు శ్రీ దివాకర్ల వెంకటావధాని గారిని కలసి కొనగా వారు "మిత్రులు, సాహిత్య ప్రియుల సహాయమునభ్యర్థించి, పుస్తకము యొక్క విలువగా ఒక్కొక్కరి నుండి 10 రూ॥ చొప్పున ముందుగా వసూలు చేసి, ఆ ధనము ద్వారా ముద్రించి పుస్తకమును వారికి పంపవచ్చు" నని చక్కని సలహా చేయుటయే కాక, ప్రతి సందర్భమునను ప్రోత్సహించిరి. తద్వారా శిశుపాలవధను ప్రకటింప గలిగితిని.

నేను వసూలుచేయు సందర్భమున శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారిని కలిసికొనగా వారు ఈ పుస్తకము ననువదించుట చాల కష్టమనియు, అందువలన అభ్యంతరము లేకపోయినచో పుస్తకము నిచ్చిన చదివి తపాలా ద్వారా పంపగలననియు తెలిపి, వారు తమ అభిప్రాయములను

23–3–69న ఆంధ్రప్రభ సారస్వత కళావేదిక ద్వారా తెలిపియున్నారు. వారికి నా కృతజ్ఞత ఖండుమూలముగా తెలియ పరచుచున్నాను.

శ్రీకృష్ణ జన్మ ఖండములోని ఉషాకన్యా చరిత్రమును ఉస్మానియా విశ్వవిద్యాలయం BOL వారికి, విభీషణుని 'హితబోధ' BA. వారికి పార్యభాగముగా నిర్ణయింపబడినది. వారి రామాయణములోని శివధనుర్భంగము పదవతరగతి వారికి పార్య భాగములుగా నిర్ణయించిరి. ఇట్లే ఆరణ్యకాండము లోని సీతాపహరణము ఇంటర్మీడియేట్, (స్పెషల్ తెలుగు) శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయముBA వారికి కూడ నిర్ణయించిరి. శిశుపాల వధలోని మంత్రాలోచనము కర్ణాటక విశ్వవిద్యాలయము BA పార్యభాగముగ నిర్ణయింపబడినది. ఇట్లే శ్రీ నిడుదవోలు వెంకటరావు గారును మొదట కవిని గురించి ఆకాశవాణి ద్వారా ప్రసారం చేసి, తదుపరి అపరపోతన – గోపినాధ వేంకటకవి, అను వ్యాసమును 'ఆంధ్రప్రభ' సారస్వత కళావేదిక యందు వ్రాసి, వారి రచనల పునర్ముద్రణమునకై తోడ్పడమని విజ్ఞప్తి చేసి యున్నారు.

అంత అత్యుత్తమమైన కావ్యమును ప్రచురించినను, పద్యరచన నాదరింపని ఈ కాలమున ఫలితము దక్కలేదు. పుస్తకములును అమ్ముడు పోలేదు. కనుక ప్రచురణ భారమును వదిలివేసితిని.

కవి జన్మస్థానమునకు దగ్గరి కావలిలో గోపినాధ వేంకటకవి వర్ధంతోత్సవముగ శ్రీ కాళిదాసు పురుషోత్తం, శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ అవధానం చంద్రశేఖర శర్మ, శ్రీ గౌరిపెద్ది రామ సుబ్బశర్మ, శ్రీ చెరుకుపల్లి జమదగ్నిశర్మ, వంటి ప్రముఖములచే ప్రతి సంవత్సరమొక ఉపన్యాసము నిప్పించి నూటపదహార్లచే సత్కరించితిని. వారిలో పెక్కురు గోపినాధ రామాయణము అలభ్యమైనదని వాల్మీకి రామాయణముపై ఉపన్యాస మిచ్చి వెళ్ళుచుండిరి. కనుక ఈ కార్యక్రమమును మానుకొంటిని.

గోపీనాధ రామాయణ ముద్రణమునకై పలుసంస్థల నభ్యర్థించితిని. కాలశక్తిచే సరిగ ప్రధమ ముద్రణము 1887 నుండి వంద సంవత్సరములకు 1987న తెలుగు విశ్వవిద్యాలయము వారిచే ముద్రింపబడినది. అప్పటి తెలుగు విశ్వవిద్యాలయ కులపతి శ్రీ తోమాటి దోణప్ప గారికి నా కృతజ్ఞత తెలియచేసుకొనుచున్నాను.

శ్రీ పుట్టపర్తి నారాయణచార్యుల వారిని 1988లో కలసికొనగా వారు వేంకటకవి కీర్తిని సారస్వత లోకమున శాశ్వతముగ నిలుపునది రామాయణమే ననియు, కవి పండితులే మెచ్చుకొను శిశుపాల వధ ప్రాచుర్యము తక్కువనియు సెలవిచ్చిరి.

ఇట్లే శ్రీ కృష్ణ జన్మఖండమును 1992 వేంకటకవి పరమపదించిన శత సంవత్సర సూచికగా ముద్రింపమని కులపతి శ్రీ నారాయణ రెడ్డి గారిని కోరి ఒక అభ్యర్థన నిచ్చితిని. కాని కాల మనుకూలింపలేదు. త్వరలో ముద్రణ నొందగలదని ఆశించుచున్నాను.

శ్రీ ఓగిరాల రాదాకృష్ణమూర్తితో కలిసి పంచపర్యాయములు గోపినాధ రామాయణము చదివితిమి. ఆ భాగ్యము మరవరానిది. అనంత జ్ఞాన సంపన్నులైన వారు నాకు గోపినాద రామాయణములో ఎన్నో సౌందర్యములను తెలియచేసిరి. వారీమధ్యనే మరణించుట తీరని లోటైనది.

ఇక మనమే వ్రాయుట తప్ప శరణ్యము లేదని వేంకటకవి పై గల భక్తి శ్రద్ధలచే నేనే ఈ రచన కుపక్రమించితిని. నేను గోపినాధ వేంకట కవి జీవితము రచనా సౌందర్యములను వ్రాయ తలపెట్టి, కలము పట్టగా మధ్య మధ్య అనేక ఆలోచనా పరంపరలు వచ్చి ఈ రచనకు దారితీసినవి. వేంకటకవి జీవితము, అతని రచనలను త్వరలో వ్రాసి ముద్రింపగలను. కాలమే ఆ శక్తిని ఇవ్వగలదని ఆశించుచున్నాను. వ్యాస భారతములోని వనపర్వశ్లోకముల తాత్పర్యములను దిద్ది సరి పాఠములను తెల్పిన డాక్టర్ శ్రీపుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నాకృతజ్ఞత తెలుపుకొనుచున్నాను. నేను నిడుదవోలు కార్యభారముచే పోవుచు దారిలో తణుకు వెళ్ళి, అడిగి అడుగగనే ఆలస్యము చేయక క్షణాలలో పీఠికా వ్రాసి యిచ్చిన శ్రీ డాక్టర్ చెరువు సత్యనారాయణ శాస్త్రి గారికి సర్వధా కృతజ్ఞుడను. వారు ఆంధ్ర మాఘ కావ్యములను గురించి పరిశోధన చేసి ఆంధ్రవిశ్వవిద్యాలయము వారిచే పి.హెచ్.డి. పట్టా పొందియున్నారు.

నా ప్రతిని చూచి అనేక సూచనలిచ్చిన డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యము, ఆంధ్రశాఖాధ్యక్షులు, హైదరాబాదు విశ్వవిద్యాలయము గారికి నా సహస్ర వందనములు; కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను. వారు కవి జీవితముపై తమ అధ్వర్యమున పరిశోదింప చేయుట ఎంతో ముదావహము. అప్పుడప్పుడు మంచి సలహాలు ఇచ్చి ఈ గ్రందరచనకు తోడ్పడిన ఉత్పల సత్యనారాయణాచార్య, డా॥ ఓగేటి అచ్యుత రామశాస్త్రి, శ్రీ ఉన్నవ రామమోహన రావు శ్రీ పుల్లేపు రాఘవేంద్రరావు గార్లకు నా కృతజ్ఞతలు తెలుపుకొను చున్నాను.

– గోపినాధ శ్రీనివాసమూర్తి

సీ. రాజనందన శరీర ప్రవర్తన మది, యంతలోఁ గలుగు లా నంతలోన
గుణదోషము లెఱింగి కుత్సితకర్మంబు, వర్జించి దేహి కేవలత ధర్మ
మాచరింపఁగఁ బోలు నంగనాపుత్రగే, హారామవిత్తాదు లరనివెంటఁ
బోవు తాఁ జేసిన పుణ్యపాపంబులు, దప్పక తన వెంటఁ దగిలి వచ్చు
ఆ. ఎఱుక గలమహాత్మ లీయర్థము గ్రహించి, పోవరాని త్రోవఁ బోవ నీక
మనసు నాఁగి పట్టి మహితధర్మమునందె, సంచరింతు రెపుడు సత్యమింత. (గో.రా.అ.2009)

# పీఠిక

డాక్టర్ చెరువు సత్యనారాయణ శాస్త్రి, యం.ఏ, పి.హెచ్.డి
(వ్యాకరణ విద్యా ప్రవీణ, సాహిత్య విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ)

అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతి :
యథాస్మై రోచతే విశ్వం తదేవం పరివర్తతే"

అని ఆలంకారిక దర్శన ప్రణేతల అభిభాషణము. ఈ లౌకిక సంసార మంతయు, బ్రహ్మసృష్టి. అతడు సృష్టికర్త. కానీ ఆతనికి స్వాతంత్ర్యమేదీ ఏమియు లేదు. జీవుల ప్రారబ్ధ కర్మానుసారముగనే యాతడు వ్యవహరింపవలసి యుండును. ఇట్టిదియే ఇంత కింతటిది కావ్య సంసారము కలదు. ఈ అనంత కావ్య ప్రపంచము స్థూలరూపమున అక్షరనిబద్ధమై అనేక భాషా స్వరూపములతో వివిద ప్రక్రియలతో లోకమంతయు వ్యాపించియున్నది. సూక్ష్మరూపమున భావుక హృదయాకాశావకాశమంతయు నిండి మనో నేత్ర పరిదృశ్యమానమై అనంతాకాశము వలె గోచరించుచున్నది. కారణరూపమున ప్రతిభావ్యుత్పత్త్య భ్యాసాత్మకమై త్రిగుణాత్మకమగు బ్రహ్మము వలె, నాదాన్ద్రానందసందోహ ప్రకాశమై భాసించును. ఈ కావ్య ప్రపంచమున ప్రతికవియు నొక సృష్టికర్తయే అగుచున్నాడు. ఒక చతురాననుడై భాసించుచున్నాడు. ఒక విధాతయై అలరారుచున్నాడు. ఈతనికి బ్రహ్మకున్న పరాధీనత లేదు. తనకున్న స్వేచ్ఛ తనది. తన యూహా పోహలు తనవి. తన యాలోచన తనది. తన చిత్తము వచ్చిన రీతిలో తానీ ప్రపంచమును దర్శింపగలడు. కర్తు మకర్తు మన్యదావా కర్తుంచ సామర్థ్యము కలవాడు.

ఇట్టి కవులెందరో పూర్వకాలమునుంచి నేటి వరకు నిరంతరముగా సాహితీసృష్టికి బద్ధ కంకణులై పేరెన్నిక గనినారు వీరిలో కొందరు కవులు మరల మరల జన్మించి పూర్వవాసనా సంస్కార భావ బలప్రభావముతో ఆయా పోకడలతో గ్రంథ రచనలు చేయుచున్నారనుట ఒకానొక అభిప్రాయముగా అందందు వినవచ్చుచున్నది. అయితే పునర్జన్మ విషయమున యదార్థము భగవంతునికే యెరుక గానీ, ఆయా యుపపత్తులు లేశమాత్రముగ నదుకుచునే యున్నవి. ఆయా నిబంధములలో ఆయా పోలికలు వినవచ్చుచున్నవి. ఇట్టిదే మరొక యభిప్రాయము బలవత్తరములైన యాధారములతో రూపు దిద్దుకొనుచున్నది.

భారతీయులకు ప్రధానమైనది ధర్మము. ఇది వేదైక ప్రతిపాద్యము. తదనుస్మారకములు శాస్త్రములు. తదుపబృంహకములు పురాణములు తత్సమాహార రూపములు ఇతిహాసములు. ఇవి ప్రధానముగా, భారతదేశమున ప్రాచుర్యము నందినవి మూడు. భారతము భాగవతము,

రామాయణము. వీనిలో నొకదానికి భారతమునకు పంచమవేదమని ప్రసిద్ధి కలదు. ఇది యుప లక్షణముగా నెంచినచో తక్కినవి రెండు కూడ వేదములే యగును.

వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,

వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా

అని రామాయణ విషయమున ప్రమాణము కలదు. ఇట్లే భాగవతమునకు కూడ తత్తుల్య ప్రశస్తి తక్కువది కాదు. కావున వీనిని పౌరుషేయములైన వేదములనుటలో సందేహింపవలసిన పనిలేదు. వీనిలో నొకదానిని వాల్మీకియు నితరములను వ్యాసుడును నిబంధించిరి.

సంస్కృత భాషలో నున్న ఈ ఇతిహాస త్రయమును నేటివర కెందరో కవులు వారి యవకాశము మేరకు యథాశక్తి యాంధ్రభాషలోని కనువదించిరి. ఈ మూటిని పూర్తిగా ననువదించిన కవి మాత్ర మెవ్వడును లేదు. అయితే ఒక కవి ఈ ఇతిహాసములను మూటిని అనువదించుట జీవలక్షణముగా భావించిన వాడు ఎవడైన అంతటి అక్షరతపస్సంపన్నుడు దైవానుగ్రహమున మూడు జన్మలలో మహాకార్యము సాధించి యుండవచ్చునా – అనునది సామాన్యమైన ఊహ కాదు. దీనికి చారిత్రకములైన యాధారములు మృగ్యములైనను, నిబంధపరములు సంవాద ప్రధానములైన యాధారములు కొన్ని లభ్యము కావచ్చును.

ఈ ఊహతో చూచినచో – భారత బహుపర్వాంధ్రీకర్తయగు తిక్కన సోమయాజి, పోతనయై భాగవతము నాంధ్రీకరించి, వేంకటకవియై రామాయణాంధ్రీకర్త అయ్యెనా అన్నది ఒక విలక్షణమైన, మరియు నంతకన్న సుందరమైన మరియు నంతకన్న తత్త్విబంధ జీవలక్షణముల పునాదిపై నుద్భవించిన యాలోచన కాకపోదు. ఇట్టి యాలోచన శ్రీయుతులు మిత్రులు శ్రీ గోపినాథ వేంకటకవి గారి మనుమని మనుమలు నగు శ్రీ శ్రీనివాసమూర్తి గారికి వచ్చినది. వారికి వచ్చినందుల కీయాలోచనను ఇట్టి ఆలోచన వచ్చినందులకు వారిని అభినందింపక తప్పదు.

---

క॥ మొదలఁ గళా మాత్రుండై, పదపడి యర్థమయి పిదపఁ బరిపూర్ణుండై
విధుఁ డొప్పె నెంత శోభా, స్పదుఁడైనను వృద్ధినొందు జగతిఁ గ్రమమునన్

గీ॥ జగతి దైవంబు ప్రతికూలమగుచునుండ, సాధనములెన్నియున్నను సఫలమగునె
కరసహస్రమున్నఁ బతన కాలమందు, మాత్ర గొన నాఁగెనే హేళి కొక్కటైన ?

గీ॥ పవలు రవిరుచిచే నెద్ది ప్రబలదయ్యె, నట్టి గ్రహగణ మతితమో వ్యాప్తమిని
బొంది మిగులఁ బ్రకాశించెఁ బుడమిలోన, నల్పు లధికులు గారె నీచాశ్రయమున

(శిశు 2– 211, 192, 206)

# సూచిక

(ఇది శీర్షికాను క్రమణిక కాదు. ఏఏ అంశము ఏఏ పుటలలో కననగునో తెలుపునది)





# శ్రీ రాధికా పరిణయము

(రత్నాకర పత్రిక సంపుటి 1, సంచిక 1 మరియు 4 నుండి)

శా॥ శ్రీ రాదాకుచకుంభగందరసకాశ్మీరాంకితోరస్థలుం
డై రాజీవభవాభవాచ్యుతులు తానైయుంట వాణీశివా
శ్రీరామామణులం ధరించె ననగా జెల్వొందు కృష్ణుండు శో
భారమ్యుం జెలికాని వంశభవు గోపాలప్రభుం బ్రోవుతన్ 1

మ॥ అతసీసూనసమానభాసుడగు దైత్యారాతివక్షంబునన్
దతనీలాభ్రము చెంగటన్మెరయు నుద్యచ్చంచలావైఖరిన్
శతమన్యూపలహారమధ్య గత చంచత్పద్మరాగాకృతిం
జతురత్వమ్మునఁబొప్పు భార్గవి గృతిస్వామిన్ గృపన్ బ్రోవుతన్ 2

మ॥ మగువా ! నీకును నాకు రూపమును నామం బొక్కటై యుండు న
ట్లగుటన్ భేద మొకింత లేదు నను నర్ధాంగీకృతం జేసితం
చొగి నల్గన్ దగవే ? యటంచు గిరిజాయోషామణిన్ వేడు నీ
లగళుం డీకృతినాదు బ్రోచు గలకాలంబున్ గృపాదృష్టిచేన్ 3

చ॥ అరుదుగ నాదుమేన మణిహారములున్నవి మీ యురమ్మునం
దరయగ నంటరాని ఫణిహారములే యని గౌరి నవ్వ నా
యురమున రత్నహార మిదెయున్నది చూడుమటంచు తచ్చిర
స్స్ఫురదురహారత్నముల జూపు శివుండు కృతీంద్రు బ్రోవుతన్ 4

మ॥ రహిమీరన్ దివిషన్నదీయుత నభోరత్నాత్మజా వైఖరిన్
మహనీయామలమౌక్తికాన్విత లసన్మాహేంద్ర నీలాకృతిన్
మిహికాంశూస్రరుచి న్వెలుంగుపతి సామేనం దగంజేరి జం
భహరాశ్మద్యుతి నొప్పుశైలజ కృతిస్వామిన్ గృపన్ బ్రోవుతన్ 5

చ॥ సనకసనంద నాది మునిసత్తము లొప్పుగఁ గొల్వ వాక్సతిన్
దనరసనాగ్రభాగమునఁ దప్పక నిల్పి చతుర్ముఖమ్ములన్
బనిపడి నాల్గు వేదముల భావము వారికిఁ దెల్పు పంకజా
సనుఁడు గృతీంద్రునిన్ నృపతిసత్తమునిన్ సతతంబుఁ బ్రోవుతన్ 6

మ. జనతానందిత తాళవృత్తగతులన్ సంగీతసాహిత్యముల్
స్తనయుగ్మం బయి రాగముల్ కళలు విద్యాప్రౌఢి దీపింప సా

రనితాంతశ్రుతివర్ణ రూపకలనన్ రాజిల్లు వాగ్దేవి మ
న్నన నెల్లప్పుడు నాదు నాలుకపయి న్నాట్యంబు గావించుతన్. 7

మ॥ తను సేవించుజనాళి విఘ్నములు సంతాపమ్ములం బొందఁగాఁ
దన కెవ్వాఁడు విభుండు లేక జగతిన్ దా నెంతకున్ మూలమై
వినుతాన్వర్థముగా వినాయకుఁడు నా విఖ్యాతి వాటించు న
య్యనిమేషార్చితపాదు దంతివదనుం బ్రార్థింతు నర్థాప్తికై.

సీ. ఇలఁ నెవ్వఁ డాదికవీంద్రుఁ, డెవ్వాఁడు పు, రాణేతిహాస నిర్మాణ చతురుఁ,
డెవ్వార లధిక సంస్కృత కావ్యనాటకా, లంకార రచనావిలాసవిధులు,
సకల బాషాశబ్ద శాసనుం డెవ్వాఁడు, పరిశిష్ట బారతకరుఁ డెవండు,
రామాయణాదిక గ్రంధంబు లెవ్వారు, జనహితంబుగఁ జేసి వినుతిఁ గాంచి

తే. రట్టి వల్మీకసంభవ వ్యాస కాళి, దాస భవభూతి ముఖసంస్కృత ప్రబంధ
కవుల నన్నయభట్టు తిక్కన హుళక్కి, భాస్కరాదుల మదిలోనఁ బ్రస్తుతింతు 9

చ. సముదితవృత్తి నింపగు రసాలకిసాలము మాని నింబప
త్రముఁ దినుమాడ్కి నీఁగయు ఘృతమ్మును మాని వ్రణమ్ము జేరు
చందమున రహి న్మహాకవికృతంబగు సత్కృతియందుఁ దప్పులే
నెమకుదు; రొప్పులున్నను గణింపరు దుష్కవు లీర్ష్యచే మహిన్. 10

మ. చతురత్వంబునఁ జారుచిత్ర కవితా సామ్రాజ్య సింహాసన
స్థితుఁడైయున్న కవీంద్రుఁ గాంచి కుకవుల్ సిగ్గేది నిందింపఁ ద
త్కృతికిం దత్కవి కేమి యెగ్గు ? ద్విరదశ్రేష్ఠంబుపై నున్న భూ
పతినిన్ గన్గొని క్రిందఁ గుక్క లదలింపం గూసినట్లే కదా ! 11

క. తుమ్మెద పువ్వులె వెదకును, దిమ్మరి కోలంబు పెంటదిబ్బలె వెదకున్,
సమ్మతి నొప్పులె వెదకు ను, దమ్మన సత్కవియు, గుకవి తప్పులె వెదకున్ 12

క॥ తనయంత వలచివచ్చిన, ఘనపదములు గూర్చి చెప్పు కవిపద్యము నూ
తన ముక్తాఫలములచే, నొనగూర్చిన సరముమాడ్కి నొప్పుచునుండున్ 13

తే. సరసశబ్దార్థ సంగతు లెఱుఁగ లేక, పూర్వకవుల శబ్దార్థముల్ బ్రుచ్చిలించి
కూర్పుసమయం బెఱుంగని కుకవిపద్య, ముండు భువి గాజుపూసల దండకరణి. 14

వ. అని యివ్విధంబున నభీష్టదేవతా ప్రార్థనమ్మును సత్కవి బాహూ కరణంబునుంగు కవిని రాకరణంబునుంగావించి శిరీషప్రసూనంబులం గల పేశలత్వంబును సౌగంధిక పుష్పంబులం గల సౌరభ్యంబును బారిజాతలతాంతంబులం గల మాధుర్యంబునుం గల మనోహర శబ్దార్థమ్ములం

గూర్చి సంస్కృతాంధ్రకవు లిచ్చ మెచ్చనొచ్చెంబు లేని సచ్చరిత్రం బొక్కటి యక్కజమ్ముగ రచియింపం దలంచి యున్న సమయంబున.

సీ. వేడ్కతో నిత్యంబు విబుధులు సేవింపఁ, బ్రబల భోగైశ్వర్య పటిమ గల్గి
ప్రజల ధర్మాధర్మ పరిపాలనమునందుఁ, దతబుద్ధి సమవర్తితయును గల్గి
నిరుపమ వాహినీశ్వర సేవ్యమానుఁడై, సముదగ్రభూరితేజంబు గల్గి
యసమానపుణ్యా జనానందకారియై, చతురత త్యాగశీలతయు గల్గి

తే. లోకపాలాంశభవుఁడు భూలోక నాథుఁ, డగుటఁ దల్లక్షణము లన్ని యతనియందె
వెలుఁగు చుండంగఁ జెలికాని కులపయోధి, రాజు వేంకటగోపాలరాయఁ డలరె. 16

సీ. గోరాజ గోరాజ గోరాజులను మీఱుఁ, బ్రతిసృష్టి వైభవ ప్రాభవముల
మదనాగ మద నాగ మదనాగములఁ గేరు, క్షితిధూర్వహణ రూప ధృతుల గతుల
కమలాప్త కమలాప్త కమలాప్తులను మించు, చక్రపాలన కళైశ్వర్య రుచుల
వసురాజ వసురాజ వసురాజులను బోలుఁ, బ్రబల ప్రతాప సౌభాగ్యపటిమ

తే. ననుచు జను లెల్ల వినుతిసేయంగఁ దనరెఁ, జండదోర్దండమండితమండలాగ్ర
ఖండితోద్దండవిమత వేదండ కాండ, శీర్ష మండలుఁ డారాజసింహుఁ డిలను, 17

క. చెప్పిన శ్రీహరి చరితము, చెప్పఁగవలె నొండుగాథఁ జెప్పిన నోటన్
దుప్పరలు రాలినట్లగు, గొప్పగు నమృతంపుసోన గురియునె చెపుఁడీ ! 51

సీ. సకల శృంగార చేష్టావిశేషములకు, లీలా గతులకును మూల మతఁడె
కమనీయ రూప రేఖావిభ్రమాత్యంత, లావణ్యములకు మూలం బతండె
వరకవీశ్వరులకు వర్ణనీయములైన, బహుగుణమ్ముల కొటప ట్టతండె
అనవరతంబు ధ్యానాసక్తులగు యోగి, తతులకు నిర్వాణదాత యతఁడె

తే. నిఖిల నిగమాంతసీమంతినీవతంస, చారు సీమంత భూషితచరణుఁ డతఁడె
అట్టి శ్రీకృష్ణ రాధికాబ్జాక్షి భవ్య, పరిణయము చెప్పకంటె సౌభాగ్య మెద్ది 52

సీ. రచియించితిని మున్ను రామాయణాదిమ, హాకావ్య మాంధ్రకావ్యమ్ము గాఁగ
సరసోక్తులను గృష్ణ జన్మఖండంబును, సంతరించితి సాధుసమ్మతముగఁ
బ్రణుతి కెక్కిన శిశుపాలవధాఖ్య మ, హాకావ్య మాంధ్రకావ్యంబుఁ జేసి
చెలఁగి రాధామాధవుల వివాహంబు శృం, గార ప్రబంధంబు చారుఫణితి

తే. లయ సకల వర్ణనములు గలుగునట్లు, చాల సత్కృపు లందఱు మే లనంగఁ
వెలుఁగుఁ జేసితి నిపు డాంధ్ర దేశ విపిన, ఘన వసంతుండ వేంకటకవివరుండ. 53

# ప్రార్థన

## దుర్గాదేవి దండకము

శ్రీ మత్పరబ్రహ్మరూపా, విపజ్జాల సంహారిణీ, సచ్చిదానంద రూపా, మహాదేవి, నారాయణీ, విష్ణుమాయా, మహాభాగ, బ్రహ్మాది దేవాళికిన్, సర్వలోకాళికిన్, తల్లియున్ నీవ దేవీ! గుణంబున్ రహిన్ దాల్చినన్ ధాత్రి సాకారవౌ దీవు, వేడ్కన్, గుణాతీతవై యున్నవేళన్ నిరాకారవౌ దీవు, జీవుండవున్ నీవ, దేహంబొగిన్ నీవ, యీ రెంటికిన్ సాక్షివై యొప్పు శశ్వత్పరబ్రహ్మమున్ నీవ, వేదాళికిన్ తల్లివై యొప్పు సావిత్రియున్ నీవ, వైకుంఠమం దత్యుతోర స్థలం బందు నిత్యంబు శోభిల్లు పద్మా మహాదేవియున్ నీవ, క్షీరోదధిన్ శేష పర్యంక మధ్యంబునన్ బొల్చు శ్రీ విష్ణునిం గొల్చు క్షీరాబ్ధిరాట్పుత్రియున్ నీవ, స్వర్గంబునన్ వజ్రభృల్లక్ష్మియున్ నీవ, మర్త్యంబునన్ మర్త్య లక్ష్మీ స్వరూపంబు నీ, వెన్న, పాతాళంబునన్ భోగిరాడ్లక్ష్మియున్ నీవ, ప్రీతిన్, నతశ్రేణికిన్ సర్వసంపత్తు లెల్లప్పుడున్ కోర్కితో నిచ్చు విన్నాణియున్ నీవ, నిత్యంబునన్, సత్యలోకంబునన్ బొల్చు భాషా సరోజాక్షియున్ నీవ, గోలోకమం దెప్పుడున్ కృష్ణవక్షస్థలంబందుఁ జెల్వొందు రాధామహాదేవియున్ నీవ, బృందావనం బందు బృందాచరకోరాక్షియున్ నీవ, దాక్షాయణీ దేవియున్ నీవ, శైలాది రాట్కన్యయౌ పార్వతీ దేవియున్ నీవ, సర్వామర శ్రేణికిన్ తల్లియౌ దేవతామాతయున్ నీవ,స్వాహా స్వధా దేవులున్ ధాత్రియున్ గంగయున్ నీవ, నిక్కంబుగా, దేవతాపత్నులెల్లన్ రహిన్ నీకళల్, పూరుష క్లీబ నారీ స్వరూపంబులున్ నీవ, వృక్షాళికిన్ బీజమున్ నీవ, సృష్ట్యంకురం బీవ, విశ్వంభరా దేవియం దొప్పు సద్గంధమున్, వహ్నియం దొప్పు బల్దాహికాశక్తియున్, వారియం దొప్పు శీతత్వ, మాకాశమం దొప్పు శబ్దంబు, పద్మాప్తునం దొప్పు తేజంబు, శీతాంశునం దొప్పు సత్కాంతియున్ నీవ, బ్రహ్మాకృతిన్ సర్గమున్ చేయుచున్, విష్ణురూపంబునం పాలనం బర్థిఁ గావింపుచున్, శంభురూపంబునన్ సర్గ మంతంబు నొందింపుచున్, మూటికిన్ కర్త్రివై యొప్పు భాస్వత్పరాశక్తియౌ దీవు, సద్బుద్ధియున్ దుష్టియున్ పుష్టియున్ గాంతియున్ భ్రాంతియున్ దాంతియున్ శాంతియున్ శ్రద్ధయున్ మేధయున్ నిద్రయున్ భీతియున్ దృష్ణయున్ క్షుత్పిపాసాదులున్ కీర్తియున్ లజ్జయున్ మాయయున్ భుక్తియున్ ముక్తియున్ శక్తియున్ రక్తియున్, భక్తియున్ సర్వమున్ నీవ, నీ సత్ప్రభావంబు వర్ణింపగా, వేదముల్ చాల, వావాణియున్ నేర, దాబ్రహ్మయున్, శేషుడున్, ధర్ముడున్ చాల, రే నెంతవాడన్, దయాదృష్టిచే నన్ను వీక్షించి, దైత్యేశ్వరున్ నాశమొందించి, రక్షించవే, లోకమాతా, సదాచారపూతా, హిమాద్రీంద్ర జాతా, సదా పాహి, మాం పాహి, మాం పాహి ( శ్రీ కృష్ణ జన్మ ఖండము)

# గోపీనాథ వంశవృక్షము

(తెలగాణ్యులు, ఆపస్తంబ సూత్రులు, కౌండిన్య గోత్రులు)

గోపీనాథ వేంకటశాస్త్రి
(కామాక్షిదేవి)

భగవంతుడు — బుచ్చనార్యుడు
(కోనమాంబ)

నరస శాస్త్రి — పరశురామశాస్త్రి
వెంకమాంబ

పద్మనాభుడు — బుచ్చన — భగవంతుడు
వేంకటలక్ష్మ్యంబ

వెంకయ్యశాస్త్రి (గోపీనాథ రామాయణ కర్త – ఇంటిపేరు రామాయణము నుండి)
అనుముల వెంకట సుబ్బమ్మ

పిచ్చయ్య
వేములపాటి పిచ్చమ్మ

సుబ్బయ్య (ఇద్దరు సతీమణులు)
1. వేములపాటి పేరమ్మ, 2. వేములపాటి పిచ్చమ్మ

పద్మనాభయ్య
గాదేపల్లి రంగమ్మ

వేంకట సుబ్బమ్మ
పులుగుండ్ల సుందర రామయ్య

వెంకయ్య
(వేములపాటి సుబ్బమ్మ)

సుబ్బరామయ్య
గాదేపల్లి వెంకటసుబ్బమ్మ

వేంకట శేషమ్మ
గా' దేపల్లి వేంకట సుబ్రహ్మణ్యం

పద్మనాభయ్య (ఇద్దరు సతీమణులు)
1.కలువలపల్లి వరలక్ష్మి 2. మారెళ్ళ దుర్గామహాలక్ష్మి

విశాలక్షి
గాదేపల్లి కృష్ణమూర్తి

సావిత్రి
కొలచల వేంకట ఆంజనేయశర్మ

శ్రీనివాసమూర్తి
గాదేపల్లి వసుంధరాదేవి
(ప్రస్తుత గ్రంధకర్త)

వేంకటసుబ్రహ్మణ్యం
తోటపల్లి రామశేషమ్మ

లలిత — పద్మజ్యోతి — వంశీ కృష్ణ కుమార్

శివకుమార్ — చక్రధర్ (శ్రీధర్‌గా పేరు మార్పు) — శ్రీదేవి — శిరీష

శ్రీరస్తు
• శ్రీ గణేశాయ నమః
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
హరి ఓం నమశ్శివాయ

# గోపినాధ వేంకటకవి పూర్వకవిపరంపర

వేంకటగిరి రాజులకు వేంకటకవిపై గౌరవము

వేంకటగిరి రాజభవనములో అనేక గదులతో అలరారు కొల్వుచావడి కలదు. దీనిపేరు 'లక్ష్మీనివాసము'. ఇది క్రీ.శ. 1783–90 మధ్య కాలములో నిర్మింపబడినట్లు అచ్చటి శాసనము వలన తెలియుచున్నది.

ఆ గదులలో ఒక గది నిత్యపూజ కొరకు ప్రత్యేకించబడినది. పూజా సమయమున తప్ప మిగత వేళల ఆ గది మూసివేయబడి ఉంటుంది.

ప్రతిదినము రాజ పురోహితుడు రాణి వారి నుండి తాళములను తెచ్చి, ఆగదిని తెరచి అందు పూజాదికములు నిర్వర్తించి, తిరిగి ఇంటికి వెళ్ళును. ఇప్పటి రాజపురోహితుని పేరు ఓగోటి గోపాలయ్య. ఈ నిత్య ధూపదీప నైవేద్యములు 13–8–1859 తేదీ నుండి అవిచ్ఛిన్నముగ సాగుచునే యున్నవి. ఆ రోజు పరమ పవిత్రమైనది. ఆనాడే గోపినాధ వేంకటకవి రచించిన శ్రీమద్రామాయణ వ్రాతప్రతి వేంకటగిరి సంస్థానములో దాఖలు చేయబడినది.

అట్టి భక్తి శ్రద్ధా విశ్వాసములతో ఆరాధింపబడే ఆ గదియందు ఏమి విశేషములుండునో చూడవలె ననిపించుట మానవసహజము.

5–1–1992వ తేదీ నాడు ఆ పూజా గృహమును సందర్శించు భాగ్యము నాకు కలిగినది. ఆ భాగ్యమును కలిగించినవారు, సర్వజ్ఞకుమార యాచేంద్ర పరంపరలోని శ్రీ మదనగోపాల్ శ్రీ సాయి కృష్ణ యాచేంద్ర గార్లు వారి ఐదవతరము వారగుట విశేషము.

తలుపు తెరువగనే మనస్సుకు హత్తుకొనేటట్లు కనులకు కనబడిన దృశ్యమిది.

శ్రీకృష్ణ భగవానుని గీతోపదేశము, విశ్వరూప సందర్శనము, గోవర్ధనగిరి ధారణ, రాసలీల, మున్నగు పటములతోను, చిత్రముద్రితములైన తెరలతోను గోడలు కప్పబడి ఉన్నవి. పుట్టపర్తి సాయిబాబా వారి చిత్రము, సర్వజ్ఞకుమారయాచేంద్రుని చిత్రము కూడ ఆ గదిలో కలవు. గది ఈశాన్యపు దిక్కున దేవుని ప్రతిమలు, చిత్రపటములు ఉన్నవి.

గది మధ్యలో పై కప్పు కొక్కెమునకు తగిలింపబడిన గొలుసునకు కట్టిన ఊయల ఉన్నది. ఆ ఊయలలో గోపినాధము వేంకటకవీంద్రుల స్వహస్తలిఖితమైన శ్రీ మద్రామాయణ శ్రీ భగవద్గీతల వ్రాతప్రతులు, శ్రీ కృష్ణ జన్మఖండపు వ్రాతప్రతి మరికొన్ని ప్రతులును ఆ ఊయలలో భద్రపరుపబడి ఉన్నవి.

నాలుగుతరములు మారి నేటి ఐదవతరము వారిచేత కూడ ఆ వ్రాతప్రతులు నిత్యపూజ లందుకొనుట చూడగా వేంకటకవిపై వేంకటగిరి సంస్థానపాలకులకు గల ఆదరాభిమానములు, శ్రీ కృష్ణునిపై వారికి గల అచంచల భక్తి వెల్లడి అగుచున్నది.

ఆ కవి కవితాగంధము పట్టుబడక పోయినను కవివంశీయుడనని చెప్పుకొను భాగ్యము లభించిన నేను ఆ సంస్థాన పాలకులకు నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

గోపినాధ వేంకటకవి పేరు వినగనే మనకు వెంటనే స్ఫురించేది గోపీనాద రామాయణము. అది ఆ కవి తన గ్రంధమునకు పెట్టిన పేరు కాదు. ఆ కావ్యము కవి జీవితకాలములో 1887లో 'శ్రీ మద్రామాయణము' అను పేరునే ప్రచురితమయి కవి పరమపదించిన రెండు సంవత్సరముల తర్వాత వేంకటగిరి రాజులచే మలిముద్రణము 1894లో పొందినపుడు కూడ శ్రీ మద్రామాయణముగనే ప్రచురితమైనది. 1916లో వావిళ్ళవారు ప్రచురణ చేపట్టినప్పుడు 'గోపీనాధ రామాయణము' అను పేరుతో దీనిని ముద్రించి వేంకటగిరి రాజుకు కొన్ని ప్రతులొసంగిరి. అందు మొదటి రెండు ప్రచురణల ఉపోద్ఘాతమే కలదు. గోపీనాధుడు అనగా శ్రీకృష్ణుడు. శ్రీ కృష్ణాంకితమైన రామాయణమను సత్యమును వెల్లడి చేయుచున్నందున గోపీనాధ రామాయణ మను పేరు అన్వర్థముగానే ఉన్నను, వాల్మీకి రామాయణమున కనురూపమైన కావ్యమను భావము లోపించి చదువరి దృష్టికి, చదువకనే స్ఫురింపచేయు భావములోపించినది. వావిళ్ళవారు 1918, 1923 సం॥ లలో పై ఉపోద్ఘాతము తీసివేసి మేడేపల్లి వేంకటరమణాచార్యుల పీఠికతో మాత్రమే ముద్రించిరి.

గోపీనాధ వేంకటకవి కావ్యములలోని శైలీ విన్యాసము, పదగుంభనము, శబ్ద సౌష్ఠవము, రచనాశిల్పము, భావశబలత మున్నగు విశిష్టగుణములను సూక్ష్మ దృష్టితో పరిశీలించిన పోతన, తిక్కన, నన్నయలతో ఈ కవికిగల అవినాభావ సంబంధమే కాక అనంతశక్తి సంపన్నమైన కాలము ఒక మహావ్యక్తిని సృజించి, పునర్జన్మల ద్వారా ఒక మహాకార్య నిర్వహణమునకు దోహదము చేయు ననెడుసత్యము కూడ భావాంబరముపై మెఱుగుతీగ వలె స్ఫురించును.

గోపినాధ వేంకటకవి ప్రాచీనమహాకవుల కోవకు చెందిన వారిలో కడపటివాడని విమర్శకుల అభిప్రాయము. కడపటి వానిలో ముందరికవుల ఛాయలు, పోకడలు ప్రతిబింబించుట

సామాన్య దర్మమే, అయినను గోపినాధ వేంకటకవి విషయములో కొన్ని ప్రత్యేకతలు కలవు. అవి యేవి యన

(1) భారత, భాగవత, రామాయణములు విభిన్న రచనా సరళులను ప్రతిబింబించుచున్నను పూలదండలో దారము వలె వాటిలో ఏకసూత్రత కనుపట్టుచున్నది.

(2) ఒక సమయమున కవిగా అవతరించిన మహామనీషి తన జీవితకాలములో సిద్ధింపచేసికొనలేని మనోవాంఛితములను తీర్చుకొనుటకు పునర్జన్మ నెత్తునని తన జీవితాశయములను పరిపూర్తి చేసికొనువరకు ముముక్షువుగా కొనసాగుచు కడపటి జన్మలో జన్మరాహిత్యము పొందునని మన సనాతన దర్మము ప్రబోధించుచున్నది. మోక్షలక్ష్యమును తెలుపుతూ జన్మ పరంపరలో ఉత్తరోత్త రాభివృద్ధిని సాదించిన విషయమును పై కవుల పీఠిక నుండి తెలుసుకొనగలుగుట ఒక విశేషముగ కనుపించును.

(3) శిరీష ప్రసూన పేశలమైన నన్నయ కవితా స్రవంతి, సౌగందిక పుష్ప సౌరభ్య సంవాసితమైన తిక్కన రసవాహిని, పారిజాత సుమ సుగంధ మాధుర్యము వహించు పోతన కవితా సుధారసధారయు వేంకటకవి కమనీయ కవితలో త్రివేణీ సంగమముగా భాసించె నని వారి రచనలను తులనాత్మక పరిశీలన వలన తెలియగలదు.

(4) నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవుల జీవిత విశేషములను, వారి కావ్యములలోని ప్రార్ధనా పద్యములు, కవితా సంపద, స్వప్న వృత్తాంతములు, షష్ఠ్యంతములు, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములు మున్నగు విషయములను సమన్వయ దృష్టితో సమీక్షించిన బహుముఖమూల వ్యక్తమైన ఏకత్వ లక్ష్యసిద్ధి విశదము కాలగదు.

పైన సూత్రప్రాయముగ సూచించిన విషయములను కూలంకషముగ పరిశీలించుటయే ఈ రచన యొక్క ద్యేయము.

తెలుగు కవులలో వేంకటకవి స్థానము

గోపినాధ వేంకటకవి గౌరవ ప్రాభవములు వేంకటగిరి రాజవంశీయుల యందే కాక, తెలుగు వాఙ్మయ ప్రపంచమం దంతటను వ్యాపించినవి.

తెలంగాణాలోని ఆత్మకూరు సంస్థానపు రాజు తిరుపతి వేంకటకవులను 'శ్రీనివాస విలాసము'ను తెలుగు చేయమని క్రీ.శ. 1897లో కోరగా వెంటనే.

భారతమ్ము తెలుంగు పఱుప రాజనరేంద్ర, నృపతి నన్నయకవి కిచ్చినట్లు

గోపినాద వేంకటకవి పూర్వకవి పరంపర

రామాయణంబు నాంధ్రము సేయుమని మార, నృపతి భాస్కర కవి కిచ్చినట్లు
కాశిఖండము తెల్గుగావింపుమని వేమ, నృపతి శ్రీనాదుని కిచ్చినట్లు
మాఘుమ్ము తెల్గుగా మార్ప వేంకటగిరి, నృపతి వేంకటకవి కిచ్చినట్లు
శ్రీనివాస విలాస మాంధ్రీకరింప, సరస తిరుపతి వేంకటేశ్వరుల కిప్ప
డాన తిచ్చుట మిగుల భాగ్యమ్ము గాదె, ఆత్మకూరు పురీరాజ యతులతేజ

అని వెంకటకవిని, నన్నయ, భాస్కర, శ్రీనాథులతో పోల్చినారు. (నానారాజ. పూర్వ 185)

వావిలి కొలను సుబ్బారావు శ్రీ మద్వాల్మీకి రామాయణమును క్రీ.శ. 1900 సం॥లో తెలిగించుచు అయ్యలరాజు రామభద్రుడు తిక్కన, తిమ్మన, మొల్ల, భాస్కరుడు, కంకంటి పాపరాజు, రంగనాథులందరను ఒక చిన్న కందపద్యమున ప్రస్తుతించి గోపినాధ వేంకట కవిని మాత్ర మొక శార్దూల పద్యమున ప్రశంసించుట ఆనాటి పండితులకు, కవులకు వేంకట కవిపట్ల గల గౌరవమునకు ప్రతిబింబము.ఆ పద్యములను చూడుడు.

క॥ రామాభ్యుదయ కవీంద్రుని, దీమహితుల దిక్కనార్యుఁ దిమ్మన మొల్లాం
బామణి భాస్కరుఁబాపన, రామ కవుల రంగనాథుఁ బ్రణుతి యొనర్తున్

శా॥ శ్రీ రామాయణ పూర్వభాగము రచించెన్ భక్తి నాంధ్రంబుగా
ధీరుం డార్యజనస్తవార్హుడును పృధ్వీదేవతా శ్రేష్ఠుఁ డు
ర్వీరామాత్మభవేశ భక్తుడగు గోపీనాధ వేంకార్యు డా
సూరిం గూర్చి నమస్కరించెదను సత్పూక్తిం బ్రశంసించుచున్

(ఆం. వా–రా–పీఠి–16,17)

ఈ సందర్భమున అభినవ కవి తిక్కన శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారి క్రింది వాక్యములు స్మరణీయము. (సుబోధిని వారపత్రిక సంపాదకుడు మన్నేపల్లి రామకృష్ణారావు సంపుటి 6, సంచిక 43 (15–5–1937)

“మనమండలము మహాకవులకు జన్మభూమి. కవిత్రయములో నిర్వురు మన మండలము వారు. భారతము దొరకొన్నవారు రాజమహేంద్రవరమువారే యైనను కార్య భారమంతయు నెల్లూరి వారే నిర్వహింపవలసి వచ్చి యుండుట సర్వజన విదితము. ఎఱ్ఱన, తిక్కనల వెనుక మనమండలమున బెక్కురు కవులు ఆవిర్భవించినను తిక్కనాదుల వలె మహాకావ్య నిర్మాణ దీక్షాదక్షుఁడైన వాడు నేటి వర్ధంతి పురుషుఁడు గోపినాధ వేంకటకవియే. రసభావబంధురముగ ఉత్తరహరివంశము వ్రాసి సర్వజ్ఞుడని పేరు వడసిన నాచన సోముడు గాని, తిక్కన కంటె జనమనోహరముగ ఉత్తరరామకథను రచించిన కంకంటి పాపరాజు కాని, అమృత కల్పముగ

విక్రమార్కచరిత్రము వ్రాసిన జక్కన గాని, ఓజః కాంతి గుణోపేతముగ సమీరకుమార విజయముందీర్చిన పుష్పగిరి తిమ్మన గాని, మృదుమధురశైలి విష్ణుపురాణము తెలిగించిన వెన్నెలకంటి సూర్యనార్యుడు గాని, దశావతార చరిత్ర నిర్మాత దరణిదేవుల రామయ మంత్రి గాని, యాదవ రాఘవ పాండవీయ కృతికర్త నెల్లూరి వీర రాఘవ కవి గాని, 'వాణి నా రాణి' యన్న పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి గాని, మని మండలములోని యితర కవు లెవ్వరుగాని గోపీనాథుని వేంకటకవి వలె మహా గ్రంధరచన కావించి యుండలేదు".

'భాస్కరుని కవిత పారతంత్ర్యము నెఱుగదు. గోపీనాథుని వాణి స్వతంత్ర పరతంత్రముల రెంటిని యనుభవింప నేర్పరి.'[1] 'ఈ కవి తన కవితా రామణీయమునకు శబ్ద సౌష్టవము పైననే యాధారపడలేదు. అర్ధము నందే దృక్కు నిమడ్పలేదు. కంకంటి పాపరాజు మున్నగు వారి వలె ననర్గళ వేగముతో కవనము నల్లు దక్షత కలవాడు.'[2]

ఏ సుముహూర్తమున యోగి నుండి ఉపదేశమును బడసెనో కాని ఈతని రసనాగ్రమున భారతి నర్తించిన దనుటలో సందేహము లేదు.

ఈ కవి ధారాశుద్ధి, ఓజస్సు, ఔచిత్యములను పాటించుటలో నన్నయ, తిక్కన, పోతనలకు దీటయిన వాడు. ఈ కవి కావ్యములను ఇతర రచనలను నిశితముగ అనుసందానించినచో పైకవిమూర్తిత్రయమే పరంపరాగతముగ అవతరించి త్రివేణీ సంగమువలె వేంకటకవియందు లీన మయినారేమో అని నా అల్పమతికి తోచుచున్నది.

'అనువాద విషయమున మూలమును జాగ్రత్తగ ననుసరించినదయ్యు రచనము కుంటుపడలేదు. శరన్నది వలె ప్రసన్నమధురముగ చివరిదాక నడచినది. తెలుగు శబ్దములపై నీ కవికి మక్కువ యెక్కువయయ్యు మూలమునపై నాదరమున కాబోలు చాలవర కచ్చటి శబ్దములనే తత్సమములు జేసి రచన సాగించినాడు. అనుప్రాసాది శబ్దాలంకారములు మితముగా నాదరింపబడినవి. కాండాంతములందు బంధకవిత్వము కానుపించుచున్నది. ఇతిహాసమున ప్రదానమగు 'నిష్ట' శ్రీమద్రామాయణము నందు వలెనే యిందును సంపూర్ణముగ ననుసరింపబడుటయే ఈ గ్రంధ ప్రశస్తికి మూలము. మూలమునందలి కవితా మాధుర్యము నందించగలుగుటయే దీని కీర్తికి జయపతాక. ఆర్ష కవితా గుణములగు సంయమన శక్తి, అకృత్రిమత యిందుపోసింపబడినది. రచన ద్రాక్షాపాకము' అనునది ఆంధ్ర భాషా సమితి విజ్ఞాన సర్వస్వము నందలి గోపీనాథ రామాయణ పరిచయము. 'ఇతని యథామూల వాల్మీకి

1. ఆంధ్రపత్రిక 1939 ప్రమోదూత ఆంధ్రరామాయణములు కొనదెన బాలకృష్ణయ్య వ్యాసం.
2. వీరేశలింగ యుగం డా॥ కె.యల్. నారాయణ రావు.

రామాయణ మాంధ్రీకృత యధామూలము లన్నిటిలో నుత్తమోత్తమ మైనదని యయ్యె పుస్తకముల నొకేచోట నొకప్పుడే చదివినయెడల పాఠకులకు తప్పక విశద మగునని ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహకర్త అభిప్రాయము.

[1] "మాఘే మేఘే గతం వయః అని సుప్రసిద్ధ కావ్య వ్యాఖ్యాత మల్లినాధుడన్నాడని ఒక వదంతి. ఈ గ్రంధమును వ్యాఖ్యానించుటకే యిట్లుండ చందస్సుందరముగ ననువాదము చేయుట ఎంత కష్టమో ఊహింపవలసినదే." 'పంచ కావ్యములలో నొకటి యగు మాఘము నితడు తెలిగించిన తెఱంగునకు శ్రీనాదుడును దలయూపవలసినదే! శైలి విద్వత్సంస్తవనీయ కవితావేశంబును మెఱయించుచు సలలిత పద ప్రయోగ నైపుణ్యమును చూపుచు చదువచదువ నింపులు పుట్టింపుచున్నది'.[2]

ఆంధ్రకవుల చరిత్రలో కందుకూరి వీరేశలింగం పంతులు గోపినాధ వేంకటకవి నాటికాలమున బహు కావ్యములు రచించిన వాడని, కవిత నాతికఠినమై హృద్యముగ నుండునని తెలిపి ఈతని శైలికి ఉదాహణములుగ ఈ క్రింది పద్యముల నిచ్చినాడు.

రామాయణము

చ॥ ఘనగుణశాలి ప్రాణమున కంటెఁ బ్రియుం డగు రామచంద్రునిన్
జనసుతు నొంటి బంపి నిమిషం బయినన్ మనఁ జాల వంశవ
ర్ధనుఁడగు నట్టి యీతలిరుఁ బ్రాయపు ముద్దుల కుఱ్ఱఁడేల నీ
యనుమతి నేన వచ్చెద సురారుల జంపి మఖంబు గావఁగన్ (గో.రా. –బాల 477)

ఉ॥ చందురువంటి నెమ్మొగము చాఁగెడు కన్నులు వృత్తదంష్ట్రముల్
సుందర పల్లవాధరము సోగకురుల్ మణికుండలప్రభా
బంధుర కర్ణయుగ్మమును బారెఁడు చేతులుఁ గల్గు రాము నిం
పొందగఁ జూడకున్న నిలుపోవఁ దరంబె సుమంత్ర యిత్తరిన్ (గో.రా. అయో 1242)

చ॥ ఇన కిరణాళికిం జొరవయీక సదాగతి రాక కైనఁ బ
ల్చన బడ కర్థి సైకతముఁ జల్లిన రాలఁగ నీక దట్టమై
దనుజ విముక్త కాండములఁ దట్టుచు దిక్కుల రామకాండముల్
కూబ సునిశిత భంగి నిండుటయు/సురల్ వెఱగంది రయ్యెడన్ (గో.రా. అర–410)

ఉ॥ భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జంపుట కై కడంగి సు

---

1. ఆంధ్రప్రభ దినపత్రిక 23–3–1969 ఆంధ్రమాఘము ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.
2. ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము – కవిత్వవేది (వావిళ్ళ ప్రచురణము)

గ్రీవుని తోడ నెయ్యి మొనరించి తదీప్సిత సిద్ధిఁగోరి వ
న్నీవిధిఁ జంపి తట్టి దనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ (గో.రా. కిష్కి - 460)
దేవిని నెందు డాఁచినను దెచ్చి యొసంగనె యొక్క వ్రేల్మిడిన్

ఉ॥ ఓరిదురాత్మ యిందు బుదు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన నొల్లవొ శిక్షలేమి నా
చార విహీనమై సకల సజ్జన గర్హిత మయ్యె నీ మతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడున్ నిజంబుగన్ (గో.రా. సుందర - 485)

మ॥ మరియున్ రావణి సాయకంబులు ధనుర్మౌర్విం దగం గూర్చి బ
ల్గిరు లాడం దెగనిండఁ దీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణ క్షతజాత రక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయన్ బొల్చె విధూమ వహ్నిగతిఁ బుష్పాఢ్య ద్రుమ ప్రక్రియన్ (గో.రా.- యుద్ధ 1954)

కృష్ణ జన్మ ఖండము

చా॥ సలలిత శుద్ధతోయములు చారుమణీదళ పద్మకైరవో
త్పలములు గంధలుబ్ధక సుతాన మధువ్రత గీత నాదముల్
కలరవ చక్ర కుక్కుట మరాళ మనోహర మంజు శబ్దముల్
గలిగి మనోజ్ఞ సంపదలఁ గ్రాలు విశాల సరోవరం బొగిన్ (శ్రీ.కృ.జ. - 3 ఆ)

మ॥ పరికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశ ! కాంతామణీ
పురుష ప్రేమ గుణాతిరిక్త మనిశంబుం బూత చారిత్రయున్
స్మరసారజ్ఞయు సాధ్వియున్ రసికయున్ జాతుర్య సంయుక్తయౌ
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుఁడున్ దద్యంబు చింతింపగన్ (శ్రీ.కృ.జ. - 8 ఆ)

శిశుపాల వధము (మాఘకావ్యము)

శా॥ సామర్థంబున మాఱులేని బల మన్యం; బవ్విధిన్ నీతి వి
ద్యా మర్యాద నెఱింగి పోవు బల మన్యం; బిట్టి లీ రెంటికిన్
నేమం బేర్పడ భూరి తేజమునకుం జీకట్లకుం బొలె బల్
సామానాధికరణ్య మెట్లు గలుగుం జర్చింప లోకంబునన్ (శిశు 1 - 185)

చ॥ అలఘు ధనుఃప్రభావమొ గుణాతి మహత్వమొ ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచు నున్నవో యేమి చిత్రమో
తెలియఁగ రాదు శౌరి సముదీర్ణ శరంబులు చిత్తజల్లు ల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వని పూర్వకంబుగన్ (శిశు 4 - 204)

భగవద్గీత

ఉ॥ మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱు నదీప్రవాహముల్
నిండి చలింపకున్న యల నీరధిఁజేరిన మాడ్కి నెవ్వనిం
దండిగ సర్వకామములు తప్పక చేరు నతండు శాంతుడై
యుండు సకాముఁడైన నరుఁడొందడు శాంతిని పాండునందనా ( శ్రీ.భ.గీ. – 59)

చ॥ అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ నిజంబు నెఱుంగుదు రజ్ఞులైన ని
శ్చలమతిహీను లొక్కయెుగిఁ జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁడగు నీశ్వరుం దెలియఁజాలరు భారత నిక్క మింతయున్ ( శ్రీ.భ.గీ. – 260)

వేంకటకవి జీవితకాలమున జీవించిన కందుకూరి వారు తన కవుల చరిత్రలో ఇన్ని పద్యములు ఉదహరించుటచే వారికి కవిపై గల ప్రియత్వము గోచరించుచున్నది. జనప్రియ రామాయణమును రచించిన పుట్టపర్తి నారాయణాచార్యులు తమ రామాయణ రచన వేంకటకవి ప్రారంభించినట్లు ప్రారంభించుటయే కాక 'మాముడు – గోపినాథ వేంకటకవి' అను వ్యాసమున 'గోపీనాథులు చాల ప్రసిద్ధులైన విద్వత్కవులు. శాస్త్ర పాండిత్యముతో పండి పక్వమైనది వారి సాహిత్యము. ప్రాచీన మహాకవుల కోవకు చెందిన వారిలో వీరుకడపటి వారు' అని ముగించి ఆరచనమునందు వేంకటకవిశైలి సాధారణముగ నిట్లుండు నని క్రింది పద్యము నుదహరించిరి.

శా॥ ప్రాగల్భ్యంబునఁ గొంతుపై బ్రియకు సాంద్రప్రక్రియం దొల్లి యే
రాగం బుద్భవమై హృదంతరమునం బ్రచ్ఛన్నమై యుండె నా
రాగం బప్పుడు మద్యపానమద సంరంభోద్ధితంబై రహిన్
బాగొప్పన్ వెలి కుద్గమించె రయమొప్పన్ నేత్రమార్గంబులన్ (శిశు 2 – 274)

పై విషయమును ధృవపరచునట్లుగా నిడుదవోలు వెంకటరావు 'ఆంధ్రకవితా ప్రపంచంలో ఉత్పథంలో విహరించే కవి అనీ, ప్రాచీన సాంప్రదాయ సిద్ధమైన కవిత్వరచన వేంకటకవితో ఆశ్వాసాంతమైనదనీ విమర్శకులు ముక్త కంఠంతో వినుతించారు. దీనికి మకుటాయమానంగా కందుకూరి వారు ఆంధ్రకవుల చరిత్ర వేంకటకవి చరిత్రతో భారతవాక్యం పలికారు.... గోపినాథ వేంకటకవి గతించిన 5 సం॥లలోనే తిరుపతి వేంకటేశ్వరుల వంటి మహాకవులు వారిని ప్రాచీనులైన నన్నయ, భాస్కర, శ్రీనాథులతో సమాన స్కంధుడని స్పష్టము చేసిరి. ఇదియును నవీనయుగమున ప్రాచీన కవితా ప్రతిభా సంపత్తి సంప్రదాయము నిలిపిన వారిలో వేంకటకవిగారు కడపటివారని నిర్వివాదముగ నిరూపించుచున్న' దని శిశుపాలవధ మహాకావ్యపీఠిక యందు వ్రాసిరి.

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

శ్రీ వీరేశలింగ యుగమున వేంకటకవి శైలి వర్ణనలయం దిట్లుండునని శ్రీ కృష్ణ జన్మఖండ, శిశుపాలవధమునుండి చూపిరి.

ఉ॥ చారు సుగంధి పత్ర విలస త్కమలోత్పల కైరవాళియున్
భూరి సువర్ణపత్ర కవి భూషిత చక్ర మరాళ పంక్తియున్
వారిరుహాంతరస్థ మధుపాన మదోత్కట భృంగరాజ ఝ్రం
గార సుహాభవారియును గల్గి చెలంగె సరస్సులచ్చటన్ (శ్రీ.కృ.జ. – 2 ఆ)

ఉ॥ చిత్రతర ప్రసూన మధుసేవనలుబ్ధ మనోజ్ఞ చంచరీ
కత్రము పల్లవ గ్రసన కామ పికాళి విషాద వల్లికా
దాత్రము కామినీజన వితాన మనోగత మాన ధీరతా
జైత్రము చైత్ర మొప్పె సుమసాయక కేళి రసైక పాత్రమై (శ్రీ.కృ.జ. – 3 ఆ)

ఉ॥ ఆతత జృంభమాణ నిబిడార్భటి జన్యము సెల్లుచుండగా
భీతి యొకింత లేక యరిభీషణబృంహితముల్ సెలంగ వి
ఖ్యాత నగాభవారణచయంబు బృహత్కటి సీమనుండి దా
నాతుల వర్షముం గురిసె నద్రు లొగిన్ సెలయేఱులంబలెన్ (శిశు 4–156)

గీ॥ ద్రావియును మదిరాక్షి మదంబు విడిచెఁ, ద్రావకుండియు వీక్షించి దాని సవతి
మత్తయై యుండె నురిలోఁ జిత్త సుఖమె, భూరి మదహేతు వగుచు నొప్పారు గాదె
(శిశు 2–281)

## వేంకటకవి రచనలు

అట్టి యశోదనుడగు వేంకటకవి శ్రీముఖ నామసంవత్సరమున (1813) కావలి తాలుకా (ఇప్పుడు కలికిరి మండలములోని) లక్ష్మీపుర గ్రామమున లక్ష్మీదేవి పద్మనాభ శాస్త్రి దంపతుల పుణ్యఫలితముగా శ్రీ మంతుల కుటుంబమున జన్మించి నిరంతర శ్రీ రామనామస్మరణ చేయుచు, శ్రీ మద్రామాయణ, భగవద్గీతల పారాయణము నిత్యము చేసిన తర్వాతనే భుజింపుచు, శ్రీ రామనవమి, శ్రీ కృష్ణాష్టమి ఉత్సవములు మహదానందముతో ప్రతి సంవత్సరము జరుపుచు కొందరు వటువులకు విద్యాదానముచేయుచు జీవించి (1) శ్రీ మద్రామాయణము (2) శ్రీ కృష్ణ జన్మ ఖండము (3) శ్రీ భగవద్గీతాశాస్త్రమను మోక్ష గ్రంథము (4) బ్రహ్మా నందశతకము (5) తిరునాళదండకము (6) మారుతి శతకము (7) శ్రీ రామ స్తవము (8) వెలుగోటి వారి వంశావళి కొన్ని పద్యములు (9) తారావళి (10) శ్రీ శిశుపాలవధ మహాకావ్యము (11) శ్రీ రాధికా పరిణయము రచించి శ్రీ సూత సంహిత రచనను ప్రారంభించి పూర్తికాక

పూర్వమే 8-6-1892 నందన నామ సంవత్సర ఆషాఢ శుద్ధ చతుర్దశి ఉత్తరాయణ పుణ్యకాలమున దేహమును చాలించిరి. ఆ దినమునకు ముందు రోజు అనగా 7-6-1892న తన పోషకప్రభువు సర్వజ్ఞ కుమార యాచేంద్రుని శవమును చూచుటకు నగరికి వెళ్ళినపుడు తీసిన ఛాయా చిత్రమును సంవత్సరాది ఆంధ్రపత్రిక (1917 ఏప్రిల్ నెల 5వ తేది) ప్రచురించి, అందు 'వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు మా కెరువిచ్చిన ఛాయా పటము, కవి యవసానమునకు పూర్వదిన మెత్తఁబడినదని తెలియవచ్చుచున్నది. పటము నందలి ముఖ లక్షణమును చూచు నెడల ఈ భక్తుడు శంకారాచార్యు నంతవానిచే ప్రార్ధనీయముగా తలపబడిన యనాయాస మరణము నందినట్లూహింపవచ్చును' అని వ్రాసిరి. అంతేకాక 'తక్కిన సంగతి సందర్భము లెట్లున్నను కవి సహజ పండితుఁడనియు బాల్యమందే యీ (గోపీనాధరామాయణ) గ్రంధరచన కుపక్రమించెననియు ప్రభుసాహాయ్య సన్మానము లపేక్షించియు మోమోటమిలేక తన గ్రంధమును భగవదంకితమే కావించెననియు, కవి కాశ్రయుఁడైన సర్వజ్ఞకుమార యాచేంద్రుడును అంకితా ద్యాడంబరముల కాశపడక యుదారబుద్ధితో గ్రంధవ్యాప్తికి తోడ్పడి కవిని సత్కరించె ననియు స్పష్టపడుచున్నది" అని కూడ వ్రాసిరి.

"గోపినాధము వేంకటకవి తదితర వేంకటగిరి సంస్థానకవుల సాహిత్యసేవ" అను అంశముపై పరిశోధన చేసి మారుతి శతకము, తిరునాళదండకము, వెలుగోటివారి కొన్ని పద్యములు, కొన్ని తారావళి పద్యములు సంపాదించి యిచ్చుటే కాక, గోపినాధుని వెంకయ్య శాస్త్రి సాహిత్య పరిచయము" అను పుస్తకమును ప్రచురించి, వేంకటకవి వేంకటగిరి రాజునకు వ్రాసిన లేఖల ద్వారా బ్రహ్మానందశతకము వేంకటగిరి రాజుభావములని, వాటికి చందోరూపకల్పనే వేంకటకవి చేయవలసిన స్థితి వచ్చినదని నిరూపించిన కాళిదాసు పురుషోత్తంగారికి కవి వంశీయుడిగా నా కృతజ్ఞతలు యిందు మూలముగా తెలుపుకొనుచున్నాను. శతక రచనలోని అయిష్టత, శతకము ముందరి ఇరవై కృష్ణ లీలలచే గ్రహింపవచ్చును.

సత్కవిత్వ లక్షణములు

రసార్ధ గౌరవ స్ఫురణ దలిర్ప సత్కృతులు పూని రచించిన సత్కవిత్వముగా తన కవితా లక్షణము లిట్లు విశదీకరించి యున్నారు.

చ॥ చతురత మీఱఁ బాకములు శయ్యలు రీతు లలంకృతుల్ ధ్వనుల్
వితతరసంబులున్ మఱియు వృత్తులు దోషములున్ గుణంబు లు
న్నతిఁ బరికించి సత్కృతి యొనర్చినఁదత్కృతి లోకపూజ్యమై
యతులిత భంగి వృద్ధిఁ గను నావిధు భాస్కరతారమై, భువిన్ (గో.రా. - పీఠి - 19)

మ॥ అరుదుగ నాణిముత్తెములు హారము గూర్చిన మాడ్కి లో వెలిన్
మెఱుగులు దేఱు శబ్దములు మెచ్చగ గూర్చి రసార్ద్ర గౌరవ
స్ఫురణ దలిర్ప సత్కృతులు పూని రచించిన సత్కవిత్వమున్
సరసకవిత్వ మంద్రు కవిసత్తము లన్యకృతుల్ గణింతురే ? (గో.రా. పీఠి – 20)

క॥ తనయంత వలచి వచ్చిన, ఘనపదములు గూర్చి చెప్పు కవి పద్యము నూ
తన ముక్తాఫలముల చే, నొనగూర్చిన సరము మాడ్కి నొప్పుచునుండున్ (శ్రీ రాధి – 13)

అట్లు చెప్పి తనకు నచ్చిన నడకలుగా చూపిన నడకలలో ప్రఖ్యాతమైన కొందరి నడకలను వేంకటకవి రచన నుండి తెలుసుకొందము

భాస్కరుడు

క॥ మృగపతి కైవడి మృగముల,బెగడం దోలుచు మహీజబృందంబులపై
ఖగముల నెగయం జోపుచు, నగచరవీరుండు ప్రియవిహారము సలిపెన్ (గో.రా సుందర – 6)

నాచన సోముడు

సీ॥ కనకాసనాగ్ర భాగమున నుండెడు నీకు, నీకుశవిష్టర మిచ్చుటెంత
రమణీయ దాన ధారాశాలివగు నీకు, నా యిచ్చు విమలార్ఘ్య తోయమెంత
యనుదిన శాల్యోదనాహారి వగు నీకు, నీ మూలఫలము లే నిచ్చు టెంత
నిరుపమ కాంచనాంబర దారివగు నీకు, నీ వల్క లాజిన మిచ్చుటెంత

తే.గీ॥ భక్తి నేనిచ్చు పుష్కర పత్రపుష్ప, మాత్రమును గైకొనుట గాక మనుజవర్య
తర మెఱిఁగి నిన్నుఁ బూజింప దరమె నాకు, మిమ్ముఁ గనుఁ గొను టంతియె మేలుగాక
(గో.రా. –అర – 198)

శ్రీనాథుడు

సీ॥ గగన కాసారోడు కైరవంబులుఁ గోయఁ, బాచి సాఁచిన హస్తపల్లవంబు
నెఱసిన బలితంపు నిబిడాంధకార కాం, తార సీమకు బృహద్భాను హేతి
ప్రబఃు విభావరీ ప్రతతి ద్రుంపఁగ సానఁ, బట్టించి యెత్తిన పరశుధార
జలజాత వనవాటికలఁ గల్గు జాడ్యంబు, పరిహసింపగఁ బాల్పడ్డ మందు
పయనములు వేకువం బోవు పధికతతికి, దారిఁజూపెడు తెరువరి; దంపతులకు ఁ
బంచశర జన్య విరతిఁ బుట్టించు చతురుఁ, డరుణుఁడుదయించెఁ బ్రాక్పర్వ తాగ్రమందు
(గో.రా. – యుద్ధ – 3320)

అల్లసాని పెద్దన

అటజని కాంచె రామ విభుఁ డంబర చుంబి రసాల భూర్జరీ
కుటజ తమాల తాల వట కుంద కురంటక కోవిదార వి

స్ఫుటు కరవీర లోధ్ర తరు చూత మధూక విశాల శింశుపా
పటల విరాజితం బయిన భాసురవదావము భూరిదావమున్ (గో.రా. – అర–135)

శ్రీకృష్ణ దేవరాయలు

శా॥ అశ్రాంతంబును మ్రోయు నమ్మఖమునం దాలించినన్ దట్టమై
యశ్రాంతస్ఫుటు యాజకోత్తమగు స్వాహానాద మాశ్రావయా
స్తు శ్రౌషణ్ణినదంబు తీవ్రముగ వాసోదీయతాం దీయతాం
చశ్రౌతౌదన మన్నవంబు కృపయా క్షంతవ్య మ న్నాదమున్ (గో.రా. – భాల 331)

ముక్కుతిమ్మన

మ॥ రమణీమున్ను విభుండు నీకు వశుఁడై లాలించు నాఁ డీవు గ
ర్వమునం జేసిన యెగ్గులన్నియును దాఁ బల్మాఱు చింతించి గి
న్కఁ మదిన్ డాఁచిన నీ సపత్నియగు న క్కౌసల్య రాముడు రా
జ్యము బాలించుచు నుండెనేనియు నినున్ సాధింపదే క్రమ్మఱన్ (గో.రా. – అయోధ్య –214)

రామరాజ భూషణుడు

క॥ కలరవమై జతకోకిల, కులరవమై యారవం బకుంఠితగతి వీ
నుల విందై యమృతపు సో, నల పొందై పురము నిండ నలువుగ మ్రోసెన్ (గో.రా.–బాల170)

చేమకూరి వెంకట కవి

ఉ॥ ఎక్కడ నల్కడైనఁ దరళేక్షణ వచ్చునటంచుఁ జూచు నే
యిక్కవఁ జప్పుడైనను మహీసుత పల్కని యాలకించు నే
దిక్కు తళుక్కుమన్న సుదతీమణి మైజిగి గాఁదలంచు లో
నక్కజమైన మోహమున నా రఘునాదుడు భ్రాంతచిత్తుఁడై (గో.రా. –అరణ్య–1086)

పోతన – వెంకట కవుల జీవిత సంఘటనల చిత్రము

వేంకటకవి జీవితములో పోతనను స్ఫురింపచేయు అనేకసంబంధము లుండుట చిత్రము. వారి కాలము నాటి రాజులతో కూడ ఋణాను రూపమైన సంబంద ముండుట కూడ చిత్రమే. వాటిని పరిశీలింతము.

భోగినీ దండకమున పోతన వర్ణించిన సర్వజ్ఞసింగ భూపాలుడు తిరునాళ దండకమున వేంకటకవి వర్ణించిన సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు ఒకే వంశమునకు ఒకే గోత్రమునకు చెందినవారని వెలుగోటి వారి వంశ చరిత్ర తెలుపుతుంది. అట్లే పోతన, వేంకటకవులు ఒకే వంశము, ఒకే గోత్రమునకు చెందిన వారు. పోతన ఆపస్తంభ సూత్రుడు. వేంకటకవి కూడా

ఆపస్తంభ సూత్రుడు. పోతన కౌండన్యస గోత్రుడు. వేంకటకవి కూడ కౌండిన్యస గోత్రుడే. ఇద్దరు శివ, కేశవ భేదములేని వారే. ఇద్దరు శ్రీరామ భక్తులే. ఇద్దరు సహజపండితులే. ఇద్దరు ముందు తమ తండ్రుల వద్ద చదువు నేర్చిన వారే. ఇరువురి ప్రధమ కావ్యములు బాల్యమున రచించి భగవందికితము చేసినవే.

వారిద్దరి జీవితములలో తటస్థపడిన రాజులకు 'సర్వజ్ఞ' అను పేరు ముందు ఉన్నవారే. ఇద్దరు రాజులు శృంగార ప్రియులే. ఇద్దరి రాజులు రేచర్ల గోత్రీయులే. ఇద్దరి రాజులు విద్వాంసులే. ఇరువురు గ్రంధరచన చేసినవారే.

"సర్వజ్ఞ సింగభూపాలుడు రసార్ణవ సుధాకరమను నామాంతరము గల సింగభూపాలీయ నామ కాలంకార శాస్త్రమును సంగీత రత్నాకర వ్యాఖ్యను మరికొన్ని సంస్కృత గ్రందములను రచించి సర్వజ్ఞ బిరుదమును వహించినవాడు. వీనియందు రసార్ణవ సుదాకర మనుగ్రంధము రసనాటకాది విషయమై మూఁ డుల్లాసములుగ రచియింపఁ బడినది. ఇది యత్యుత్తమ గ్రంధము. కావ్యప్రపంచమునకు వ్యాఖ్య యొనరించి మహామహోపాధ్యాయుఁ డనుఖ్యాతి వహించిన మల్లినాధ సూరిచేఁ దన వ్యాఖ్యలయం దచ్చటచ్చటనుదహరింప బడినది. రఘు వంశ షష్ఠసర్గ మందు నిందుమతీ పరిణయ ఘట్టమున 'తాం ప్రత్యభివ్యక్త మనోరధానాం' అను శ్లోక వ్యాఖ్యానమందు "తత్ర శృంగారలక్షణం రసార్ణవసుధాకరే – విభావై రనుభావైశ్చ సాత్వికై ర్వ్యభిచారిభిః" అనునది లోనుగా శృంగారలక్షణము. అనుభావలక్షణము. సింగభూపాలీయంబున నుండి యుదాహరింపబడియె. అలంకారశిరోమణి యందుఁ బ్రతాపరుద్రీయ వ్యాఖ్యయందును, శాకుంతల, బాల రామాయణాది నాటక వ్యాఖ్యలోనగు ననేక గ్రంధముల యందు నీ గ్రంధము ప్రమాణముగాఁ బరిగ్రహింప బడినది" అని శేషాద్రి రమణ కవులు వావిళ్ళవారు 1961లో ముద్రించిన శ్రీ మద్భాగవత పీఠికగా 'భాగవత ప్రశంస' అను శీర్షికను రచించియున్నారు.

సర్వజ్ఞ కుమార యాచేంద్రుని రచనలలో కొన్ని (1) సభారంజని (2) మనస్సాక్ష్యం (3) హిందూమత విరోద భంజని (4) సర్వమత సారసంగ్రహము (5) సహేతుక నీతి శాస్త్రము (6 నాస్తికధ్వాంత భాస్కరము (7) సందిగ్ధ తత్త్వ రాద్ధాంతము (8) గీతార్ధసార సంగ్రహము (9 నిర్గుణవాద నిరాకరణము (10) రత్నషట్కాంగుళీయము.

"వేంకటగిరి వారి వంశములో రసార్ణవసుధాకర కర్త సింగమనీని తర్వాత అంతటి విద్యా పరిశ్రమమును, విద్వజ్జన పరిశ్రమ నేతృత్వమును గల రాజ కవి సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు. ఇతడు కృతి భర్తగానే కాక, కృతికర్తగా కూడ ప్రసిద్ధుడు. సకల విద్యావిదుడని, ఆధ్యాత్మవిధ్యా విచ్ఛేష్ఠుఁడని పండిత ప్రశంసల నందిన విద్వత్ప్రభువు, ఈయన రచించిన గ్రంధము

-లన్నియును వ్యావహారిక భాషకు అతి సమీపమైన సరళ గ్రాంధికములో సందానింపఁబడినవి. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారి గద్య చింతామణిలో నీ గ్రంధభాగము లుద్ధృతమగుట పరిగణార్హము.

సంగీత నాట్య సంబంధి గ్రందమే యాచేంద్రులు కూర్చిన సభారంజని. నాయికా నాయక రస సంగీత తాళ హిందూస్థానీ రాగ తాళ నాట్యాభినయ శబ్ద వాద్య పాండిత్య రహస్యములను నెనిమిది ప్రకరిణములు గలది యిది" వాగ్గేయ కారరత్న శ్రీ హరి నాగభూషణము గారు మెచ్చిన ప్రశస్తకృతి" అని 'ఆంధ్రసంస్థానములు సాహిత్య పోషణము' న తోమాటి దోణప్పగారు పేర్కొనినారు.

పై విషయముల నుండి సర్వజ్ఞ సింగ భూపాల, సర్వజ్ఞ కుమార యాచేంద్రు లిరువురు పండిత ప్రశంసలందిన ప్రజ్ఞకలవారని విజ్ఞానవంతులని సోదాహరణముగ చూచితిమి.

పోతన – వేంకటకవి యోగి వరప్రసాదులు

'మత్ప్రసాద దివ్య మహిమచే' 'కవిత చెప్పలావు గలదు' అని ఇవటూరి సోమశేఖరాధ్యులు అనుయోగి తనకు చెప్పినట్లు పోతన వీరభద్రవిజయమున తెలిపినారు.

'నేను పది య్యాఱు వత్సరంబుల వాడనైయుండుతఱి నొక్కనాడు సింహపురంబు నుండి నృసింహదేవ కళ్యాణోత్సవ సమాలోకన కుతూహలాతి రేకంబున వేద శైలంబునకుం జని యందొక్క మహాయోగి వలన నొక్కవిద్య వడసి తత్ప్రసాద లబ్ద కవిత్వవిద్యా విశేషుండనై" అని గోపీనాథ రామాయణ పీఠిక యందు వేంకటకవి తెలుపుకొనినాడు. కనుక పోతన, వేంకటకవులిరువురు యోగి వరప్రసాదమున ధారాశుద్ధి, మధురపద్య గమనముగ రచించినట్లు వారి వారి కవిత్వముల నుండి తెలిసికొనవచ్చును.

పోతన, వేంకటకవుల రామాయణ రచనాసక్తి

జనశ్రుతి ప్రమాణముగ పలువురు గ్రంధ కర్తలు పోతనకు రామాయణ రచనయం దభిలాష యుండినట్లు పేర్కొనినారు. దానిని పరిశీలింతము.

"ఇతనికి రామాయణము రచింపవలెనని కోర్కె విశేషముగ కలదు. కాని యద్దానిని భాస్కరాదు లదివరకే యాంధ్రీకరించి యుండుటచే నాతని దృష్టి భాగవతముపై దిరిగెనట. ఈ సందర్భమున "బదిరెను భాస్కరుడు లేదా రామాయణము బండ్ల కెక్కింపనా?" యని పోతనామాత్యుడని నట్లు చెప్పుదురు. (ఆంధ్రకవితరంగిణి సంపుటము 6 పుట 200)

'చెనకి చెఱచినాడు భాస్కరుడు గాకుండిన రామాయణము బండ్ల కెక్కింపనా? యను

బమ్మెర పోతనామాత్యుని వాక్యము మనస్సున దోచుటయు ( బ్రతిదిన మెంతో కాలము వ్యర్థగాథలఁ గడుపబడు చుండుట యోజించి మాబమ్మెరపోతన సంకల్పము నేనేం నెరవేర్చ రాదని యూహించి (ఆంధ్రవాల్మీకిరామాయణ ప్రధమ ముద్రణ విజ్ఞాపన నుండి)

రామాయణమునకు ఆదిమకావ్యమని ప్రసిద్ధి కలదు. అట్టి కావ్యము భక్తిరసముతో సమ్మేళనము చెందిన రచన గలదియైన యిది యైహికాముష్మిక సుఖసాధనమున మని సంసారతరణోపాయ మని పోతన కభిప్రాయము గలిగి రామాయణము నాంధ్రీకరించుటకు తలంపు గొనియుండును. కాని భాస్కరాదుల యాంధ్రీకరణ ముండుటచే మిన్నకుండెను. దానియందు భక్తిగుణము లోపించుట చేతనే 'భాస్కరుడు బదరెను గాని రామాయణము బండ్ల కెక్కింపనా?' యని యాతడు తన యాశయము వ్యక్తపరచెను. భక్తి రసోల్బణమున దాని నతి విస్తృతముగా నొనరించెద నని పోతన వాక్యమున కర్థము (పుట 13 పోతన – నిడుదవోలు వేంకటరావు)

ఉ॥ మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జాని కథల్ రచింపక యసత్కద లెన్ని రచించె నేనియున్
వాని కవిత్వ మేమిటికి వాని కవిత్వమహత్వ మేటికిన్

అను పద్యము కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము లోనిది. సామాన్యులకే యట్లుండుననిన శ్రీరామాభక్తులలో శ్రేష్ఠుడైన పోతన కట్టితలంపుండుట సహజమే. దానికి కారణము

'ఆర్షబద్ధమైన భారతీయ సంస్కృతికి ప్రతిబింబముగా నిలచిన రామాయణం మన సమాజంలోని కట్టుబాట్లకు, సత్సంప్రదాయాలకు, జనజీవన సరళికి, ఆదర్శ కుటుంబానికి ఆధ్యాత్మిక సంస్కృతికి, ఒక సువ్యవస్థకు ఒక సుస్థిర రాజ్యపాలనకు సంకేతముగా సంభావిత మవుచున్నది. గురుశిష్యుల సత్సంబంధానికి, తండ్రి కొడుకుల ధర్మవత్సలతకు, అన్నదమ్ముల అనుబంధానికి, ఆలుమగల అనురాగానికి, స్నేహితుల సఖ్యతకు, యజమానుడు అనుయాయుల భక్తి విశ్వాసాలకు, పాలక పాలితుల మధ్యనుండే సద్భావన సదవగాహనలకు రామాయణంలో ప్రతిపాత్ర ఒక ప్రతీక."[1] అట్టి రామాయణములో అయోధ్య సుందరకాండములు భాస్కర రామాయణమున తక్కువ చేయబడి ధర్మ ప్రబోధము తగ్గినది.

క॥ మంతనములు సద్గతులకు, పొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నింతన పూర్వమహోఘుని, కృంతనములు రామనామకృతి చింతనముల్ (భాగ 9–362 )

1. గోపీనాథ రామాయణము తెలుగు విశ్వవిద్యాలయం వారి 'ప్రకాశక విజ్ఞప్తి' నుండి.

అను భాగవత నవమస్కంధములోని పద్యము పోతన అంతరాంతరములో దాగి యున్న రామాయణ రచనా కౌతుకమును బహిర్గతము చేయుచున్నది.

అని 'మదీయ పూర్వజన్మ సహస్ర ఫలంబున శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై' అన్న పోతన భాగవతములోని 'శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ రచనా కుతూహల' ము శ్రీ మద్రామాయణమును గూర్చియేనని గ్రహింపగలము. ఎందువల ననగా భాగవతములోని ఎక్కిన పద్యములందు పోతన భాగవతమనియే ప్రయోగించినాడు. కాని నారాయణ కథ అని పేర్కొన లేదు.

పోతన మహేశ్వర ధ్యానము చేయుచుండ రామాయణ కథా నాయకుడైన శ్రీ రామచంద్రుడు ప్రత్యక్షమై భాగవతమును రచింపమని తెలుపుట చేతనే శ్రీ మద్రామాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలమును వీడి భాగవత రచనకు ఉపక్రమించె ననియు, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములు శ్రీ రామపరముగ వ్రాసినను షష్ఠ్యంతములు శ్రీ కృష్ణపరముల వ్రాయుటచే రామకృష్ణుల కభేదము ప్రకటించె ననియు తలంపవచ్చును.

దానిని సర్వజ్ఞసింగ భూపాలు డంకితము కోరుట జనశ్రుతి.

వేంకటకవి శ్రీ కృష్ణాంకితముగ రచించిన ఈ క్రింది ఆశ్వాసాంత ఆశీర్వచన పద్యము ఋణానుబంధమైన ప్రతిరూపముగ నున్నది.

శా॥ ఈ కావ్య ప్రతిపాదితుం డయిన సీతేశుండు రామప్రభుం
డీ కళ్యాణ కృతీశ్వరుం డయిన శ్రీ కృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధి కరులై చంచత్కృపా పూర్ణతన్
లోకస్తుత్య కుమారయాచ ధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్ (గో.రా. – బాల –1351 )

ఈ సందర్భమున నన్నయ మంగళాస్తుతిరూపముగ నున్న 'శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ' శ్లోకము వలె శార్దూలవృత్తమైన 'శ్రీ రాస్తాం మనుమ క్షితీశ్వర' అను ఆశీర్వచన రూపముగ నున్న తిక్కన నిర్వచనోత్తర రామాయణ శ్లోకమును గుర్తు చేసికొనుట ఉచితము.

పోతన, వేంకటకవులకు రామకృష్ణుల సాక్షాత్కారము

పోతన ఒకనాటి చంద్రగ్రహణంబున గంగలో స్నానము చేసి తీరపు టిసుక తిన్నెపై మహేశ్వర ధ్యానంబు సేయుచు కించు న్మీలిత లోచనుండయి నున్న యెడ

సీ॥ మెఱుగు చెంగటనున్న మేఘంబు [illegible]పడి, నువిద చెంగట నుండ నొప్పువాడు
చంద్రమండల సుధాసారంబు పోలిక, ముఖమునఁ జిఱునవ్వు మొలచువాడు

వల్లీయుత తమాల వసుమతీజము భంగి, బలు విల్లు మూఁపునఁ బరఁగు వాఁడు
నీలనగాగ్ర సన్నిహిత భానుని భంగి, ఘన కిరీటము దలఁ గల్గువాఁడు
ఆ॥ పుండరీక యుగముఁ బోలు కన్నులవాఁడు, వెడదయురము వాఁడు విపుల భద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా, కన్నుగవకు నెదురఁ గానఁ బడియె

(భాగ – 1–14)

ఏనా రాజశేఖరునిం దేఱిఁజూచి భాషింప యత్నంబుజేయు నెడ నతండు దా రామ భద్రుండ మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగు నని యానతిచ్చి తిరోహితుండయ్యె' నని పోతన భాగవతమున తెలుపుకొనెను.

జననం బాదిగ రామపాదయుగళీ సంసక్త చిత్తుడైన వేంకటకవి 'దర్మార్థకామ మోక్ష ప్రదంబును బురాణముని కథితంబును సకల విద్వజ్జన సేవ్యంబునగు నొక్క మహాకావ్యంబు భగవత్ప్రీతి కొఱకుం కవిజనానుమతంబున రచియింపం దలంచి యట్టి కావ్యం బెయ్యది యా మహాప్రబందరాజంబునకు నాయకరత్నం బెవ్వండొకో యని విచారించుచున్న నమయంబున

సీ॥ లలిత హాసము వాఁడు రతిరాజు ఋతురాజు, వలపించు రహిమించు చెలువువాఁడు
మొగులు వన్నియవాఁడు మురి పెంపు మురిపెంపు, దుళకించు చక్కని గలమువాఁడు
కొమరుప్రాయము వాఁడు కమలారి కొమరొలిఁ, బురణించు సొబగైన మోమువాఁడు
వలుద చెక్కులవాఁడు బంగారు పొంగారు, వలి పెంపు జిగి మించు వలువవాఁడు
తే. గీ॥ చారుకోటీర కేయూర సారహీర, హార కుండల ధాళ ధళ్యముల వాఁడు
బర్హిబర్హావతంసుండు పరమపురుషుఁ, డొకఁడు కలలోనఁ జూపట్టె నుత్సుకమున

(గో.రా. పీఠి –22)

తే.గీ॥ ఏను గృష్ణుండ యుష్మ దహీన భక్తి, కలరి యీ పుట్టువునకు నత్యంతకీర్తి
సౌఖ్యము లనంతరంబ మోక్షం బొసంగఁ, దలఁచి సాక్షాత్కరించితిఁ దపము కలిమి

(గో.రా. – పీఠి – 29)

వ॥ వత్సా నీవు పవిత్రంబులైన మదీయ దివ్యావతార చరిత్రంబులలోన నీ కభీష్ట మెయ్యది దాని మదంకితంబుగా నాంధ్రభాష రచింపు మక్కావ్యంబు నిర్విఘ్నంబుగాఁ బరిసమాప్తి నొందించు నట్టిభారం బేను బూనెద నీకును నీవు రచించిన కావ్యంబునకు నభ్యుదయ పరంప రాభివృద్ధి యగునట్లుగా నను గ్రహించెద నీ కీజన్మంబు దక్క నొండు జన్మంబు లే దీ జన్మాంతంబునఁ బునరావృత్తి రహితంబైన పరమపదంబుఁ బ్రాపించెదవు అని శ్రీ కృష్ణపరమాత్మ చెప్పినట్లు వేంకటకవి గోపీనాధ రామాయణమున తెలుపుకొని యున్నారు.

బాల్య రచనమైన వేంకటకవి రామాయణము

ఉ॥ ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబు... వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము బాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగాన్ (భాగ– 1 – 11)

వి భాగవతమున రచించిన పోతనకు మహేశ్వర ధ్యానము చేయుచుండ శ్రీరామచంద్రుడు త్యక్షమై భాగవతమును రచింప మని ఆనతివ్వగా తను భాగవతము రచించి నట్లు ఎసికొంటిమి. కనుక తీరని కోరిక పునర్జన్మ హేతువని భగవద్గీత.

అట్టి పరమభక్తుడు రూపొందెనా యను నట్లు

చిత్తంబు హరిగుణ చింతనంబుల యందు, శయములు విష్ణుపూజనము లందుఁ
బాదంబులు రమాధిపతి భజనము నందు, వీనులు విభుకథల్ వినుట యందు
శిరము కైటభదైత్యహర నమస్కృతు లందు, రసన గోవింద కీర్తనము నందు
జక్షువుల్ హరిరూప సందర్శనమునందు, గాయంబు శౌరి కైంకర్యమందు
సంతతము గీలుకొల్పి ప్రసన్నబుద్ధి, నన్య మేమియు నెఱుఁగక నవ్విభుండె
శరణ మని నమ్మి కొలుచుచు ధర శరీర, యాత్ర సలుపుదు సన్మార్గ మధిగమించి
(గో.రా. పీఠి–52)

జననం బాదిగ రామపాదయుగళీ సంసక్త చిత్తుండనై
జనితోత్సాహమునం దదీయ కరుణా సంలబ్ధ నానాకళా
ఖనినై తద్గుణ వైభవ ప్రచురమై కన్పట్టు రామాయణం
బనువొందన్ విరచింతుఁ బ్రౌఢ కవితా వ్యాపార మేపారగన్ (గో.రా. పీఠి – 53)

అని తన స్వగతము విన్నవించుకొని 'యీ పూర్వ రామాయణంబు భాస్కరాదు లొక్కమర్త్యునిం గృతినాథునిం జేసి రచించి రిది సమీచీనంబు గా దిమ్మహాకావ్యంబునకు మానాథుండె కృతినాథుండైన పదియాఱువన్నె బంగారునకు మాణిక్యంబు తోటి సంపర్కలబ్ధి లిగిన చందంబున నధికోదయంబై యుండు గదా యని తలంచి యీ రామాయణ కావ్యంబు కొలుతం గుశలవుల వలన రామరూప ధరుండైన నారాయణుండె వినియెఁ గావున నేనును క్రమంబున శ్రీకృష్ణరూపధరుండైన రమావల్లభునిం గృతినాథునిం జేసి యీపుణ్యకావ్యంబు చియింప నిశ్చయించితి' అని విన్నవించుకొనెను. పోతన తలపెట్టిన నారాయణ కథ ఈ ధముగా పరిపూర్తి అయినట్లు వేంకటకవి అప్రయత్నముగ బాల్యముననే మొదటి కావ్యముగ

రచించిన ఈ రామాయణములోని ఆయా శబ్ద ప్రయోగముల బట్టి ఒకే అక్షరత్వమని (దేహాంతర ప్రాప్తి పొందిన ఒకే వ్యక్తి అని) తలంప వచ్చును.

భోగినీ దండక, తిరునాళదండక రచనా బంధము

'ఇమ్మనుజేశ్వరాదముల' అని పాలకవర్గమైన రాజులలో నెట్టివాని నైనను 'అదమునిగ' భాగవతమున వ్రాయుటకు పోతన జీవితమున తగిన హేతువు ఉండి ఉండవలెను. అది భోగినీ దండక రచన తదుపరి సర్వజ్ఞ సింగ భూపాలుడు పోతనపై చూపిన దుర్ప్రవర్తనగా భావింపవచ్చును భోగినీ దండకము పోతన రచనమని శేషాద్రిరమణ కవులు వావిళ్ళవారి భాగవత 1961 ప్రచురణమందు 16–10–1922న నందిగామ గ్రామమందు వ్రాసినట్లుగా కనవచ్చును. అందలి విషయమిది.

'భాగవత దశమస్కంధములోని దండకమునకుఁ భోగినీ దండకమునకు శైలియందు దారతమ్యము లేదు. అంత్య నియమాదులయం దెట్టి వ్యత్యస్తము గాని, కూర్పు బిగితనమునఁ దెట్టి మార్పు గాని, యల్లికయందుఁ బొల్లుగాని కానరాదు. బోగినీ దండకముఁ జదివినచో బోతన కృతము కాదన నోరు రాదు. తాను జెప్పినట్టు పోతనామాత్యుడు వ్రాసుకొనిన పద్యము కానవచ్చుచుండ నీ విషయమున సందేహమే యనవసరము. పోతరాజు పేరుతో సమకాలికులుగాని యావలి కవు, లాతని కర్తృత్వముతో నీ దండకము రచింప వలసిన ప్రసక్తి లేదు. పోతరాజు రచించి నటుల నాతని స్వతంత్రభావము లాదండకములోఁ గొలదిగనో, గొప్ప గనో లేకపోలేదు. పోతరాజు స్వతంత్రశీలుడు. కాననే కల్పించుకొని, రాజుల దురాచారములను దుస్తంత్రములను, నా దండకమునందు స్వతంత్రముగ నిమిడించి యున్నాడుచూడుడు.

'రాజుల్ బహువ్యాజులే భోజులే చంచల చ్చిత్తులే మత్తులే వ్రేతకాయత్తులే దోషసంసిక్త సంపాదులే వీతమర్యాదులే వారి సేవింప ఖేదింప రంధ్ర జీవింపఁ బోరామిఁ గావింపఁగా రాదులే

సర్వజ్ఞకుమార యాచేంద్రుడు వేంకటకవిచే వేంకటగిరిలోని కాశీవిశ్వనాధ స్వామి–అన్నపూర్ణ దేవాలయ వర్షోత్సవ తిరునాళను తిరునాళ దండక మనుపేర రచింపచేసెను.

పోతన భోగిని దండకము సర్వజ్ఞసింగ భూపాల వర్ణనతో ప్రారంభము. తగణదండకము తిరునాళ దండకము సర్వజ్ఞకుమార యాచేంద్ర వర్ణనతో ప్రారంభము. తగణ దండకము. పోతన భోగిని దండకము బాల్యమున వీరశైవుడై ఉన్నప్పుడు రచించినట్లు జనశ్రుతి.

శ్రీరామ, శ్రీకృష్ణ కావ్యములే రచించిన వేంకటకవి విశ్వనాధ–అన్నపూర్ణల దేవాలయమున జరుగు కళ్యాణమును వర్ణించు తిరునాళ దండకమును క్రీ.శ. 1879 సర్వజ్ఞ

కుమార యాచేంద్రుడు పదవీ త్యాగము చేసిన సంవత్సరమున రచింప చెయుట, ఇది యొకటి వేంకటకవి శివపరమైన రచనయగుట విశేషము.

భోగిని దండకములో సర్వజ్ఞసింగ భూపాలుడు, తిరునాళ దండకములో సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు, విశేషముగ వర్ణింపబడుట గమనార్హము. పోతన భోగిని దండక ప్రారంభమిట్లున్నది.

'శ్రీ మన్మహా మంగళాకారు, నాకార లక్ష్మీకుమారున్, కుమారీ మనోరాము...

సింగభూపాల గోపాల గోపాలికా కృష్ణ గోపాలు, గోపాలదేవోత్సవ క్రీడలో ...

వేంకటకవి – తిరునాళ దండక ప్రారంభమిట్లున్నది.

'శ్రీ మించు వెల్గోటి వంశాబ్ది రాకా శశాంకుండు బంగారు యాచక్షమానాధ సత్పుత్రకుం డా కుమారాంక యాచక్షితీంద్రుండు శ్రీ కాశికానాధ విశ్వేశ్వర స్వామికిన్ రంగు మీరంగ వర్షోత్సవం బర్థి సేయింప నుద్యుక్తుడై ...' అని ప్రారంభించి మన్నె కంఠీరవా ! రాయవేశ్యభుజంగా!!! జయస్తే! జయస్తే! జయస్తే! యటంచున్ ... రహిన్ మాగధ శ్రేణి కైవారముల్ సేయగా సద్గుణాలంకృతుండై మహీమండలం బర్థిఁ బాలించె" అని ముగియుచున్నది. రాయవేశ్యాభుజంగా అనుపదము సర్వజ్ఞ సింగ భూపాలుని కూడ గుర్తుచేయు పదమని గమనించుట ఉచితము. దీనిని రాజ రాజునకు నన్నయ, మనుమసిద్ధికి తిక్కన, సర్వజ్ఞసింగునకు పోతన ప్రయోగించుట విశేషము.

భాగవతమును పాతిపెట్టించుట, రామాయణమును పూజించుట

పోతన రచించిన భాగవతమును

"సర్వజ్ఞసింగ క్ష్మావరుం డది దన, కిమ్మని వేడిన నీయకున్న

నలిగి యాపుస్తకం బవనిఁ బాతించినఁ, జినికి యం దొక కొంత శిథిలమయ్యె

నని సర్వలక్షణసారసంగ్రహమున కూచిమంచి తిమ్మకవి క్రీ.శ. 1740 ప్రాంతమున చెప్పెను.

వేంకటకవి రామాయణమును రచించుట వినిన సర్వజ్ఞకుమార యాచేంద్రుడు కూడ వేంకటకవిని పిలువనంపించుట, తను కవి గ్రామమునకు వెళ్ళుట, వేంకటకవి నాస్థానకవిగ నియమించుట క్రీ.శ. 1860 శాలివాహనశక వర్షములు 1782 సిద్ధార్థి నామ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణమినాడు మార్కెల్ల సీమలో చేరిన "పెరుగుపల్లి" అను గ్రామమును దానపత్రము వ్రాయించి యిచ్చుట. [1] శ్రీ కృష్ణాంకితమైన రామాయణ వ్రాతప్రతి శాశ్వతపూజ చేయునట్లు పూజా గృహము నందుంచి పూజించుట, రామాయణ ప్రచురణ ప్రచార భారము వహించుట పోతన

---

1. శ్రీ భగవద్గీతాశాస్త్రము వావిళ్ళ ప్రతి 1951 పీఠిక

– వేంకట కవుల సర్వజ్ఞసింగ భూపాల, సర్వజ్ఞకుమార యాచేంద్రుల అనుబంధమును కూర్చున ట్లున్నది.

అంతేకాక పండిత మాత్సర్యమిషగా సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు వేంకటకవిని వేంకటగిరికి పిలిపించి శ్రీ కృష్ణ జన్మఖండమును శ్రీరామాంకితముగ రచియింపమని కోరుట, శ్రీ రామాంకితముగ భాగవతమును పోతన రచింపగా దానిని తన కివ్వమని సర్వజ్ఞ సింగ భూపాలుడు కోరిన కోరిక ప్రతిహారముగా కానవచ్చి పైఅనుబంధములను దృఢపరచునదిగా నున్నట్లున్నది.

భాగవత రచన తన కంకిత మిమ్మన్నందుకు శ్రీకృష్ణజన్మఖండమును శ్రీరామాంకితముగ కోరుట

కవివర్య ! నీవు రాఘవ చరిత్రంబు కృ, ష్ణాంకితం బొనరించి యాంధ్రభాష
రచియించితివి తొల్లి రమణతో నిపుడు శ్రీ, బ్రహ్మకైవర్త పురాణ మందు
సలలిత శ్రీకృష్ణ జన్మ ఖండంబు రాఘ, వాంకిత మొనరించి యంచితముగ
నంధ్రభాష రచియింపు మని యానతి యొసంగి ( శ్రీ కృ.జ. – పీఠిక)

గోపినాధ వేంకటకవికి జరిగిన అసాధారణ గౌరవమునకు అసూయపడిన ఆస్థాన కవులు రామాయణములోని శైలీ భేదమును కారణముగ చూపి అది ఏకకవి కృతము కాదని సర్వజ్ఞ కుమార యాచేంద్రుని మది కెక్కునట్లు చెప్పిరి. ఆ సందేహ నివృత్తికి సమాధానంగా పై పద్యమును చెప్పిరి.

వేంకటకవి 'చిత్తము మా గ్రామమునకు పోయి గ్రంథము పూర్తిచేసి తెచ్చెదనని చెప్పిరి. ప్రభువుల వారు 'అట్లుకాదు. వలయు సౌకర్యము లిచ్చెదము. తమ రిచ్చటనే యుండి, గ్రంధమును వ్రాయుడు. ఏ రోజు వ్రాసిన చిత్తు, ఆ రోజు మాకు చూపుచుండవలెను! అని చెప్పి ప్రభువుల వారు నెలకు మూడు వరహాల గౌరవ భృత్తి చొప్పున, ఇద్దరు వ్రాయసకాండ్రను నియమించిరి.

వేంకటకవి ఉదయముననే కూర్చుని ఒకరు పురాణమునందలి శ్లోకమును, వ్యాఖ్యను చదువుచుండ విని తాము చెప్పిన పద్యమును రెండవవాడు వ్రాయునట్లు ఆదేశించినారు.

ఉ॥ కీర్తియు భోగసంపదలు కేవల మోక్ష మొసంగు రామునిన్
భర్తను జేసి వ్యాసముని భావితమై దనరారు బ్రహ్మకై
వర్తపురాణ మందుఁ దెలుపం బడు శ్రీహరి జన్మఖండమున్
గార్తిక కౌముదీ రుచిర కావ్యముగాఁ నొనరింప బూనితిన్ ( శ్రీకృ.జ. –పీఠి)

అని ప్రారంభించి 11 గంట లగునప్పటికి నూరు పద్యములు రాజుగారికి పంపి తానింటికి పోవుచుండెను. ఇట్లు ఆరు ఆశ్వాసములు వ్రాసిన పిదప ప్రభువు వేంకటకవిని (గ్రంథము పూర్తికాక మునుపే) పిలిపించి సత్కరించెను. సోమసాని గుంట యనుగ్రామమునకు రాధాకృష్ణపుర మని పేరుపెట్టి దానిలో పండ్రెండవ భాగము నొసంగి దుందుభి నామ సంవత్సర శ్రావణ బహుళ అష్టమి రోజున దానపత్రము వ్రాయించి యిచ్చి [1] గ్రంథము పూర్తి కాగానే గజారోహణము చేయించెను.[2] (సుబోధిని వారపత్రిక 15–5–1937 సంపుటి 6, సంచిక 43)

ఇది భాగవతమును తన కంకిత మివ్వమని పోతనను సర్వజ్ఞ భూపాలుడు కోరిన దానికి 'ఇమ్మను జేశ్వరాధముల' అని భాగవతమున తనను అధమునిగా పేర్కొనినందుకు పోతనను పరోక్షముగ బాధించిన దానికి ఋణానుబంధ ప్రక్రియగా భావింపదగును.

ఆ ఋణానుబంధము ఇప్పుడు తెగుచున్నదనుటకు ప్రతీకగా వేంకటకవి మొదటి కావ్యమైన రామాయణముననే

చ॥ నృపతుల వేడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతి వాజిర
త్నపట ధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపుల కృపాపయోధి యదువీరుని వేఁడినఁ బ్రీతి నిచ్చు ని
త్య పథము నట్టివానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్ (గో.రా. పీఠి – 17)

అని రచించుట, అది తనకంకితము కాకపోయినను రాజు సత్కరించి, ప్రచురించి ప్రచారము చేసి తన ఆస్థాన కవిగ నిలుపుకొనుట ఋణాను బంధమును ధృవపరచుచున్నది. భాగవతమున షష్ఠ్యంతములు యదువీరుని పేరున నుండుట గమనార్హము.

సంపూర్ణ ఋణాను బంధ సాదృశము

పోతన చేత ఇమ్మనుజేశ్వరాధముల' అని పేర్కొనబడిన సర్వజ్ఞసింగ భూపాలుడు పండితుడు, కవి, శృంగారప్రియుడని శ్రీనాథాదులు వర్ణించి యున్నారు. అట్టివాడు పోతనచే భోగిని దండకము శృంగార చరిత్ర వర్ణింపచేసి యున్నాడు. తదుపరి చరిత్ర మనకు తెలియక పోయినను ఆ సర్వజ్ఞ సింగ భూపాలుడే తన తప్పునకు పరితపించి, సర్వజ్ఞ కుమారయాచేంద్రుడిగ పుట్టి ఋణ పరిహారమునకు వేంకటకవి యింటికి వచ్చి పిలిపించెనా అనునట్లు "నా రాజన్య శేఖరుండు భారత, భాగవత, రామాయణ ప్రముఖ నిఖిల పురాణంబులఁ బరిశోధించి భాస్కరాదులు రచించిన యాంధ్రరామాయణంబులందు వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణంబునం గల

1. వెలుగోటి వారి వంశ చరిత్రము పుట 159. 2. నానారాజు సందర్శనము పూర్వార్థము –29 లోని ' ఏ రాజు కవిరాజు నేనుంగు నెక్కించి, యూరేగఁజేసే నీ యూరి యందు'.

యర్థం బంతయు సమగ్రంబుగాఁ గథితంబైనయది గాదనియు భగవదంకితంబు గాకున్న వనియుఁ దలంచి యిమ్మహాకావ్యంబు గీర్వాణంబున కన్యూనాతిరిక్తంబుగాఁ భగవదంకితంబుఁ జేసి యాంధ్రభాష రచియింప సమర్థుండగు పండితుం డెవ్వండో యని విచారించుచు నేనిక్కావ్యంబు గీర్వాణంబున కనురూపంబుగాఁ బద్యప్రబందంబుఁ గావించుట యంతయు విని ప్రీతిపూర్వకంబుగా నన్ను రావించి ... మద్విరచితంబైన యాంధ్రరామాయణ కావ్యం బంతయు సమగ్రంబుగా నత్యాదరంబున నాకర్ణించి యిది మదీయాభిప్రాయ ప్రకారంబున గీర్వాణంబున కనురూపంబై శ్రీ కృష్ణాంకితం బై యున్నదని బహూకరించి నన్ను సత్కరించి లోక హితార్థంబుగా నిమ్మహాకావ్యంబు జగంబునందు విస్తరిల్లం జేసి శ్రీ రామభద్రుని యపారంబైన కృపారసంబునకు బాత్రభూతుండయ్యె'[1] అని వేంకటకవి చేత పోతన ఋణానుబంధక్రియనా అనునట్లు సర్వజ్ఞకుమార యాచేంద్రుని

మ॥ గణనాతీత గుణోన్నతుండును ద్రిలోకఖ్యాత చారిత్రుడుం
బ్రణుత ప్రాభవు డివ్విభుండు ధ్రువుడో, ప్రహ్లాదుఁడో యావిభీ
షణుడో యంచు బుధుల్నుతింప భగవ త్పాదసేవనాసక్త వీ
క్షణ చిత్తంబులకుం బ్రియుం' డై (గో.రా. పీఠి – 64)

అని వర్ణించి రాజ పాండిత్యమును

సీ॥ అలతర్క శాస్త్రయుక్తు లుపన్యసించు చో, గణుతింప రెండవ గౌతముండు
బహువిధశబ్ద నిష్పత్తిఁ గావించుచోఁ, దలపోయ నపరపతంజలి యగు
నఖిల వేదాంత శాస్త్రార్థ తత్త్వ విచార, మందు సాక్షాజ్జనకాధిపుఁ డగు
నలిఁగావ్య నాటకాలంకార కవితా ప్ర, ముఖ విద్యలం దన్యభోజ నృపతి
తే॥ యుత్తరోత్తరయుక్తి నొండొక సురేజ్యుఁ, డతుల గాంధర్వ విద్యయం దనుపమాను
డనుచు జనములు దనుఁ గొనియాడ వాసి, కెక్కె సర్వజ్ఞ యాచమహీవరుండు
(గో.రా.పీఠి 66))

వర్ణించుట జన్మాంతర వాసనల ప్రభావముగ వేంకటకవి చేత బ్రహ్మానందశతకమను కామగ్రంథమును రచింపచేయుట, దానికి వేంకటకవికి వచ్చిన చెడ్డ పేరును రూపుమాపుటకు సర్వజ్ఞ కుమార యాచేంద్రుడే గీతార్థసార సంగ్రహమున ఉపోద్ఘాతముగా

'వసుదలో యోగ్యములైన విద్య లనేకములు గలవు. వాటి నన్నిటిని సాధించుటకు నెంత బుద్ధిమంతున కైనను శక్యము గాదు.

1. గోపినాథ రామాయణము పిఠిక పుట 10

ముఖ్యమైన విద్యలు

అయితే యీ విద్యలలో ముఖ్యమున సద్వారకముగ నైహికాముష్మిక పురుషార్ధ సాధనములైన విద్యలు రెండు గల వవి, యెవ్వి యనిన నైహిక ఫలములలో స్త్రీ పురుషులకు బ్రహ్మానందలేశ సన్నిభమైనవియు, భగవల్లీలా ప్రపంచమునకు వృద్ధికరమైనదియునై శృంగార రసప్రధానమైన రతి విద్యయు నా ముష్మికఫలములలో ముఖ్యమైన మోక్షమును గలుగజేసెడు సర్వవిధ్యాసారమైన యాధ్యాత్మ విద్యయు, నీ రెండును ధర్మార్ధకామ మోక్ష రూప పురుషార్ధములలో సుఖరూపములైన కామమోక్షరూప పురుషార్ధములకు అర్ధదర్మములు సాధనములైనవి. మరియు నితర విద్యలవలె నెంత ద్రవ్యవంతునకైన నెంత బుద్ధిమంతునకైన నెంత శక్తిమంతులకైన సద్వారములు గాకుండ సాక్షాత్తుగానే సాధింపదగి యున్నవి. గావున శ్రీకృష్ణ దాసుండనైన వెల్గోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రాభిధానుండ నగు నేను యీ విద్యలను ప్రసాదించునట్టి యనేక గ్రంధములను జూచి చక్కగా పెద్దలవలన బోధపరచుకొని బహుదినములు పరిశీలించి మొదల మాయాస్థాన కవీశ్వరులైన గోపినాధం వెంకయ్య శాస్త్రుల వారికి జక్కగా తెలియజేసి వారి వలన శృంగార రస ప్రధానమైన బ్రహ్మానంద శతకమును సీస పద్యములుగ జెప్పించినారము. ఆ పద్యములలో నుండెడి భావ మిప్పటి జనులకు చక్కగా బోధపరచుకొనునట్టి యోగ్యత లేకపోయినందున నధ్యాత్మవిషయమైన యీ గీతార్ధ సారసంగ్రహమనియెడు గ్రంధమును పద్య రూపముగ జేయించక నందరికీ తెలియుటకు నింగిలీషు గ్రంధము రీతిగా తెలుగు మాటలతో రచించుచున్నాడను" అని వేంకటకవి బ్రహ్మానంద శతకమును తన (సర్వజ్ఞ కుమార యాచేంద్రుని) భావములకు పద్య కల్పన మాత్రమే చేసెనని చెప్పుట వాఙ్మయ చరిత్రలో అపూర్వము.

అంతేకాక

అనిశము భోజరాజ సభయందు జెలంగెడి కాళిదాసు చా
డ్పున మహిఁగృష్ణ రాయ సభఁ బొల్పగు బెద్దన సూరి భంగి న
త్యనుపమైన యాత్మ సభ యందు మహాకవినై చెలంగు ( శ్రీ. కృ. జ పీఠి)
వేంకటకవి రచించిన శ్రీ మద్రామాయణములోని క్రింది పద్యము.

చా॥ అలస సమీరురాక విషమాయె మనోహర కీర శారికా
కలకల కంఠనాదములు కర్ణకఠోరము లాయె పండు వె
న్నెల కడువేడి యాయె విరితేనె చవు ల్వెగటాయెఁ దమ్ముడా
నలిన దళాయతాక్షి గహనంబునఁ బాసిన నాఁట నుండియున్ (గో.రా. యుద్ధ –99)

సర్వజ్ఞ కుమార యాచేంద్రుని ముఖమున పలుమార్లు వర్ణించుచుండుట సంపూర్ణ ఋణాను బంధ క్రియనా అనిపించును.

గోపినాధ వేంకటకవి పూర్వకవి పరంపర

వేంకటకవి రామాయణము పోతన రచనా పద్ధతిని గుర్తు చేయు భక్తి రచన

రామాయణావతారిక పద్యమిది

శా॥ శ్రీ మీఱన్ వనజా సనాదికులు ప్రార్థింపన్ ఖలశ్రేణి సం
గ్రామక్షోణి జయించి సాధుజనులన్ రక్షించి భూభార ము
ద్దామ ప్రీతి హరించి ధర్మమును సంస్థాపింపఁ గృష్ణాకృతిన్
భూమానందముతో జనించిన కృపాపూర్ణుం హరిం గొల్చెదన్ (గో.రా. – పీఠి – 1)

ఇక్కడ శ్రీ అనగా (త్రివర్గము) ధర్మ మార్గమున అర్థకామముల ననుసరించుట ధర్మో రక్షతి రక్షితః అన్న ధర్మ సూత్రము నతిక్రమింపగా వచ్చిన సంకటములను రూపుమాపుమని బ్రహ్మదేవుడు విష్ణుదేవుని ప్రార్థింపగా దుష్టశిక్షణ, శిష్టరక్షణలకు ధర్మ స్థాపనమునకు శ్రీ మహావిష్ణువు నీలనీరదశ్యాముడైన (శ్రీకృష్ణమూర్తి) రూపమును దాల్చిన పరబ్రహ్మమును ప్రార్థించెదను. ఇది రామాయణ కథాసూచకమైన అవతారిక పద్యము. 'పరిత్రాణాయ సాధునాం' అన్న శ్రీ కృష్ణ వాక్కునకు రూపము. ఈ పద్యములో కవి ఏ కోరికలను కోరలేదు.

శా॥ శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకు నై చింతించెదన్ లోక ర
క్షా కారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దాన వో
ద్రేక స్తంభకుఁగేళిలోల విలస ద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండ కుంభకు మహానందాంగనా డింభకున్ (భాగ – 1–1)

అన్న పోతనగారి అవతారికలో కూడ శ్రీ అనగా త్రివర్గము అని మొట్టమొదటి భాగవత ప్రతిలో పురాణం హయగ్రీవ శాస్త్రి పేర్కొనియున్నారు. ఇందు భాగవత కథ సూచన కలిగి 'మోక్ష కాంక్ష'ను వ్యక్తము చేయుచున్నది.

భాగవతములోని లక్ష్మి సరస్వతులకు రామాయణ లక్ష్మి సరస్వతులు అనురూపులు

పోతన లక్ష్మి

మ॥ హరికిన్ బట్టపుదేవి పున్నెములు ప్రో వర్థంపు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీ గిరిసుతల్ తో నాడు పూబోణి తా
మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేముల వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్య కళ్యాణముల్ (భా.గ. 1–9)

వేంకటకవి లక్ష్మి

చ॥ కలశపయోధి పుత్రి యలకాంచనగర్భునిఁ గన్న తల్లి క
ల్వల దొర తోడఁబుట్టు హరివల్లభ లేములఁబాపులేమ సాం

పలరఁగఁ బద్మషండముల యందు వసించెడు తన్వి లచ్చి నా
కెలమి సమస్త సంపదల నిచ్చి కృతార్థుని ( జేయుఁగావుతన్ (గో.రా. పీఠి –2)

పోతన సరస్వతి

ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందరవేణికి రక్షితా నత
శ్రేణికిఁ దోయజాత భవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుకవారిజ పుస్తక రమ్య పాణికిన్ (భా. గ 1– 6)

వేంకటకవి సరస్వతి

శా॥ వీణా పుస్తక పాణి షట్పద లసద్వేణిన్ బృహత్సైకత
శ్రోణిన్ బద్మజురాణి సర్వసుగుణక్షోణిన్ బురాణిన్ నతేం
ద్రాణిన్ నేత్రజితైణిఁ బాదగత గీర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత
శ్రేణిన్ వాణి నభీష్టసిద్ధికి మదిన్ సేవింతు నశ్రాంతమున్ (గో.రా పీఠి –6)

పోతన భాగవతములోని బ్రహ్మదేవునికి శ్రీకృష్ణజన్మ ఖండములోని బ్రహ్మప్రతి రూపము.

పోతన బ్రహ్మ

ఉ॥ ఆతత సేవ సేసెద సమస్త చరాచర భూత సృష్టి వి
జ్ఞాతకు భారతీ హృదయ సౌఖ్య విధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మష జేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల తాపసలోక శుభప్రదాతకున్ (భాగ – 1–3)

వేంకటకవి బ్రహ్మ

తే॥ తివిరి తపసుల కోర్కులు తీర్చుదాత, శ్రిత పరిత్రాత భారతీ చిత్తనేత
భూత నిర్మాత కుశల సంధాత ధాత, చెలఁగి దీర్ఘాయు వొసగి రక్షించు గాత (కృ.జ. పీఠి)

పోతన రచనము అంత్య ప్రాసలకు పెట్టిన పేరు. ఇది అతని రచనలయందు సర్వత్రా కాననగును. పోతన తర్వాత అంత్య ప్రాసలను ఎక్కువ వ్రాసిన కవిగా పేరుపొందినవాడు వేంకటకవి.

ఈ సందర్భమున గోపీనాథ రామాయణ పీఠిక యందలి మేడేపల్లి వేంకట రమణాచార్యుల వారి "శ్రీ మద్భాగవతము నాంధ్రీకరించిన బమ్మెర పోతనామాత్యుని కవిత్వము వలె నీతని కవిత్వమును సంస్కృత పద బహుళమై మిగుల రసవంతముగా నున్నది. అనేక విధములగు శబ్దాలంకారములలో నీ కవి పోతన వలె నంత్యప్రాస నియమము నీతని కృతులయం దెల్లడ

మెండుగ 'బ్రయోగించి యున్నాడు. ఈ యంత్య ప్రాస నియమము పోతనామాత్యుని కవిత్వమం దతిమనోజ్ఞముగా బ్రకాశించిన విదంబున నితర కవుల రచనలయం దెచ్చటను గానము ... ఈ రామాయణ కర్తయగు వేంకట కవియు, బోతన ననుకరించి యీ యలంకార విశేషమును దన గ్రంధముల యందుఁ బలుచోట్ల స్థాపించెను" అను వచనములు స్మరణీయము.

పోతన, వేంకటకవుల పూర్వపుణ్య విశేషము.

'మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపః ఫలంబున శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై' అని పోతన విన్నవించుకొనగా వేంకటకవి 'నేను బహుజన్మ కృత సుకృత పరిపాకంబున నిమ్మహా కావ్య రాజంబు దొరకొనయెఁ గదా యని సంతసిల్లి రామాయణ కథా ప్రపంచ విరచనా దక్షుండనై యాభిముఖ్యంబు నొందితి' అని రామాయణమున తెలుపు కొనెను.

వాల్మీకి రామాయణములోని రహస్యములను, అంతరార్థములను, వివిధ సందర్భములలో వాల్మీకి వాడినపదములను అనేకగ్రంధజ్ఞానమున సమన్వయపరచి వివరించునది వ్యాఖ్య. పలువురు విద్వాంసులు అనేక భావనాపరంపరలు తమ వ్యాఖ్యలలో వెదచల్లిరి. వాటిని తెలిసికొనక వాల్మీకి రామాయణ సౌందర్యములను సమగ్రముగ నానందింప లేరు.

అట్టి వ్యాఖ్యలు లేని తెలుగు వాఙ్మయమున తెలుగు ప్రజలు మూల శ్లోకభావముల నన్నిటిని చదివి పొందు ఆనందము వంటి ఆనందమును ప్రసాదించు ఆది కావ్యముగ వేంకటకవి చిన్న వయసున్నన తెలిగింప గలుగుటకు పూర్వజన్మ విశేష మవసరము కదా. ప్రపంచవాఙ్మయములోనే అతి పెద్ద కావ్యములలో రెండవదిగా ప్రసిద్ధి కెక్కిన కావ్యము వాల్మీకి రామాయణమని గుర్తు చేసికొనుట ఈ సందర్భమున ఉచితము.

ఈ పూర్వ పుణ్య విశేషము చేతనే వీరశైవుడై బాల్యమున వీరభద్ర విజయము రచించి తదుపరి భోగిని, అనువేశ్య ప్రేమించి సర్వజ్ఞసింగ భూపాలుని పొందు పొందిన వృత్తాంతమైన భోగినీ దండక రచన చేసిన పోతన పండితలోకమున అనేక మనో సంక్షోభములు పొంది యుండును. ఈ సందర్భమున ఇటీవలి కాలముననే శృంగార ప్రధానమైన బ్రహ్మానందశతకము రచించి దుష్ప్రచారమునకు పాలయిన వేంకటకవిని గుర్తుచేసి కొనుట సమంజసము.

పై సంక్షోభమునే పోతన 'ఇమ్మనుజేశ్వరాధముల' అని భాగవతమున సర్వజ్ఞసింగ భూపాలుని ధ్వనించి యుండును. ఈ భాగవతములోని పద్యము పండితముఖమున సర్వజ్ఞసింగ భూపాలుని చెవిని చేరియుండును. దీని పర్యవసానమే రాజభటులు భాగవతమును పాతిపెట్టి పోతనను బాధించియుండి యుండవచ్చును.

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

పోతనగారి 'ఇమ్మనుజేశ్వరాధముల' 'బాల రసాల సాల 'పద్యముల ప్రతిబింబిత అను రూపములే వేంకటకవి క్రింది పద్యములు.

చ॥ నృపతుల వేఁడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతి వాజి ర
త్న పట ధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపుల కృపాపయోధి యదువీరుని వేఁడిన బ్రీతి నిచ్చు ని
త్యపదము నట్టివానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్ (గో.రా. పీఠి – 17)

చ॥ వృజిన మటంచుఁ జిత్తమున నించుక చూడక కావ్యకన్యకన్
గుజనుల కిచ్చి నిందితపుఁగూడు భుజించెడు వాని కుర్విలో
సుజనత గల్గనే బుధులు చూచి గణింతురె వాని పొండితిన్
నిజముగ వాఁడు పాత్రమగునే మధువైరి ప్రసాద దృష్టికిన్ ( శ్రీ కృ.జ. పీఠి)

'ఇమ్మను జేశ్వరాధముల' 'బాలరసాలసాల' పద్యములు ఉత్పలమాల వృత్తములో నుండుట వేంకటకవిపై పద్యములు రెండును చంపకమాల వృత్తములుగ నుండుట, ఉత్పలమాల చంపకమాలగ మారు సౌలభ్యముండుట గమనించిన ఆపద్యములు వారి రూపాంతరమునకు సంకేతమేమో!

పోతన, వేంకటకవుల అసాధారణ గుణములు

సాధారణముగ కవులు తమ పూర్వపరంపరగా తండ్రి, తండ్రి తండ్రి, తండ్రి తండ్రి తండ్రులను వారి గుణములను వర్ణింతురు. కాని తల్లిని వర్ణించుట సాధారణముగ చూడము. కనుక తల్లిని వర్ణించుట అసాధారణ ప్రక్రియ. నమాతుః పరదైవతం (తల్లిని మించిన వేరుదైవములేదు) అను సత్సూక్తి ననుసరించి పోతన వీరభద్ర విజయమునందు భాగవతమునందు తల్లినిట్లు వర్ణించినాడు.

ఉ॥ పావనగంగ భోగశచి భాగ్యపుగౌరి గభీరభూమి సం
భావన కుంతి రూపగుణ భారతి సంపదలక్ష్మి దేవి సం
సేవిత సంజ్ఞ నిశ్చలవిశేష యరుంధతియైన లక్క్మ దాఁ
గేవల కన్యయే తలఁప గీర్తన సేయఁదగున్ ధరాస్థలిన్ ( వీర వి. పీఠి –37 )

ఉ॥ మానిను లీడుగారు బహుమాన నివారిత దీన మాన స
గ్లానికి దానధర్మ మతిగౌరవ మంజులతా గభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివ పాదయుగార్చనానుకం
పానయ వాగ్భవానికి బమ్మెరకేసన లక్కసానికిన్ (భాగ – 1–24)

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

జన్మాంతరమున కూడ అట్టి గుణములు వీడరని భగవద్గీత తెలుపుతుంది. వైకుంఠ ద్వారపాలుకుడైన జయుడు వైరత్వమున త్వరగా వైకుంఠము చేరగోరి హిరణ్యకశిప, రావణ శిశుపాలురుగా పుట్టిరి. రావణుడు శిశుపాలునిగా పుట్టు విషయమును వర్ణింపుచు 'వరసతి యైన కాంత వలె వారక సుస్థిరమౌ స్వభావమున్ ధర ప్రతిజన్మయం దవి తద్దయు పూరుషు నొందునే కదా' అని స్వభావమును తెలుపును.

శ్రీమద్రామాయణములోని వేంకటకవి పద్యములను గ...ంచిన వేంకటకవి – పోతన యొక్క అసాదారణ గుణమును కలిగిన ట్లనిపించును. చూడుడు.

తే.గీ॥ నయవిశారదుఁడగు పద్మనాభునకుఁబు, రంధ్రి వేంకట లక్ష్యంబ రహి వహించె
గలిమిజవ్వని యన నెల్ల కడల సిరులు, పరఁగ వెదజల్లు జలజాతపాణి యగుచు

క॥ హరునకు నుమ మధుకైటభ సం, హరునకు రమ పద్మయోని కలవాణి నిశా
కరునకు రోహిణి క్రియ నా, సరసున కద్దేవి ధర్మచారిణి యయ్యెన్ (గో.రా. పీఠి –50)

ఆ॥ చంద్రశేఖరునకు శైలజ కెనయగు, పద్మనాభునకు బరఁగ లక్ష్మి
కొనర వేంకటాఖ్య నుదయించితి సుమార, మదనుఁ డనఁగ నేను మహిమ వెలసి

ఇందలి 'మహిమ వెలసి' ని పూర్వజన్మ సుకృతఫలముగ భావింపదగును.

మూలములందు లేకపోయినను పోతన భాగవతమునందును, వేంకటకవి రామాయణము నందును గంగావతరణము పత్యేక వచనముగ వర్ణించుట వలన భవనాశని యగు గంగపట్ల వారిద్దరకును గల అపార గౌరవము వ్యక్తమగుచున్నది. విష్ణు పాదోద్భవము, శివజటాజూటలందు హరిహరప్రతీకగా గల గంగను పోతన, వేంకట కవులు వర్ణించినట్లు భావింపదగును. పోతన వచనమిట్లు ప్రారంభమగుచున్నది.

"ఇట్లమ్మహానది పురారాతి జటాజూట రంధ్రంబువలన దిగంబడి నిర్గళ ప్రవాహంబై యిలకుం జల్లి నెఱసి నిండిఁపెల్లు వెల్లుగొని, పెచ్చురేగి విచ్చలవిడిఁగ్రేపు వెంబడి నుఱక క్రేళ్ళుఱుకుచు...." (శ్రీమద్భాగవతము)

వేంకటకవి గంగవర్ణన

"శంకర జటాజూట తటాదివాసుఁడగు హిమకరుని కిరణంబు లన్నియు సర్వతోముఖత్వంబు మాని యేకీభవించి యక్కురంగలాంఛనుని శరీరంబున నుండి దీఁగసాగి పఱతెంచుచున్న చందంబున నందంబై..." (గోపీనాద రామాయణము బాల–851 )

పోతన రచనలకు వేంకటకవి రచనలకు పోలికలు కానవచ్చుచున్నవి.

| పోతన రచనలు | వేంకటకవి రచనలు |
|---|---|
| నారాయణ శతకము | మారుతి శతకము |
| | రామస్తవము |
| శ్రీమద్భాగవతము | శ్రీమద్రామాయణము |
| | శ్రీ భగవద్గీతాశాస్త్రము |
| | శ్రీ కృష్ణ జన్మఖండము |
| భోగిని దండకము | తిరునాళ దండకము |
| | బ్రహ్మానందశతకము |
| వీరభద్రవిజయము | శిశుపాలవధ మహాకావ్యము |
| | శ్రీ రాధికా పరిణయము |

మనము పోతన – వేంకటకవి, సర్వజ్ఞ సింగభూపాల – సర్వజ్ఞకుమార యాచేంద్రుల ప్రవర్తనములు, జనశ్రుతి, కావ్యముల ప్రతిబింబించిన విధమున పరిశీలించితిమి. పోతన – సర్వజ్ఞసింగభూపాలుర ప్రవర్తన వేంకటకవి – సర్వజ్ఞకుమారయాచేంద్రుల ప్రవర్తనలు ఋణానుబంధ రూపమున ఉన్నవని గమనించితిమి.

శివుని ధ్యానముచేయు పోతనకు శివుడు కనబడక శ్రీరాముడు కనబడి 'భవబంధంబులు తొలగును: భాగవతమును రచింప'మని చెప్పుటవలన రామాయణము శ్రీకృష్ణాంకితముగ రచింప తలపెట్టిన పోతనకు కథానాయకుడైన శ్రీరాముడే కనబడి భాగవతము రచింపమని చెప్పుట చేతనే రామాయణ రచన మాని భాగవత రచన చేసియుండవచ్చు నని ధ్వనించు విషయమును కూడ గమనించితిమి. ఈ కోరిక తీర్చుకొనుటకే 'నీకిష్టమైన కావ్యమును రచింపుము. నీకు భవబందములు ఈ జన్మముననే తొలగు నని శ్రీకృష్ణుడు వేంకటకవికి చెప్పిన విషయమును కూడ గమనించితిమి. అయినను ఏ కావ్యమును రచింపవలసినది అంతవరకు తలపెట్టని వేంకటకవి రచించినది రామాయణమే.

'మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున' అని వ్రాసుకొనిన పోతనకు భవబంధంబులు తొలగు ననుటలో ఒకజన్మ అతిచిన్న విషయ మనియు, రామాయణ రచనాకాంక్ష తీరుట అతి ముఖ్యమనియు కనుక 'ఒనరన్ నన్నయ, తిక్కనాది కవులీయుర్విన్ అను పద్యములో విన్నవించుకొనిన 'పునర్జన్మంబు లేకుండగన్' అనునది 'ఈ జన్మముననే' అని లేనందున ఒక్క జన్మకు విశేషముగ పరిగణింపవచ్చుననియు శ్రీరాముని చరిత్రమును పూర్తిచేసి మోక్షమును పొందుట కన్న పోతనకు కావలసినది ఏముండుననియు తలంప వచ్చును.

పై విషయముల నన్నింటిని కూలంకషముగ పరిశీలించి పోతన – వేంకటకవి ఒ అక్షరునిగ పరిగణించు భావబలము కలదని తెలిసికొంటిమి.

వేంకటకవిలో నన్నయ ప్రభావము

శ్రీమద్రామాయణము తెలిగింప పూనుటకు ముందు వేంకటకవి వాల్మీకి మహర్షి నిట్ల ప్రార్థించినారు.

శా॥ వ్యాప్తిన్ రామకథా సుధార్ణవము నిత్యంబున్ దమిం గ్రోలియున్
దృప్తిన్ జెందని పుణ్యు నాదిమకవిన్ దివ్య ప్రభావాఢ్యునిన్
సప్తార్చిః ప్రతిమాన పింగళ జటాసందోహు నుద్యత్తప
స్తప్తుం గొల్చెద నిష్టసిద్ధికి మరుత్సంపూజ్యు ప్రాచేతసున్ (గో.రా. పీఠి – 35)

అట్లు ప్రార్థించగా వాల్మీకి ప్రత్యక్షమై శ్రీమద్రామాయణ రచనకు ఎప్పుడెప్పు డేమేమి జరిగినద తెలియజేయు యోగశక్తి (బ్రహ్మదేవుడు వాల్మీకి కిచ్చినది) వేంకటకవి కిచ్చి మాయమయ్యెనట చూడుడు. వాల్మీకి ప్రార్థనలోని 'యోగ విస్ఫురితు' దీని కన్వయము.

క॥ అని యమ్మునిఁ బ్రార్థించిన, బనిగొని ముద మలర నాకుఁ బ్రత్యక్షంబై
తన కజు డొసగిన తెల్విని, ఘనముగ నా కొసగి చనియెఁ గారుణ్యమునన్ (గో.రా. పీఠి– 36

దీనిని బట్టి వేంకటకవి వాల్మీకి అంశ అని వేంకటకవి చెప్పుకొనినట్లు తలంప వచ్చును తనను ఒక అలౌకిక శక్తి రచింప చేయుచున్నదని ధ్వని.

వేంకటకవి చెప్పుకొనుటేకాక వేంకటకవి రచనలను చదివిన, వేంకటకవి ప్రతిభావ్యుత్పః భ్యాసములచే కవి ప్రతిభ బయల్పడును. అట్లు పరిశ్రమించిన కవి, పండితులు వేంకటకవిః ప్రాచీనమహాకవుల కోవకు చెందినవారిలో కడపటి వాడని ప్రశంసించినట్లు తెలుసుకొంటిమి

వేంకటకవి వాల్మీకి మహర్షి రచించిన మూలరామాయణములోని భావములను మూలమునక అనురూపముగ వ్యాఖ్యానములులేని తెలుగు ప్రజల కనుగుణముగ రచించుటచే వాల్మీకి అంశ అః చెప్పుకొనవచ్చును.

ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి అని విశ్వనాథ సత్యనారాయణే కాక పలు కః పండితులు చెప్పుటచే నన్నయ వాల్మీకి అంశ అని గ్రహింపవచ్చును.

పై రెండింటిని సమన్వయించగా వేంకటకవి–నన్నయ ఒకే అక్షరుడు కావచ్చునన అభిప్రాయము కన్పించును.

నేను నన్నయనే అని ధృవపరచుకొరకేనేమో నన్నయ కవితాధార, వేంకటకవి కవితాధాః రెండు అనర్గళ గంగాప్రవాహము వలె అభేదమై కన్పట్టుచున్నవి. వేంకటకవి సమాసఘటనః

నన్నయను పోలినదే. శంతనుడు యోజనగంధిని చూచిన సందర్భమునందలి నన్నయ పద్యమిది.

ఉ॥ దాని శరీర సౌరభము దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరా కృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసముం గడుముదంబున గాంచి మనోజ బాణ సం
తాన హతాత్ముడై నృపతి దాని కిట్లనియెం బ్రియంబునన్ (భార – 1–4–172)

పై పద్యములో (హత+ఆత్మ) హతాత్ముడై (పరమపదించినవాడై) అను పదమును ప్రయోగించిన నన్నయ అక్షరుడను నేను అని తడవతడవకు చెప్పుచున్నాడేమో అనునట్లు వేంకటకవి అటువంటి అనేక పద్యములు తన రామాయణమున తిరిగి తిరిగి రచించి చదువరి దృష్టికి మరుపురాని విధముగ ఆపద్యమును మలచినాడు. ఉదాహరణమునకు మూడు పద్యములను వేరువేరు సందర్భములలో ప్రయోగించినవి మాత్ర మిచ్చుట చూడవచ్చును.

ఉ॥ దాని మనోహరాకృతియు దాని యపూర్వ విచిత్ర కాంతియున్
దాని గతి ప్రమాణమును దాని సమగ్ర విహార దాక్ష్యమున్
దాని విలోచనద్యుతి ఘనంబుగఁ జూచినయంత సీతకుం
బూనికఁ దత్పరిగ్రహణ బుద్ధి జనించెను దైవికంబుగన్ (అరణ్య – 718)

ఉ॥ వీరి మనోజ్ఞవేషములు వీరి వచోరచనా చమత్కృతుల్
వీరి విలాస వైఖరులు వీరి మృదుస్వర కల్పనంబులున్
వీరి కళాకలాపములు వీరి సమంచిత గాన సాహితుల్
చారుతరంబులై ముద మొసంగుచునున్నవి మీరు వింటిరే (బాల–173)

ఉ॥ వీని భుజావిజృంభణము వీని సమున్నత శౌర్య సంపదల్
వీని శరాస నైపుణము వీని మహాద్భుత జన్య కర్మముల్
దానవ సిద్ధ సాధ్య సుర దైత్య మహోరగు లందు నెందునున్
గానము చూచినంత బలఘుస్మరుఁడైన నుతింపవల్వదే (సుందర–1083)

అక్షరరమ్యత పుష్కలముగ కలిగిన వేంకటకవి, పోతన, నన్నయలు ఒకే అక్షరుడను భావమునకు నన్నయ ప్రార్థనాపద్యమందలి రామాయణ రచనాధ్వని పుష్టికలిగించుచున్నది.

'కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్' అని వర్ణింపబడిన ఆదికవి వాల్మీకి గుణమైన అక్షరరమ్యత తన కవితాగుణముగా తెలుపుకొని, వాల్మీకిని ప్రార్థనాపద్యమునసే ప్రార్థించుట నన్నయ సంస్కృత రామాయణమును పారాయణముచేసి దాని నాదసౌష్ఠవమును ప్రతిబింబించు రామాయణము వలె భారతమును రచింప తలచిన కాంక్షను వ్యక్తముచేసెను.

తరలము॥ హరి హ రాజ గజాన నార్క షడాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతా తతికిన్ నమస్కృతి సేసి దు
ర్భర త పోవిభవాదికున్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభున్ ప్రచేతసుపుత్రు భక్తిఁ దలంచుచున్ (బార – 1–1–21)

పై పద్యములో ఒక విశేషమున్న దని తెలుపుటకా అనునట్లు సాధారణ వృత్తము కాక 'తరలము' అను వేరు వృత్తమును వాడినట్లు గ్రహింపవచ్చును.

పై పద్యమున నన్నయ తొమ్మిది మంది దేవతా స్వరూపులను ఒకే సమాసమున నుతించెను. మొదటి ముగ్గురు త్రిమూర్తులు. కడపటి ముగ్గురు త్రిమూర్తుల భార్యలు. త్రిమూర్తుల వారి భార్యల వరుసల క్రమంలో వ్యత్యాసము కలదు. మధ్య గజాననుడు, అర్కుడు, షడాస్యుడు క్రమములో కలరు. ఈ వ్యత్యాసము తలచిన, రామాయణ రచనకు భిన్నముగ రచింపవలసినట్లు ధ్వనించుచున్నది.

ఒక ప్రక్క త్రిమూర్తులు, గజాస్యుడును రెండవ ప్రక్క త్రిమూర్తుల భార్యలు షడాస్యుడును నెలకొని యుండగా మధ్యన అర్కుడు ప్రకాశించుచున్నాడు.

గృహమునకు మధ్య ద్వార ముండి రెండువైపుల సౌష్టవము చెడకుండ కిటికీలను అమర్చి నట్లుగ మధ్యన సూర్యుని నెలకొల్పి, ఇరుప్రక్కల త్రిమూర్తులు గజాననుని, త్రిమూర్తుల శ్రీమతులను షడాననుని సౌష్టవము చెడకుండ నిల్పినాడు. ఈ క్రమములో ఒక శిష్టత న్నది.

తండ్రికి పెద్దవాని యందు తల్లికి చిన్నవాని యందు మక్కువ ఎక్కువగ నుండుట లోకప్రసిద్ధము కదా. పార్వతీ పరమేశ్వరుల సంతానములో పెద్దవాడయిన గజాననుని తండ్రి పక్షమునను చిన్నవా డయిన షడాననుని గిరిసుత పక్షమునను చేర్చి, మధ్యలో అర్కుడు వెలుగొందు చుండునట్లు నన్నయ తన రచనా శిల్పమును ప్రదర్శించినాడు. మధ్య ద్వారము తెరచుటకు, మూయుటకు ఉండునట్లు స్వయం ప్రకాశుడైన సూర్యుని పెట్టినాడు.

మూసి, తెరచు ద్వారములు సూర్య, చంద్ర సంకేతములు, కారణము చంద్రుడు స్వయం ప్రకాశకుడు కాక ఛాయాగ్రహుడు కనుక.

సూర్యుడు హరి. చంద్రుడు హరుని శిరమును అలంకరించినవాడు కనుక ఆ ద్వారము హరిహర సంకేతము. సూర్యుడు లేని సమయమున చంద్రుడు ప్రకాశించుట ప్రసిద్ధము.

షడాస్య, గజాస్యులు హరుని సంతానమును, బ్రహ్మ హరి సంతానమును, సరస్వతీ దేవి హరి కోడలును కనుక హరిహరుల కుటుంబము పై పద్యమున వర్ణింపబడినది.

తీక్ష్ణమైన కిరణములు కలిగిన అర్కుడు (తద్వారా క్షత్రియ తేజస్సు) ధర్మవర్తనమునకు సంకేతముగా భావింపవచ్చును.

అర్కుని కిరువైపుల సోదరులను పేర్కొనినందున యిది అర్కుని సంతానమైన కర్ణ, సుగ్రీవులను స్ఫురణకు తెచ్చుచున్నది.

కర్ణుడు భారత యుద్ధమునకు ధర్మపరిపాలనమునకు సంకేతము. కనుక భారత రచన కురుక్షేత్ర సంగ్రామము చిహ్నము.

సుగ్రీవుడు, రామాయణ కదారచన పరిపాలనకు, మైత్రికి చిహ్నము.

అర్కుని కిరువైపుల తండ్రి వైపు పెద్దవాడు, తల్లివైపు చిన్నవాడు ఉండుట వలన, పెద్దవాడు దృతరాష్ట్రు పెంపకమున పెరిగిన కౌరవులకు, చిన్నవాడు కుంతి పెంపకమున పెరిగిన పాండవులకు చిహ్నము.

వారిద్దరిని విడదీయు సూర్యుడు (సూర్యుడు గజానన, షడాననుల తండ్రి కాదు. వేరు కనుక) అన్నదమ్ముల మధ్య జరిగిన కురుక్షేత్ర సంగ్రామమునకు ప్రత్యక్షసాక్షిగా తలంపవచ్చును.

జేష్ట కుమారుడైన ధృతరాష్టుడు జేష్ఠ పుత్ర వ్యామోహముతో, కనిష్టపుత్రుడైన పాండురాజు కుమారులైన పాండవుల మధ్య జరిగిన కురుక్షేత్ర సంగ్రామ కద, నన్నయ వ్రాయుటకు సంకేతముగా ఈ పద్యము ద్వనించుచున్నది. సూర్య పుత్రుడైన కర్ణుని ప్రాముఖ్యత కూడ ధ్వనించుచున్నది.

రాజరాజు చంద్రవంశపు రాజు. తన పూర్వ రాజులైన పాండవులచరిత్ర వినగనే తన ఒడలు పులకరించును, కనుక భారత రచన చేయమని రాజరాజు కోరగా, రచన ప్రారంభించుటకు ప్రార్థనా పద్యముగ నన్నయ వ్రాసిన పద్యమిది.

నన్నయ తనకు గల శ్రీ మద్రామాయణ రచనా కాంక్షను స్ఫురింపచేయుటకా అనునట్లు, ఈ భారత ప్రార్థనా పద్యములో సూర్యునికి విశిష్ట స్థానమును ఒసగినట్లు కన్పించుచున్నది.

సూర్యస్తోత్రమైన ఆదిత్య హృదయము శ్రీమద్రామాయణమున గర్భితమగుటచే సూర్యుని రామాయణమునకు ప్రతీకగా గ్రహింపవచ్చును.

పై ప్రార్థనా పద్యము నడుమ సూర్యుని నిలుపుటచే క్షాత్రధర్మము, తేజస్సు ధర్మపరిపాలనమునకు సంకేతము. రామాయణము సూర్య వంశరాజుల చరిత్ర. త్రిమూర్తులవైపు పెద్ద కుమారునుంచుటవలన దశరధుడు జేష్టపుత్రుడైన శ్రీ రాముని పట్టాభిషేకము తలపెట్టుట, శ్రీరాముడు ధర్మపాలనమునకు తండ్రి మాటగా పినతల్లి చెప్పినను, తన తల్లి వెళ్ళవద్దని

చెప్పినను దర్మము పాటించి దేవతాకార్యమును నిర్వర్తించుటకు చిహ్నము. త్రిమూర్తుల భార్యలవైపు కనిష్టుని పెట్టుటవలన కనిష్ట భార్యయైన కైక భరతునికి పట్టాభిషేకము చేయమని బలవంతము చేసి, తన సవతి కుమారునికి పోటీగ నిలబెట్టుట కూడ సూర్యుని కిరువైపుల నున్న గజాస్య, షడాస్యుల చే స్ఫురింప చేయుచున్నది.

సూర్యుని సంతానమైన సుగ్రీవుని ఇంద్రుని సంతానమైన వాలికి మధ్య యుద్దమును, రామాయణ చిహ్నముగ, సూర్యుని సంతానమైన కర్ణునికి ఇంద్రుని సంతానమైన అర్జునునికి మధ్య యుద్దమును భారత చిహ్నముగ కూడ స్ఫురింపచేయుచున్నది.

సూర్య చంద్రు లున్నంతకాలము తన కావ్యము లోకమందు వ్యాప్తి పొందునను ధ్వని కూడ ఇందు కలదు.

ఈ పద్యములోనే వాల్మీని కూడ ప్రార్థించుట వలన తన రామాయణ రచనా కాంక్షను ద్వనించినాడు.

శ్రీరాముడు అగస్త్యుని ఆశ్రమము దర్శించుట వలన రామాయణము నందలి ఆదిత్య హృదయ ప్రాముఖ్యము వ్యక్తమగును.

సుందరముగ, పారాయణ యోగ్యముగ నుండునట్లు గోపినాధ వేంకటకవి గోపీనాధరామాయణమున 'ఆదిత్య హృదయము'ను అనువదించుట ఈ విషయమునకు ప్రాముఖ్యము నిచ్చుచున్నది.

అర్జునుడు పాశుపతాస్త్రమునకై తపస్సు చేయు సందర్భమున నన్నయ వ్యాసముని వలె స్తోత్రపద్యములు గా కాక ప్రత్యేక వృత్తమైన ఈశ్వర దండకమును రచింపగా, వేంకటకవి కూడ శ్రీ కృష్ణ జన్మఖండమున వ్యాసమహాముని వలె సోత్ర పద్యములుగా రచింపక ప్రత్యేకమైన "దుర్గాదండకము" ను రచించెను. ఈ సామ్యము కూడ వారి ఒకే అక్షరత్వమును (దేహాంతరము పొందిన ఒకే వ్యక్తిగా ) ధ్వనింప జేయుచున్నది. ఇద్దరు తగణ దండకము వ్రాయుట కూడ దీనికిబలము నిచ్చుచున్నది.

నన్నయ భారతమును (హరిహరాంకితముగ) పూర్తి చేసిన తిక్కన, అదే అక్షరుడ నని పై నన్నయ పద్యములోని అంతరార్ధము ధ్వనింప చేయుచు సూచించినాడు. కావ్యౌచిత్యమునకు భారతమున సంక్షేపించి రచించిన తిక్కన, భగవద్గీతాశాస్త్రమును మోక్షగ్రంధముగ రచింపతలపెట్టెనా అనునట్లు, వేంకటకవి భగవద్గీతా శాస్త్రమను మోక్ష గ్రంధమును ద్వితీయాధ్యాయమునుండే రచించినాడు. ఇది కూడ నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవులు ఒకే అక్షరుడని ధ్వనింపచేయుచున్నది. చూడుడు.

తిక్కన వేంకటకవుల భగవద్గీత పోలికలు

భగవద్గీత ప్రస్థానత్రయములో ఒకటి. ఇది ఉపనిషత్తుల్యమని, దీనిని కలుపుకొనియే బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు ప్రస్థానత్రయముగ ప్రసిద్ధి పొందిన వని ప్రసిద్ధము.

దీని మూలము భారతములోని భీష్మపర్వము. దీనిని తిక్కన తెలుగు చేయు నపుడు భారతకదా భాగమునకు రసము చెడకుండ ఔచిత్యముతో అనువగు విషాద, సాంఖ్య, విశ్వరూప సందర్శన, మోక్ష సన్యాసయోగములలోని ముఖ్య శ్లోకములను అర్జునుని స్వధర్మమునందు నిలుపుట కవసరమగు విషయములు మాత్రము చెప్పెను. శాంతి పర్వాదులలో కూడ కొన్ని భగవద్గీత శ్లోకములను సమయానుకూలముగ అనువదించెను. దీనిని బట్టి తిక్కనకు భగవద్గీతపై గల ప్రీతి, గౌరవము వ్యక్తమగును. దీనిని ప్రత్యేక కావ్యముగ తిక్కన రచింప తలకొని యుండె నని తెలుపుట కనునట్లు, అనంత శక్తి సంపన్న మైన కాలము వేంకటకవి చేత శ్రీ భగవద్గీతా శాస్త్ర మను మోక్ష గ్రంథమును ఇట్లు ప్రారంభింప చేసినది.

శా॥ శ్రీ కైవల్య రమాధినాథుడు లసచ్ఛృంగార రేఖామనో
జ్ఞాకారుండు భవాబ్ది తారణ చణానంత ప్రబావుండు లో
కైకత్రాణ పరాయణుండు ఘనసత్యానంద చిద్రూపుడున్
శ్రీ కృష్ణుండు కుమారయాచ నృపతిం జెల్వొంద బ్రోచున్ గృపన్ (భ.గీ. –1)

క॥ శ్రీ వసుదేవకుమార ర, మా వల్లభ భక్తలోక మందార హరీ
పావన చరిత్ర విధిముఖ, సేవిత చరణారవింద శ్రీ గోవిందా (భ.గీ. –2)

వ॥ దేవా యవధరింపుము. శ్రీ వేదవ్యాస వర ప్రసాద లబ్ద విజ్ఞాన విదిత వాసుదేవ ధనంజయ చరిత్రుండగు సూత పుత్రుండు విచిత్ర వీర్యపుత్రున కిట్లనియె (భ.గీ –3)

ఈ ప్రారంభము 'శ్రీ కైవల్య పదంబు చేరుటకు నైచింతించెద' నని భాగవతమును ప్రారంభించిన పోతనను తలపించు చున్నది. అంతేకాక "దేవా యవధరింపు' మను వచనము నకు ముందరి ' శ్రీ గోవిందా' అను పదము శ్రీకృష్ణుని కన్వయమై శ్రీరామాంకితమై శ్రీకృష్ణపరముగ నున్న భాగవతములోని షష్ఠ్యంతములోని కడపటి పద్యములోని కడపటి పదము 'శేష శాయికిన్' ను తలపించుచున్నది. ఈ గోవిందా, శేషశాయి పదములు తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని కూడ తలపింపచేయుచున్నవి. చూడుడు.

ఉ॥ న్యాయికి భూసురేంద్ర మృతనందనదాయికి రుక్మిణీ మన
స్థాయికి భూత సమ్మద విధాయికి సాధుజనాను రాగ సం

ధాయికి, బీతవస్త్రపరిధాయికి బద్మభవాండ భాండ ని
ర్మాయికి గోపికా నివహ మందిరయాయికి శేషశాయికిన్ (భాగ -1-30)

"త్రిమతస్థులు చూడం దగినట్లు మూల కర్తృభావము ననుసరించియుండునట్లుగా శ్రీ శ్రీ వేంకటగిరి సంస్థాన ప్రభువులలోని 27వ పురుషాంతరము వారయిన శ్రీ శ్రీ కుమార యాచమ నాయనిం వారు గోపినాథము వేంకటకవిచే క్రీ. శ. 1860 సం॥ న దీనిం తెలిగింప చేయించిరి" అను శ్రీ భగవద్గీతా శాస్త్రపు ఉపోద్ఘాతము సర్వమత సార సమ్మతము.

తిక్కనగారి శివకేశవ భేదము లేని హరిహరాంకితమైన శ్రీ భగవద్గీతాభాగము కలిగిన భీష్మ పర్వమును గుర్తుచేయుచున్నది. ' శ్రీ గోవిందా' యను శ్రీ కృష్ణ సంబోధనము వెంటనే "దేవా యవధరింపు" మను వచనము తిక్కన విరాట పర్వమున షష్ట్యంతముల వెంటనే వ్రాసిన "దేవా దివ్య చిత్తంబున నవధరింపుము' ను తలపించుచున్నది.

శా॥ శ్రీ వెల్గోటి కుమారయాచ ధరణీశితాంశుం డధ్యాత్మ వి
ధ్యా విచ్ఛేష్ముఁడు గోపినాథ కులజుండౌ వేంకటాఖ్యార్యుచే
దైవానుగ్రహ లబ్ది హేతువగు గీతాశాస్త్ర మూర్వీజనుల్
సేవింపందగు గద్యపద్యములుగాఁ జేయించె నుద్యన్మతిన్ (శ్రీ. భ.గీ - 461)

అను వేంకటకవి భగవద్గీతా శాస్త్రపు కడపటి పద్యము రాజ రాజు ప్రేరణచే భారత రచన రచించుటను గుర్తు చేయుచున్నది. ప్రారంభము నందలి 'వసుదేవకుమార .. శ్రీ గోవిందా' అను కందపద్యము హరిహరనాథాంకితముగ తిక్కన రచించిన ఆశ్వాసారంభ పద్యములను స్ఫురింపచేస్తూ భగవద్గీతా భాగము కలిగిన భారత భీష్మపర్వమును గుర్తు చేయుచున్నది.

'శ్రీ కృష్ణదేవునకు సమర్పితంబుగా నా యొనర్పం బూనిన శ్రీ మద్రామాయణంబునకుఁ గథా ప్రారంభం బెట్టెదనిన' అని శ్రీ మద్రామాయణమును 'శ్రీ రామ భద్రునకు సమర్పితంబుగా నా యొనర్పం బూనిన శ్రీ కృష్ణ జన్మ ఖండంబునకు 'గథా క్రమం బెట్టులనిన' అని శ్రీ కృష్ణ జన్మ ఖండమును ప్రారంభింప చేసిన కాలశక్తి శ్రీ భగవద్గీతా శాస్త్రమును 'దేవాయవధరింపుము' అని శ్రీ కృష్ణ సంబోధమైన కంద పద్యముతో ఆశ్వాసారంభ పద్యమును పోలునట్లు రచింప చేయుట తిక్కన, వేంకటకవుల ఒకే అక్షర త్వమును సూచించుచున్నది. ఒకే అక్షరత్వము కాని యెడ అట్టిబాణి అంత సహజముగ రాదు.

వేంకటకవి భగవద్గీతాశాస్త్ర పద్యములలో ఒకటి రెండింటిని భీష్మపర్వములోని తిక్కన పద్యములతో పోల్చి చూతము.

తిక్కన పద్యము.

సీ॥ అక్కట పూజార్హులగు ద్రోణ భీష్ముల, నమ్ముల నొప్పింప నగునె చెపుమ
మాన్యులఁజంపుట మగపాటి గాదు బి, క్షాశనంబైన నత్యంత సుఖము
కడగి యెవ్వరిఁ జంపఁగా బెద్ద బ్రతుకయ్యు, నూహింప బ్రతుకు గాకుండు నాకు
విను మట్టి ధృతరాష్ట్ర తనయులు గారె యీ, యొడ్డిన మొనలలో నున్న వార

ఆ॥ లింద్రియముల నెల్ల నివురంగఁ జేయుచు, నడరు శోకపహ్ని యాఱనేర
దింద్రపదవి సేరె నేనియుఁ గావున, భండనంబు సేయకుండు వాఁడ (భీష్మ 1–193)

దీనికి సరిపడు వెంకటకవి రచన

తే. గీ॥ అకట పూల పూజింపంగ నర్హులైన, ద్రోణభీష్ముల సంగర క్షోణి డాసి
కఱకు టమ్ముల నెబ్బంగి గాఁడ నేతు, నింతకంటెను దుష్కార్య మెద్ది నాకు

చ॥ వెలయగ నర్థకాములగు వృద్ధుల నార్యులఁ దున్మి నెత్తుటం
గలసిన భోగముల్ గుడుచు కంటెఁ గరంబు మహానుభావులన్
గులగురులన్ వధింపక యకుంఠిత వైఖరి భైక్షవృత్తిచే
నిల నవిరోధితం బ్రతకు టెంతయు శ్రేయము గాదె మాధవా

వ॥ .. నిష్కంటకంబై సమృద్ధంబైన రాజ్యంబు సంగ్రామ విజయలబ్దం బైనను సురాధిపత్యంబు దొరకొనిన నెయ్యది యింద్రియ శోషణకరంబైన మద్దుఃఖంబు నపనయింపం జాలు నట్టి కార్యంబు నేను విలోకింపను గదా " (భ.గ. – 8,9,10)

పూజార్హ పదమునకు పూలపూజింపంగ అని మెత్తని పూలచే (సువాసన కలిగిన పూలచే) యని బాణములకు కఱకు టమ్ముల అని వ్రాసి 'యింతకంటెను దుష్కార్యమెద్ది నాకు' అనునవి తిక్క రచనాపద్ధతిని గుర్తు చేయుచున్నవి.

తిక్కన పద్యము

చ॥ వగవగ నేమియుం దగని వారికి నై హృదయంబు గుందగా
వగచెదు బుద్ధిమాటలను వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్న వారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్త వివేకమయత్వ మొందినన్ (భార 6–1–195)

దీనికి వెంకటకవి

గీ॥ పార్థ వగవఁదగని వారి నుద్దేశించి, వగచె దీవు బుద్ధివాదములను
బలికె దిట్లు చన్నవారల మనియున్న, వారిఁ గూర్చి బుధులు వగవ రెందు (భ.గీ – 11)

తిక్కన పద్యము (భీష్మ 1–230)

తే॥ అధిప యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుఁ, డును ధనుర్ధర వర్యుఁ డర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు, భూతి నిత్యంబులగు నిది నా తలంపు

వేంకటకవి పద్యము (భ.గీ. – 460)

తే॥ పృధివి యోగేశ్వరుండైన కృష్ణమూర్తి, పృదు ధనుర్ధరుఁడైన కిరీటి యెచట
నుండు రచ్చట దరలక యుండు విజయ, భూతి నీతి సంపద లిది నా తలంపు

వేంకటకవి వ్రాసిన కొన్ని పద్యములు వ్యాస శ్లోకమును తలపించునుచూడుడు.

శ్లోకము

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే (భ.గీ. 17–14)

వేంకటకవి పద్యము

క॥ గురుదేవప్రాజ్ఞ ద్విజ, పరిపూజా బ్రహ్మచర్య పరిశౌచంబున్
గరిమ నహింసార్జవములు, ధరఁ గాయకతప మనంగఁ దద్దయనొప్పున్ (భ.గీ – 395)

పై పద్యములను పరిశీలించిన ప్రతి శ్లోకమును మూల విధేయముగను విపులార్ధముగను వేంకటకవి రచించినట్లు గమనింపగలము.

భీష్మ పర్వమున తిక్కన విషాదయోగమును సముచితముగ కధాభాగముననే వర్ణించినాడు. కనుక వేంకటకవి శాస్త్ర విషయమును సాంఖ్య యోగమునుండి మాత్రమే తెలుగు చేసినట్లు తెలిసి కొనగలము.

తిక్కన, వేంకటకవి ఒకే మండలమునకు చెందినవారు. వేదగిరి నృసింహ దేవళమును ఇద్దరును వారి వారి కాలములలో దర్శించి యుండవచ్చును. శ్రీ మద్రామాయణమునకు భగవద్గీతకు సంబంధ మెక్కువ. (తిక్కన) నిర్వచనోత్తర రామాయణము (వేంకటకవి) పూర్వ రామాయణములతో వారి రామాయణ బంధము కానవచ్చుచున్నది. ఇది నన్నయ భాగము. రాజరాజ నరేంద్రాంకితము. తిక్కన భాగము హరిహరనాధాంకితమును కలిగిన భారతమును తలపించుచున్నది.ప్రాచీన కవితలో తిక్కన తర్వాత తిక్కన రచించినన్ని గద్యపద్యములు పదప్రయోగములు చేసినవాడు వేంకటకవియే.

'హరిహరాజ గజాననార్క' పద్యరచన చేసి నన్నయ తన రామాయణ రచనాసక్తిని ధ్వనింప చేసెనని గమనించితిమి. అందు 'అర్క' అను పదము గృహమునకు ద్వారమువలె ఉండి సూర్య, చంద్రుల గమనములను, దానివలన హరిహరులను ధ్వనించుచున్నదని

తెలుసుకొంటిమి. అంతేకాక ఆ శ్లోకమున వర్ణితమైన దేవతా స్వరూపులు హరిహరకుటుంబ సభ్యులే అని కూడ గమనించితిమి.

'ఓం నమోనారాయణాయ' అను అష్టాక్షరి మంత్రములోని బీజాక్షరమైన ప్రాణము 'రా' అను అక్షరము. ఓం నమశ్శివాయ అను పంచాక్షరి మంత్రములోని బీజాక్షరమైన ప్రాణము 'మ' అను అక్షరము పై 'రా' 'మ' అక్షరములను ఆయా మంత్రములలో తీసివేయగా మిగిలినది 'ఓం నమోనాయణాయ, ఓం నశ్శివాయ' అపార్థములగును. ఏర్పడిన మంత్రము రామమంత్రము. అట్టి విలువ కలిగిన దగుట చే వాల్మీకి 'మరా' అని పంచాక్షరీ మంత్ర అక్షరమును ముందుపెట్టి అష్టాక్షరి మంత్ర అక్షరమును వెనుకపెట్టి తపించినను తరించిపూతుడై రామ నామమునకు తారకమంత్రమని ప్రసిద్ధము చేసినాడు. తిక్కన హరిహరతత్త్వముచే ఈ 'రామ చరిత్ర' వ్రాయు తలంపు యింకను కొనసాగునట్లు ధ్వనించినాడు. అందుకే శ్రీ యన గైరి నాబరగు పద్యములో చెల్వకు అని లలితాదేవిని స్మరించినట్లయినది. రామ, లలిత రెండును దుర్గాదేవి శక్తివంతములైన లలిత పదములే కదా.

పోతన వీరభద్ర విజయములోని 'శ్రీ లలితంపు భూతియును' ప్రధమ పద్యముగ నుండుట. వేంకట కవి కలలో కనబడిన శ్రీ కృష్ణుని 'లలిత హాసము వాడు' అని ప్రయోగించుట గమనార్హము. 1887, 1894 ప్రతులలోని ఈ పదమును తీసివేసి వావిళ్ళవారు 'రమ్యహాసము వాడ'ని మార్చుట శోచనీయము.

తిక్కన పుట్టినప్పటి నుండి 'హరి హర నాధాంకితముగ 'భారత రచన' కొనసాగించు కోరిక కలిగియుండె నని శ్రీ మదుభయ కవి మిత్ర అనుపదము, కి మస్థిమూలం శ్లోకముచే తిక్కన ధ్వనించినాడు.

> అనఘచరిత యోగభ్రష్టుఁడైన వాఁడు, పుణ్యాకారుల లోకముల్ పొంది యందుఁ
> బెక్కు వర్షముల్ సుఖియించి పిదప విమలు, లైన శ్రీమంతుల గృహంబులందుఁబుట్టు
> ఇట్లు జన్మించి పూర్వదైహిక విశేష, బుద్ధి సంయోగమును బొంది పురుష వరుఁడు
> చెలఁగి తన పూర్వయోగ సంసిద్ధి కొఱకు, యత్న మొనరించు నధిక ప్రయత్న మలర
> (శ్రీ.భ.గీ – 174, 177)

అను శ్రీ భగవద్గీతా వాక్యముల ననుసరించి నన్నయనే తిరిగి తిక్కనగా పుట్టినట్లు తిక్కనకు ఆత్మవిశ్వాసము కలిగి యుండెను. అందుకనే సూర్యవంశరాజైన మనుమసిద్ధి తనను మామ చేయమని తిక్కనను కోరగనే రామాయణ రచనయందు నన్నయకు గల కోరిక గుర్తుగా, రాజరాజు తన వంశ పూర్వ రాజులైన పాండవుల చరిత్ర వినిన దేహము పులకించుచనన్న మాట

చిహ్నముగా తిక్కన రచించెనేమో అని ధ్వనించు నట్లు, కారణమేమియు చెప్పక ఉత్తర రామాయణమును నిర్వచనముగ రచించి మనుమసిద్ధి కంకితమిచ్చెను.

నన్నయ భారత రచన శార్దూల వృత్తమైన శ్లోకముతో శ్రీకారముచుట్ట తిక్కనకూడ అట్లే శార్దూలవృత్తమైన శ్లోకముతోనే నిర్వచనోత్తర రామాయణమునకు శ్రీకారము చుట్టెను. అయితే నన్నయ ప్రార్థనా పూర్వకముగ వ్రాయగ తిక్కన ఆశీర్వచనపూర్వకముగ రచించెను. ఇది పై చెప్పిన జన్మాంతర వాసనకు సంకేతమేమో అనిపించును.

తిక్కన గద్యాంతమందు 'శ్రీమదుభయ కవిమిత్ర' అని వ్రాసుకొనెను. తమను గురించి తమకు గల ఆత్మ విశ్వాయమునే గద్యాంతమందు రచించెదరు. తిక్కన గద్య ప్రారంభమున శ్రీమత్ అని వ్రాసుకొనెను. తమకు శ్రీమత్ అన్వయమగునట్లు సాధారణముగ ఎవ్వరు రచింపరు. అది సంప్రదాయముకాదు. కనుక దీనికొక ప్రత్యేక కారణము సూచించుటకు తిక్కన రచించి యుండవలెను.

గుడి పూజారియు, లోకులును చేయు ఉత్సవమునకు ఉభయమని శబ్దార్థ రత్నాకరము తెలుపును. ఇది లోకహితమును కోరి చేయునది. కావున శ్రేష్టమైన భావము. ఉభయమున కున్న అనేక అర్థములలో శ్రేష్టత్వము, విభూతిత్వము కలిగిన పై భావమును 'శ్రీ మదుభయ' పదము సూచించును.

నన్నయ గద్యాంతమందు 'సకల సుజన కవి వినుత' అని వ్రాసుకొనెను. అంతేకాక భారత పీఠికలో 'నారాయణ భట్టు తన కిష్టుడు సహాధ్యాయుడు తోడయి నిర్వహింపగన్' అని వ్రాసుకొనెను. తన భారతము సత్సరసీ సభాంతరముల యందు కొనియాడబడినట్లును చెప్పుకొనెను. కనుక నన్నయ కవి మిత్రుడు. అట్టి కవిమిత్రుడైన నన్నయను ఉభయముగా తీసికొనుట వలన తిక్కన ఉభయ కవిమిత్రుడు. దాని విభూతి మంతుడు కనుక శ్రీమదుభయ కవిమిత్రుడని తిక్కన భావముగా తలంపవచ్చును.

### తిక్కన కిమస్థిమాలాంశ్లోక వివరణ

అరణ్య పర్వచతుర్థశ్వాస మధ్యలో నన్నయ కవిత నిలిచిపోయినది. నన్నయ మూడు పర్వములు రచించినట్లు తిక్కన తెలిపినాడు. నన్నయ మూడు పర్వములు రచించియుండినచో నన్నయ తర్వాత 150 సం॥లు భద్రముగనున్న నన్నయ రచన తిక్కన చూచినచో తిక్కన రచనచే పరిపూర్తిపొందిన భారతములోని మధ్య కొంత భాగము మాత్రము తర్వాత 50 సం॥లలో ఎట్లున కాలమున తిక్కన సాహిత్యముతో వికసించిన సహృదయుల సనుక్షమమున పోవుటెట్లు పొసగును? కనుక ఇది విచారణీయాంశము. తిక్కన అంతరార్థ మిచట సహృదయానైవేద్యముగ గుప్తము చేయబడినదని తెలియనగును.

నన్నయ మూడు పర్వములు వ్రాయగా మిగిలిన దానిని తుదముట్టరచించితినని చెప్పిన తిక్కన నన్నయ వదలిన చోటు నుంచి రచించినట్లును శ్రీ మదుభయకవిమిత్ర పదప్రయోగముచే నిర్వచనోత్తర రామాయణ రచనకు పూర్వమునుండే తను ఒక్కడే నన్నయ రచనను పూర్తిచేయవలెనన్న తలంపును ధ్వనించినాడు. దాని పర్యవసానముగ కిమస్థిమాలాం శ్లోకమును రచించినాడు.

భారత రసపట్టులో ఉన్న పారకుని పర్వమధ్యలో, అందు భారతమున సగమునకు కొంచెము ఎక్కువగ నన్నయ రచించి ఉండగా (అనగా 6989 శ్లోకములను నన్నయ తెలిగించియుండగా మిగిలిన 4864 శ్లోకముల ఆరణ్య పర్వము తెలిగించవలసి ఉన్నది) రసహృదయునికి రసభంగము చేయుట తిక్కన కిష్టము లేదు. ఔచిత్యము పోషింపవలెనని నిర్వచనోత్తర రామాయణమున నియమములు తెలుపుకొనిన విషయ మిట గుర్తు చేసుకొనవలెను. దీని పర్యసానమే కిమస్థిమాలాం శ్లోక కల్పన.

భోగ లాలసులైన రాజులకు వేటాడుట యందు వేడుట కాని అరణ్యమునందే 12 సంవత్సరములు నివాసము చేయుట విప్రాయముగ నుండును. శక్త్యాత్ములైన పాండవులను దుర్యోధనుడు కపటద్యూతమున రాజ్యపదభ్రంశము చేసి అరణ్యావాసమునకు పరిభవముచేసి పంపినను ధర్మభీతి తత్పమయ సంక్షోభితులు కాక ధర్మగతి వారు వనంబున విషాద వేదనా శ్రమము పడిరని తిక్కన ఉద్యోగ పర్వమున తెలిపియున్నాడు. ఈవిషము (ద్రౌపది వస్త్రాపహరణము) వంటి అవమానములను దిగమ్రింగుకొని ఆరణ్యావాసము సలిపిన పాండవుల కథా సంకేతమే ఆరణ్య పర్వమును విషము ను కంఠమున నిలిపిన హరునితో పోల్చుట. విరాట పర్వము నుండి సాగించిన ధర్మ యుద్ధమునకు ప్రతీకనే ధర్మస్థాపన ధ్యేయముగా గల హరి. ఆరణ్య పర్వ, విరాట పర్వకలయిక ధ్వనే కిమస్థిమాలాం శ్లోక రచనకు మూలముగ హరిహరులను ఏకము చేయుట.

దాదాపు ఏడువేల మూల శ్లోక కథను తెగించిన నన్నయ మరణించినను నన్నయ వలె ఆరణ్య పర్వ శేషము కథ మాత్రము తిక్కన రచించి హర సంకేతముగను, విరాట పర్వమునుండి తన స్వభావ సిద్ధ రచన చేసి హరి సంకేతముగను ధ్వనించినాడు. కనుక అస్థిమాల, కాలకూట శబ్దములు ఆరణ్య పర్వరచనకు, కౌస్తుభ, యశోదాస్తన్య శబ్దములు విరాటాదిపర్యంత రచనకు సూచింపచేయునట్లు సూచించి హరి, హర ఏకము ద్వారా రెండింటి కవి ఒక్కడనే అని తిక్కన ధ్వని. అట్లు చేయుట చేతనే పూర్వాపర్యార్థయుక్తి చేయునట్టి యెడల యత్న మించుక యైనను వలవదు అని చెప్పినాడు.

పై భావమును స్ఫురింప చేయుటచే తిక్కన బాల్యము నుండి భారత రచనయందాసక్తి కలిగి యుండినట్లును, నిర్వచనోత్తర రామాయణ కాలమందు కూడ తిక్కన భారత రచనా కాంక్ష యున్నట్లును కాని కిమస్థిమాలాం శ్లోకమును మాత్రము భారత రచనకు పూర్వము రచించినట్లును తలంపవచ్చును

రామాయణ రచనకు మూలమైన 'మా నిషాద ప్రతిష్ఠాం' అను శ్లోకము హఠాత్తుగ వాల్మీకి నోటి నుండి వచ్చి, దానిని గురించి ఆలోచించుచుండగా వాల్మీకికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనట్లు 'కిమస్థిమాలాం' శ్లోకం తిక్కనకు హరిహరనాథుని సాక్షాత్కరింప చేసినది. కనుక కిమస్థిమాలాం శ్లోకమునకు 'మా నిషాద ప్రతిష్ఠాం' శ్లోకము వలె భారతపరమైన అర్థ మున్నదని భగవ ద్దర్శనముచే తిక్కన ధ్వనించినాడు. కనుక ఈ శ్లోక అర్థ వైశాల్యమును ఆ శ్లోకమున గల వివిద శబ్దములచే ప్రసరింప చేయువిదమును మనము ఆలోచింపవలసి యున్నది. దానిని పరిశీలించుటకు ముందు ఆ శ్లోకమును ఒకసారి చదువుకొనుట ఉచితము.

కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయా యాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా, స్తన్యం తవస్వాదు వద ప్రభో మే

'అస్థిమాల' శబ్దము శ్రీ కృష్ణ జన్మఖండమున యిట్లు ప్రయోగింప బడినది.

చ॥ వనజదళాక్షి మున్ను సతి వారక యోగ విస్పష్ట దేహయై
చనినఁ దదీయ భస్మము వెసం దన మేన నలంది ప్రేమ లో
దనరఁ దదస్థిమాల యఱుతన్ ధరియించెను నాట నుండి శం
భుని బుధు లస్థిమాలియు విభూ త్యనులే పనుఁ డందు రుర్వరన్ (శ్రీ.కృ.జ. 4 – ఆ)

కనుక 'అస్థిమాల' శబ్దము సతీదేవి దక్షయజ్ఞ సమయమున దేహత్యాగము చేసినపుడు సతీదేవి ఎముకలను దండగా ధరించిన ఉదంతమును గుర్తు చేయు పదము. సతీదేవి తిరిగి పార్వతిగా జన్మించి శివునే భర్తగా కోరి ఎన్ని అవాంతరము లొచ్చినను తదేకదీక్షగా తపస్సుచేసి శివునే భర్తగా పొందిన విషయము ఆపద ప్రయోగము ధ్వనింప చేయుచున్నది.

సతీదేవి ఎముకలను ఆరణ్య పర్వ గద్య పద్యములకు పోల్చుటవలన ఆరణ్యపర్వ రచనా శ్రేష్టత్వము తెలుపుచున్నది.

పద్యములను సుమములనుట ప్రసిద్ధము కదా. మరణించిన నన్నయ పేర తను రచించిన పద్యము 'అస్థి' అని ధ్వనించినాడు. సుమము (పద్యము) లచే అల్లబడిన భాగము ఆశ్వాసముగను, 'అస్థి' అని పేరిడినట్టి పద్యములచే అల్లబడిన పూర్తి ఆశ్వాసము 'మాల' అని తిక్కన ధ్వనించెను. మరణించిన నన్నయ పేర రచించిన (చతుర్థాశ్వాస శేషములోని

పద్యములు సతీదేవి అస్థులుగా, అట్టి అస్థులు విభూతిగా ప్రస్తుతి (దివ్యత్వము) పొందిన కారణమున, అస్థిమాల అయిన ఆరణ్య పర్వశేష పద్యములు విరాట పర్వపద్యముల వలె శ్రేష్ట మని ధ్వని.

విరాట పర్వమున భారతమును ప్రబంధ మండలి అని తిక్కన పేర్కొనెను. కనుక ప్రతి పర్వము ప్రబంధము అని తిక్కన సూచన. అది అంకిత ప్రభువును శ్రోతగా ఏకసూత్రముగ బంధించు ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములు కలిగిన అనేక ఆశ్వాసములు కలిగి నందున ప్రబంధమని తిక్కన సూచించెను. అట్టి అనేక ఆశ్వాసములు కలిగినందున భారతమును ప్రబంధమండలి అని ధ్వనించెను.

ఏ కవి కాని ప్రధమా శ్వాసమున కథ ప్రారంభమునకు పూర్వము అంకిత ప్రభువు పేర షష్ఠ్యంతములు రచించి కథ ప్రారంభించును. ద్వితీయా శ్వాసము నుండి ప్రతి ఆశ్వాసారంభ మున ఒక కంద పద్యమున అంకిత ప్రభువును సంబోధించుట సంప్రదాయము.

విరాట పర్వమున తిక్కన అటువంటి 3 సంబోధనా పద్యములను షష్ఠ్యంతములు రచింపగనే అంతస్సన్నిధి కలిగించుకొని మొదటి ఆశ్వాసముననే రచించెను (కవికి మొదటి నుండి ప్రారంభించుట అలవాటు. అట్లుకాక ఇంకొక కవి కొంత రచించి మరణించగా ఆశ్వాసమధ్య భాగమునుండి కొనసాగించు చోటుకు చేరుకొని రచించుటను అంతస్సన్నిధి కలిగించుకొని రచించుటగా తిక్కన ధ్వని. అట్లు చెప్పుటచే తిక్కన మొదట విరాటపర్వము నుండి తుదముట్ట భారతమును రచించి, తదుపరి ఆరణ్యపర్వశేష కథ రచించిన తర్వాతనే విరాటపర్వ పీఠికా పద్యములు రచించిన ధ్వని. సన్నిధి అనుట వలన అక్కడ నుండి హరిహరనాధాంకితము అని చెప్పకుండనే ధ్వనించుచున్నది). కనుక దీని అంతరార్థము ఆ పద్యములు విరాట పర్వమునకు ముందరి ఆరణ్యపర్వములోని సప్తమ, షష్ఠ, పంచమ ఆశ్వాసములలో ముందరి పద్యములుగ ఉండవలసిన పద్యములని సూచన. భూసతికిం, అను మొదటి పద్యములోని సతి పదము, అస్థిమాల పదము. ' శ్రీ యన గౌరినాబరగు లోని గౌరి పదము దీనికి బలము నిచ్చుచున్నవి.

ఆరణ్య పర్వమున రాజ రాజ ప్రసక్తి ఉండుటచే హరిహర నాధాంకిత పద్యములు ఆరణ పర్వమున వ్రాయుట ఔచిత్య భంగమని తిక్కన తలంపు. నన్నయ రచనవలె తిక్కన ఆరణ పర్వ శేష రచన చేసినట్లు సూచించుట ఈ పద్య రచన ప్రయోజనముగా తలంపవచ్చును అట్లుకానిచో తిక్కన వంటి మహాకవి అట్లు రచింపడు.

ఈ సందర్భమున విరాటపర్వము నందలి

ఉ॥ కూర్పుట నూత్న రత్నమునకుం గనకంబునకుం దగుం జనా
భ్యర్చితమైన భారత మపార కృపా పరతంత్ర వృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుడ నయ్యెద భక్త కోటికిన్ (భార – 4– 1–28)

గుర్తుచేసుకోవలెను. ఇచ్చట నూత్న రత్న మనగా భారతములోని నూతన ఆశ్వాసమని నూతన కృతిభర్త అని తలంపదగి యున్నది. ఆరణ్యాపర్వశేషములో మూడు (పంచమ షష్ఠ, సప్తమ) ఆ శ్వాసములు పూర్తి రచన కలిగి నందున మూడు హరిహరనాధ సంభోధన పద్యములు రచించినట్లు తిక్కన ఇందు స్ఫురింప చేసినాడు. వీటిని మాలలు అని పేరిడినాడు. అసంపూర్ణమైన చతుర్థాశ్వాస భాగమును అస్థి అని సూచింపచేయుటకు ఆరణ్య పర్వ శేష రచనను 'అస్థిమాల' అని ప్రయోగించెను.

మనము ఏ భావ రూపమున భగవంతుని తలచెదమో, ఆ రూపమున భగవంతుడు దర్శన మిచ్చు ననుట ప్రసిద్ధమే కదా. ఒకటి వ్యష్టి రూపము హరిహరులను విడివిడి రూపములుగ చూచుట, మరొకటి సమష్టి రూపము హరిహరులను, ఒకే రూపముగ చూచుట. రూపభేదము రెండైనను అసలు అంతర్భావ మొకటే. అట్లే ఆరణ్యాపర్వ శేషము కధ మాత్రము నన్నయవలె సంస్కృత పద బహుళము, నన్నయవంటి సమాస ఘటనతో తిక్కన నన్నయ పేర రచించి విరాటపర్వము తన సహజ తెలుగు పద బహుళముగ రసశిల్పశైలిలో నాటకీయత ఉట్టిపడునట్లు రచించి తన అద్వైత రూపమును హరిహరనాధ రూపమున భారతమును దర్శించెను. కనుకనే హరిహరనాధుని హరిహర రూపములు ఏకము చేసి శ్లోకమును రచించెను.

తెలుగు సాహిత్యమున మొట్టమొదటి స్వప్న వృత్తాంతము తిక్కనదే. అట్లే మొట్టమొదటి షష్ఠ్యంత రచన కూడ తిక్కనదే. అవి తిక్కన మొదటి కావ్యమైన నిర్వచనోత్తర రామాయణమున లేవు. నన్నయ మరణముతో మధ్యలో నిలిచిపోయిన భారతమును కొనసాగింప నిర్ణయించినపుడే అవి చోటు చేసుకొనినవి.

స్వప్న వృత్తాంతము కృతిభర్తను నిర్ణయించునది. పుట్టుకే స్వప్నమని శ్రీ జన్మఖండము చెప్పుచున్నది. చూడుడు.

తే. గీ॥ పుడమి సర్వంబు సలిల బుద్బుద సమాన,మనుచు భవమది స్వప్నతుల్యం బటంచు
నాత్మలో నెంచి బుధులు ప్రయత్న మలర, ధర్మ మొనరింతు రెప్పుడు ధరణినాధ

కనుక ఈ స్వప్న వృత్తాంతము నన్నయ, తిక్కనగ పుట్టుటను దేహాంతరమున జరిగిన వృత్తాంతమును తెలుపుటయే స్వప్న వృత్తాంత ప్రయోజనము.

నిర్వచోత్తర రామాయణమును షష్ఠీ విభక్తితో ప్రారంభించి, ఆశ్వాసాంతము -లందు విభక్తులు మార్చి దాని మార్పుల వలన తేడాలను గమనించెను. అప్పుడు షష్ఠీ విభక్తితో రెండు విధములుగ ప్రయోగించ వచ్చునను విషయమును తిక్కన గమనించి యుండును.

భారత రచనలో అరణ్యపర్వ మధ్యలో ఒకసారి, విరాటపర్వమున రెండవసారి విభక్తులతో ప్రారంభింప వలసిన అవసరముండెను. రెండు చోట్ల ఒక విధముగనే వాడుట సమంజసము కాదని తిక్కన తలంచి యుండును.

షష్ఠీ అనిన పార్వతీదేవికి అర్థమున్నందున దక్షయజ్ఞమున సతీదేవి అంతమును సూచించు షష్ఠ్యంత శబ్దముచే తను నన్నయ పునర్జన్మ అను విశేషమును సాధింప వచ్చుననియు, షష్ఠీ విభక్తి ప్రత్యయమును ఆరణ్యపర్వమున ప్రయోగింపవచ్చుననియు తలంచియుండును. కావున హరసంకేతమైన ఆరణ్య పర్వమును షష్ఠి విభక్తితోను హరి సంకేతమైన విరాటాది పర్వములను షష్ఠ్యంతముతోను తిక్కన ప్రారంభించి యుండును. అందుకనే అస్థిమాల, కౌస్తుభ పదములను ప్రయోగించినట్లు ధ్వనించెను.

నిర్వచనోత్తర రామాయణమున 'హరి హర పద్మగర్భులను నాది కవీంద్రుల నూత్న సత్కవీశ్వరులను భక్తిగొల్చి" అని బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను నుతించిన తిక్కన భారతమును భగవదంకిత మిచ్చుట విగ్రహారాదనతో సమముగ పరిగణించి ఆరణ్యపర్వశేషమును 'భూపతికిం దివంబునకు' అని షష్ఠీ విభక్తి ప్రత్యయముతో సరస్వతీకమైన కావ్యమును బ్రహ్మతో కూడిన సరస్వతీ రూపముగ స్తుతించి విరాటపర్వమున హరిహరతత్త్వమును 'శ్రీ యన, గౌరి నా బరగు పద్యమున రెండుచోట్లను ఉత్పలమాల వృత్తమును వాడి బ్రహ్మ, విష్ణు మహేశ్వరులకు అభేదమును చూపించి తన కళావిదుత్వమును ప్రదర్శించెను. రెండు ఒకరే రచించిన ధ్వని కూడ చూపెను.

భూపతికింలోని సతికిని విరాటపర్వములోని అస్థిమాలకు సంబంధ ముండుట, దివము అనుపదము దివము నుండి తన తండ్రి కేసన హరిహరనాథునితో వచ్చిన స్వప్న వృత్తాంత గుర్తు. ఆ పద్యములోని షష్ఠీ విభక్తి ప్రత్యయ ప్రయోగమే కాక సమాగమ పదము నన్నయ రచన, తిక్కన రచనల సమాగమ ధ్వని కూడ సూచించుచున్నది. దీని ద్వారా ఆరణ్య పర్వ శేష రచన తిక్కన దని తెలిసికొనుటకు పదముల జాడ (అడుగుజాడ) గా తిక్కన ప్రయోగించె నని తలంపవచ్చును.

శివకేశవ, శివరామ శివరామకృష్ణ, శివనారాయణ, శంకర నారాయణ, హరనారాయణ వంటి పదము లెన్నియో ఉండ హర అను రెండక్షరములచే ఏర్పడిన రెండు మూర్తులను కలిపి హరిహరనాథునిగ స్తుతించుటలో ఒక విశేషము గోచరించుచున్నది.

హరిహర శబ్దమును నన్నయ ప్రయోగించియే యున్నాడు. హరిహర దేవాలయము లంతకు ముందరి నుండియే ఉన్నవి. కాని ఉన్న శబ్దము లన్నిటిలో తనకు కావలసిన శబ్దమును తను తలచిన ప్రయోజనమును బట్టి ఎన్నికొనుట కవి స్వతంత్రము.

నన్నయలోని మొదటి అక్షరము హరలోని రెండవఅక్షరములలో అకార ముండుట, తిక్కనలోని మొదటి అక్షరము హరిలోని రెండవ అక్షరములలో ఇకార ముండుట హరిహర శబ్దప్రయోజనముగా గోచరించుచున్నది.

కిమస్థిమాలాంలోని సతీదేవి, శ్రీయన, గౌరి నా బరఁగులో గౌరి పదము సతీ పదప్రయోజనముగ ధ్వనించుచున్నది. కనుక హరిహరనాథ శబ్దమును ఎన్నుకొని ఉండును.

అంతేకాక 'హరిహరాజగజానన' పద్యములో సూర్యుని (హరి) ద్వారముఖమున పెట్టి తలుపును తెరచి, మూయునట్లు సూర్యుని అస్తమయమునకు చంద్రుడు (హరుని శరీరమునకు శోభనిచ్చు వాడు) ఉదయించినట్లు నన్నయ అస్తమయమునకు తాను పుట్టుటను సూచించి భారత రచనములోని అద్వైతమును కూడ సూచించుచున్నది.

కౌస్తుభము పాల సముద్రమును చిలికినపుడు లక్ష్మీదేవి వెంట పుట్టి శ్రీ మహావిష్ణువు వక్షము నలంకరించిన సహజ రత్నము – అలంకార ప్రియుడైన హరికి వేదత్రయమైన భారత, భాగవత, రామాయణములలో (భారతము పంచమవేదము. వేదమే రామాయణముగ అవతరించినది. భాగవతము వేదసారము. కనుక భారత భాగవత రామాయణములు వేదత్రయము) ఏ కావ్యమైనను భగనదంకితముగ రచించి సమర్థించినను అది కౌస్తుభమే. విరాట పర్వమునుండి తన స్వభావ సిద్ధమగు శైలిచే రచించు భారతమును కౌస్తుభము అను పదముచే ధ్వనింప చేసినాడు.

కాలకూట మనగా విషము. యముని గృహము. వాసుకిని త్రాడుగ మందరాచలమును కవ్వముగ చేసి దేవదానవులు పాలసముద్రమును చిలికినపుడు హాలాహలము వెలువడి లోకమును దహించి వేయుచుండెను. ఆ విషమును అగ్రపూజగ గ్రహించి లోకమును కాపాడమని హరి హరుని కోరెను. హరుడు ఆ విషమును స్వీకరించి, పార్వతీ దేవి అభ్యర్థనచే దానిని కంఠముననే నిలిపెను. అందుచే శివుని కంఠము నల్లనయ్యెను. ఆ విషమునకు, నల్లగా చేసిన శివుని కంఠమునకు కాలకూటమను పేరు వచ్చెను.

ఈ సందర్భమున పోతనగారి "కాలుచే సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీ హరి కిచ్చి చెప్పె బమ్మెర పోతరాజొకడు భాగవతంబు' గుర్తుచేసుకొనిన కాలకూటము మరణించిన నన్నయపేర తిక్కన రచించిన కవిత్వము కాలకూటమని ధ్వనించుచున్నది.

పరమపదించిన నన్నయ పేర తిక్కన అరణ్య పర్వశేషమును రచించినాడు. ఇంకెవ్వరును తము రచించినట్లు చెప్పుకొనకుండ వివిధస్థానములలో పదములచే ధ్వనింపవలసిన అవసరమైనది. ఇది నన్నయకు తిక్కన చూపిన సహృదయతను మరెవ్వరును అన్యాయముగ ఉపయోగించుకొనకుండ ప్రయోగించిన శిల్పము. ఉదాహరణముగ తిక్కన విరాట పర్వమున అంతస్సన్నిధి కలిగించుకొని రచించిన మూడు ఆశ్వాసారంభ సంబోధనలు, దేవా దివ్యచిత్తంబున నవధరింపు మని "కథ జగత్ప్ర సిద్ధ కావున' అని విరాట పర్వములో ఆరణ్యపర్వశేష ప్రస్తావన విషయములను తిక్కన కాలకూటముగ ధ్వనించెను.

'యశోదాస్తన్య' మనగా శ్రీ కృష్ణుని పెంపుడు తల్లి అయిన యశోదాదేవి చనుబాలు అని అర్థము. సుప్రభాత రచనలో, 'కౌసల్యా సుప్రజా రామ' అని కౌసల్య పేరు ప్రసిద్ధిగ నుండగా కౌసల్య స్తన్య మనక యశోదాస్తన్య మనుటకు కారణముండి యుండవలెను.

శ్రీ కృష్ణుడు దేవకీదేవి కడుపున పుట్టి యశోదాదేవి స్తన్యమును గ్రోలుట తిక్కన తన స్వంత రచనము కాక నన్నయ వ్రాసి వదలిన భారతమును పూర్తి చేయుట ధ్వని.

యశోదా స్తన్యమనగా యశస్సును ఇచ్చు తల్లి యొక్క స్తన్యమని కూడ ధ్వనింపచేసి దాని ద్వారా తిక్కన భాగవత రచనా సక్తిని ధ్వనించెను. పోతన శ్రీ కైవల్య పదంబు చేరుటకు నై చింతించెద నన్న పద్యమున 'నందాంగనా డింభకున్' అని ముగించిన నందాంగన యశోదా దేవియే కదా.

పై భావములను స్వీకరించి కిమస్థిమాలాం శ్లోక తాత్పర్యమును వ్రాసి కొందము.

(1) అలకంరించుకొనుటలో నీకు ఎముకల దండ (అనగా మరణించిన నన్నయ పేరుతో రచింపతలచిన ఆరణ్యపర్వ శేష రచన వంటి రచన) అంటే ఇష్ట పడతావా ? లేక కౌస్తుభము (అనగా విరాటపర్వము నుండి తెలుగుపదములు ఎక్కువగా ప్రయోగించి రచింప తలపెట్టిన రచన వంటి రచన అంటే తిక్కన స్వభావసిద్ధరచన ఇష్టపడతావా ? (హరిహర రూపములు కలిసిన నీకు రెండూ ఇష్టమే. కనుక నేను రెండు రకములు రచించెదనని ధ్వని)

కాలకూట విషము (అనగా నేనుమరణించిన నన్నయ వలె రచించు రచన) బాగుగ రుచించునా? లేక యశోదా దేవి చనుబాలు (దేవకీ దేవి కడుపున పుట్టి యశోదాదేవి చనుబాలు త్రాగినట్లు నన్నయ భారతము కాక నా భాగవత రచన అంటే బాగా రుచించునా ? చెప్పు స్వామీ.

(2) దేవా యోగ బలమున దేహ త్యాగము చేసి సతీదేవి ఎముకల దండను పరమశివుడు ధరించి పార్వతీ దేవిగా పుట్టిన సతీదేవినే భార్యగా పొందినట్లు నన్నయ భారతము రచింపుచు

మరణించగా మిగిలిన భారతమును కొనసాగించుట ఇష్టమా ? లేక ఆదిపర్వమునుండి పూర్తి భారతమును భగవదంకితముగ చేసి రచించినచో ఇష్టపడుదువా ?

నన్నయ మరణించి (అరణ్య పర్వము మధ్యలో రచన ఆగి) కాలకూటము చేరుట ఎందుకు? మళ్లీ ఒక పుణ్య స్త్రీ చనుబాలు (భారత రచనము కొనసాగుటకు) త్రాగుటకు పుట్టుట ఎందుకు చెప్పు స్వామి?

(3) నన్నయ వ్రాసి వదలిన భారత రచన భగవదంకితముగ రచించినచో ఇష్టపడుదువా? లేక భాగవత రచన భగవదంకితముగ రచించినచో ఇష్ట పడుదువా ? నన్నయ మరణించుట ఎందుకు ? యశస్సును ఇచ్చే కొరకు (మోక్షాన్వేషణ కై ఒక పుణ్య స్త్రీ చనుబాలునాశ్రయించి, శ్రీ కైవల్య పదంబు చేరుటకు నైచింతించెదన్ .. నందాంగ నాడింభకున్ అని పోతనగా పుట్టుట ఎందుకు చెప్పు స్వామీ.

(4) నన్నయ వ్రాసి వదలిన భారత రచన భగవదంకితముగ రచించినచో ఇష్టపడుదువా? లేక రామాయణ రచన భగవదంకితముగ రచించినచో ఇష్టపడుదువా? (పోతన రామాయణ రచన తలపెట్టగా శ్రీరాముడు ప్రత్యక్షమై భాగవతమును రచింపమని చెప్పుట అన్వయము చేసికొనవలెను)

జనన మరణ భ్రమణంలో కొట్టుకొనేటట్లు కాలకూటముతో ప్రయోజనమేమిటి ? మళ్ళీ మోక్షాన్వేషణకై యశస్సును ఇచ్చు పుణ్య స్త్రీ స్తన్యమును ఆశ్రయించడ మేమిటి? చెప్పు స్వామి

అట్లు భావించిన తిక్కన భారత రచనమునకు చక్కని పథకము వేసికొని రచించినాడు.

నన్నయ రచన అరణ్య పర్వ వర్ష వర్ణన తో సరి

ఈ క్రింది కారణములు నన్నయ రచన ఆరణ్య పర్వ చతుర్థా శ్వాసమున వర్షాకాల వర్ణనతో ఆగిపోయినదని సూచింపచేయును.

(1) ఆరణ్య పర్వము మూలశ్లోకములతో గోరఖ్‌పూర్ ప్రతిలో సరిపోల్చి ఏ ఆశ్వాసమున కెన్ని గద్య పద్యములు మూలమో చూడగా యిట్లు తెలిసికొనగలము. (ఆరణ్యపర్వము మూలమున వన పర్వము అని వ్యాసుడు పేరిడినాడు.)

| ఆరణ్యపర్వ ఆశ్వాసము | వ్యాసుని వన పర్వ లోని శ్లోకములు | తెలుగు భారతములోని పద్యములు | వచనములు | మొత్తము |
|---|---|---|---|---|
| ప్రథమాశ్వాసము | 2015 | 239 | 158 | 397 |
| ద్వితీయ శ్వాసము | 2149 | 203 | 150 | 353 |
| తృతీయి శ్వాసము | 1811 | 236 | 160 | 396 |
| చతుర్ధా శ్వాసము | 2083 | 283 | 130 | 413 |
| పంచమాశ్వాసము | 1375 | 298 | 136 | 434 |
| షష్ఠాశ్వాసము | 1144 | 281 | 127 | 408 |
| సప్తమాశ్వాసము | 1276 | 314 | 152 | 466 |

తిక్కన అరణ్య పర్వ రచనకు సాక్ష్యములు

పై పట్టికను పరిశీలించిన చతుర్థాశ్వాసము నుండి పద్య సంఖ్య పెరిగి వచన సంఖ్య తగ్గి తిక్కన రచించినట్లు కొట్టవచ్చినట్లు కనబడును. అంతేకాక చతుర్థాశ్వాసము వరకు దాదాపు రెండువేల శ్లోక భావము ఒక ఆశ్వాసమునకు మూలము కాగా, పంచమాశ్వాసము నుండి 1300 శ్లోకములకే ఒక ఆశ్వాసము సరిపడినది.

కడపటి మూడు అశ్వాసములకు మూలము 3795 శ్లోకములు. నన్నయనే రచించినచో ఆరణ్యపర్వము పంచమాశ్వాసముగనో, షష్ఠమాశ్వాసముగనో యుండెడిది. కాని ఇప్పుడు సప్తమాశ్వాసముగ నున్నది. కనుక నన్నయ పరమపదసూచనగా తిక్కన ఆరణ్యపర్వమును ఏడు ఆశ్వాసములుగ విభజించి నన్నయ మరణమును ధ్వనించినట్లు మనము భావింపవచ్చును.

అంతేకాదు చతుర్థా శ్వాసమును మాత్రము సూక్ష్మముగ పరిశీలించిన మరికొన్ని విషయములు తేలునేమో గనించెదము.

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు సంశోధించి ప్రచురించిన భారత ప్రతిలో ఒకానొక తాళపత్రమున 'భూనతికిం, దివంబునకు' పద్యము నుండి ఎఱ్ఱన కవిత్వము ప్రారంభమని యున్నట్లు అధోజ్ఞాపికలో ఇచ్చి యున్నారు. ఆ పద్యమున షష్ఠీ విభక్తి ప్రత్యయము వాడుట, అందు బ్రహ్మ, సరస్వతుల ప్రార్థన గోచరించుట వలన అక్కడి నుండి తిక్కన రచనగా గ్రహింపవచ్చును. (ఎఱ్ఱన అని వ్రాయుట లేఖకుల ప్రమాద దోషమని సోదాహరణముగ తరువాత తెలిసికొందము) కనుక వర్ష వర్ణన వరకు, తదుపరి రచనమునకు మూలముతో సరిపోల్చి చూచెదము.

| ఆరణ్యపర్వ ఆశ్వాసము | వ్యాసుని వన పర్వము లోని శ్లోకములు | తెలుగు భారతములోని పద్యములు | వచనములు | మొత్తము |
|---|---|---|---|---|
| వర్షాకాల వర్ణన వరకు | 1014 | 87 | 50 | 137 |
| శరదృతు వర్ణన నుండి చివరి వరకు | 1069 | 196 | 80 | 276 |

వ్యాసముని శ్లోకములు రెండింటను దాదాపు సమమైనను శరదృతు వర్ణన నుండి పద్య సంఖ్య హెచ్చి వచనముల సంఖ్య తగ్గినది. వర్ష ఋతు వర్ణన వరకు గల 137 మొత్తమునకు తర్వాత రచన రెండింతలు 276 కలిగి ఉన్నది. ఆ పద్ధతిలో నన్నయనే రచించి యుండిన 13. × 2 = 274 మొత్తమునకు 87× 2 = 174 పద్యములు, 50×2=100 వచనములు కలిగి యుండెడివి. కాని 174 బదులు 196 పద్యములు 100 బదులు 80 వచనములు కలిగి ఉండుట వలన నన్నయ మరణమును తిక్కన పూర్తి చేయుటను సూచించుచున్నది. కథా భేదము పరిగణించిన ఈ చతుర్థాశ్వాసమును తిక్కన నన్నయ రచించిన గద్య పద్యములను పరిశీలించి నన్నయవలె రచించినట్లు ద్రువీకరించుచున్నది.

ఇట్లు ఆరణ్యపర్వమును ఏడు ఆశ్వాసములుగ విభజించుట, నన్నయ మరణించి (ఆదిపర్వము 7 + సభా పర్వము 2+ అరణ్యపర్వము 4 మొత్తము 13) 13 ఆశ్వాసారంభ ప్రసక్తులను దృష్టియం దుంచుకొని పంచమ, షష్ఠి, సప్తమ శూన్య సంబోధనలలో మొత్తము 1' ఆశ్వాసారంభ ప్రసక్తులుండునట్లు విభజించి, విరాటపర్వమున మూడు హరిహరనాథ ప్రసక్తులతో మొత్తము 48 ఆశ్వాసారంభ ప్రసక్తులుండునట్లు విభజించుట తిక్కన కృత్యముగ భావింపదగియున్నది. దీనికి కారణము అష్టాక్షరియైన 8 గుణకార సంఖ్య ఉండునట్లు ఎన్నికొనుటగా భావింప దగి యున్నది.

(2) నన్నయ రచించిన ఆది, సభా, ఆరణ్యపర్వాశ్వాసారంభము లన్నిటన 'అక్కథకుండు శౌనకాది మునులుకుం జెప్పినట్లు' అని సమముగ నున్నది. కాని ఆశ్వాసాంతము పరిశీలించిన ఆదిపర్వములోని 8 ఆశ్వాసములలో 5 ఆశ్వాసములలోను, సభా పర్వమునందలి రెండుఆశ్వాసములలో 2 ఆశ్వాసములలోను వైశంపాయన జనమేజయ ప్రసక్తులు పద్య రూపమున నుండగ ఆరణపర్వ ఏడుఆశ్వాసములలో సప్తమాశ్వాసమునందు మాత్రమే ఒకపద్యము కలదు. కనుక ఆరణ్య పర్వ మధ్యలో నన్నయ రచన ముగియుట సూచించుచున్నది.

అంతేకాక ఆరణ్య పర్వ ప్రతి ఆశ్వాసాంత కడపటి వచనములో ప్రథమాశ్వాసము చివర

'అతి రమణీయంబు గాను' అని, ద్వితీయ, తృతీయాశ్వాసముల కడపటి వచనమున 'రమ్యంబుగాను' అని ఉండి, చతుర్థాశ్వాసాంతమున 'ఎఱింగించిన తెఱంగు' అనియు, పంచమాశ్వాసాంత వచనమున 'సవిస్తరంబుగా' అనియు షష్ఠమాశ్వాసాంతమున 'విఖ్యాత మాధుర్య మనోహరంబుగా' అనియు, సప్తమాశ్వాసాంతమున 'సవిస్తరమధురంబుగా నుపన్యసించి అనియు ఉన్నది. ఈ మార్పులు చతుర్థాశ్వాసమున త త్కావ్యకర్త మారెనను విషయ మును ప్రస్ఫుటముగ తెలియజేయుచున్నవి.

జనమేజయ జనపాలున, కనఘ చరితునకుఁ బ్రీతుండయి వైశంపా
యను డాది పర్వకథ యె, ల్లను నిమ్మగ జెప్పె నని విలాస మహేంద్రా

అని ఆదిపర్వాంతమునకు ముందు తెలిపి

అని యిట్లు సభాపర్వం, బున కథ జనమేజయునకు మొగి వైశం పా
యను జెప్పిన విధమంతయు, మను నిభశుభ చరిత నిత్యమహిమాతిశయా

అని సభా పర్వంతమునకు ముందు తెలిపి, ఆరణ్య పర్వాంతమున

అనఘుడు గృష్ణ ద్వైపా,యన శిష్యుఁడు బోధనిధి సమంచిత మేధా
ఘనునకుఁ జనమేజయునకు, ననవరతానంద సుఖ సమగ్రత యొసగెన్

అని రచించి, ఆది, సభా పర్వములలో పర్వముపేరు దాని నంతయు చెప్పినట్లు చెప్పి ఆరణ్య పర్వాంతమున అనవరతము ఆనందసుఖ సమగ్రత ఒసగెననుటవలన ఆరణ్య పర్వ రచయితలోని మార్పు వ్యక్తమగుచున్నది. ఈ వచ్చిన క్రొత్త మార్పు విరాట, ఉద్యోగ పర్వాంతములను పోలినందున యిది తిక్కన రచనగా గ్రహింపవచ్చును.

ఆరణ్య పర్వ కడపటి వచనమున 'యిట్లు పాండుతనయుల వనవాస ప్రకారంబు సవిస్తర మధురంబుగా నుపన్యసించి' అని అమూలకముగ రచించెను. దానికి సరి యగునట్లు విరాటపర్వ ప్రథమ వచనమున 'నది యెట్లనినం పరమ పవిత్రులగు పాండు పుత్రుల చరిత్రం బుపాఖ్యాన సహితంబుగా వ్యాఖ్యానంబుసేయుచుండ వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె' అని ఆరణ్యపర్వ విరాటపర్వ కథలను కలుపుకొనెను. తిక్కన వచనములోని ఆరణ్య పర్వపుఁ వనవాస ప్రకారంబు సవిస్తరమధురంబుగా' అను పదముల వ్యాఖ్యానమే 'చరిత్రంబుపాఖ్యాన సహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా' అని తెలిసికొనగలము. ఉపాఖ్యానముల సహితముగా అనునది ఆరణ్య పర్వాంతమున అనవసరము. విరాట ప్రారంభమున అవసరము.

ఆరణ్య పర్వ ఉపాఖ్యానములు తిక్కన రచింపనిచో, విరాటపర్వమున ఉపాఖ్యాన సహితంబుగా వారల సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా అని రచించుట పొసగదు. ఆరణ్య పర్వచతుర్థాశ్వాసములో వర్ష ఋతు వర్ణన తర్వాత ఉపాఖ్యానము లన్నియు తిక్కన రచించె ననుట స్పష్టము. అట్లు కానిచో, తిక్కన విరాటపర్వమున అట్లు రచించుట అసమంజసము.

మొత్తము ఆరణ్యపర్వ శ్లోకములైన 11853 శ్లోకములలో నన్నయ 6989 శ్లోకములను తిక్కన 4864 శ్లోకములను తెలిగించినట్లు పై పట్టికనుండి తెలిసికొనగలము. దీనిని భిన్నరూపముగ సమకట్టిన నన్నయ 0.59 ఆరణ్య పర్వమును తిక్కన 0.41 ఆరణ్య పర్వ భాగమును రచించినట్లగును. కనుక నన్నయ 2.59 పర్వములను తిక్కన 15.41 పర్వములను తెలిగించినట్లు చూడవచ్చును. దీనిని సరిసంఖ్యలలో ఉజ్జాయింపు చేసినపుడు నన్నయ మూడు పర్వములను తిక్కన 15 పర్వములను రచించినట్లు చెప్పుట సంప్రదాయము. కనుకనే తిక్కన 'ఆదిదొడఁగి మూడుకృతులాంధ్ర కవిత్వ విశారదుండు' నన్నయ భట్టు తెలిగించెనని, తదుపరి పదునైదు పర్వములు తుదముట్ట తాను రచించెదనని శేషమేమి వదలినట్లుచెప్పలేదు. కనుక నన్నయ వదలిన చోటు నుండి తిక్కన రచించినట్లు ధ్వని.

తిక్కననే నన్నయ రచించెనని చెప్పుట చేత తిక్కన నన్నయ వలె ఆరణ్య పర్వశేషమును రచించుట ధ్వనించుచున్నది. అట్టి సమయమున సత్యము తెలిసికొనుటకు తిక్కన రచనలతో సరిపోల్చి కనుగొనుట వీలుకానిపని. కారణము తిక్కన తన రచనా వైఖరి మారుగుపరచి నన్నయ రచన ఎట్లుండునని తాను తలంచెనో, అట్లు వ్రాసితినని ధ్వనించుటవలన.

అట్లు తిక్కన రచించి తను రచించి నట్లు చెప్పుకొనుట నన్నయ మూడు కృతులొనర్చె నని తను చెప్పిన మాటకు విరుద్ధము. కనుక తిక్కన రచించినను చెప్పక శబ్దశక్తిచే ధ్వనించినాడు.

రచనా భేదము బయటపడక మానదు. కనుకనే అట్టి విజ్ఞులకు 'యత్నమించుకంత యైనను వలవదు' అని చెప్పెను. వారి అవగాహనకే శబ్ద శక్తిచే ధ్వనించెను.

తిక్కన నిర్వచనోత్తర రామాయణ రచనకు, భారత రచనా శైలికి, వైఖరులలో మార్పు కలదు. భారతములోనే విరాట పర్వాదుల రచనకు, ఆశ్వాసాంత పద్య రచనకు పోకడలలో తేడా కలదు. కనుక అదేవిధముగ తిక్కన 'భూసతికిం దివంబునకు' పద్యమునుండి ఆరణ్య పర్వశేషము రచించి యుండునని తలంపవచ్చును. అది ధ్వనించుటకే నేమో 'క్రౌంచ, హంస సమాకీర్ణా' అను శేష రచనకు మొదటి శ్లోకములోని హంసను రాజ హంసగ తెలిగించుటే కాక, అనేక హరిహర నాథ పద్యములలో హంసపదము ప్రయోగించెను. నన్నయను తలపించు రచన చేసినందుననేమో క్రౌంచ పదమును తెలుగున తెలిగింపలేదు.

ఈ సందర్భమున శేషాద్రి రమణ కవులు భాగవత ప్రశంస అను శీర్షికను భాగవత పీఠికగా 16.10.1922 తేదీన నందిగామ యందు వ్రాసిన దానిని ప్రచురించిన వావిళ్ళవారి 1961 భాగవత ప్రచురణను పరిశీలించుట అవసరము. చూడుడు. దీనిని గమనించిన పోతన, తిక్కన శైలులు వేరైనను తిక్కన కవితా ఛాయలు కొన్ని పోతన యందు కలవని గమనింపగలము.

"ఈతని (పోతన) కవిత్వంబు తిక్కన సోమయాజి రచించిన

సీ॥ నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి, యచ్చునఁబెట్టిన ట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొని వచ్చి, కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
చందురు నునుఁగాంతికం దేర్చి కూర్చి బా, గునకుఁ దెచ్చిన యట్లు కొమరు మిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును దెచ్చి, నారు వోసిన భంగి నవక మెక్కి
తే॥ యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ, గుచభరంబును నిల్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు, కాదె యీ త్రిప్పులేటికిఁ గమల వదన
సీ॥ గందు మీలకుఁ బుట్టి కాముబాణములతో, గలసి యాడెడునట్టి కన్నుఁగవయు
బిసకాండముల శిక్షఁబెరిఁగి లేఁదీఁగల, మెచ్చక యున్నట్టి మృదు కరములు
జిగిరులతో సంధి సేసి యంబుజముల, పై నెత్తి చనునట్టి పదతలములుఁ
గలకంఠముల చేతఁ గఱచిన విద్య వీ, ణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు
తే॥ నత్తెఱంగును రేఖయు నవ్విధంబు, గరువ చందంబు నెమ్మోయి కలికితనము
నట్టి చెన్నును సైరంధ్రి యందకాక, కలవె యొరులకు నెఱుఁగక పలికి తబల
శా॥ దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోకప్రతా పస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మదన విద్యాపారగుల్ మత్ప్రతుల్
గీర్వాణా కృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తధ్యం బెమ్మెయిన్ గీచకా
సీ॥ నడి దివియలు సేసె నగరికి మాణిక్య, మకుటముల్ పూనిన మనుజపతుల
దగు నాజ్ఞ నూయాణముగ నొనరించె మం, చిగ నేల నాలుగుచెఱఁగులకును
బ్రీతార్థి జనుల సచేతన త్యాగధ్వ, జములుగా నన్నిదేశములఁ బఱపె
దిక్కులన్నింటను దెలుపారు పూఁ తగా, వించె నుజ్జ్వల యశోవిభ్రమంబు
తే॥ రాజసూయాధ్వర ప్రవర్తకుఁడు నిత్య, సత్య భాషా మహావ్రతశాలి పాండు
రాజ దుగ్ధపయోనిధి రాజు ధర్మ, రాజు సుమ్ము మత్స్వామివనీరమణ యితడు

ఇవి లోనగు వానియందుఁ బోలె భావంబునను, బదసారస్యంబునను గవిత్వం బత్యంత ప్రౌఢంబు గాక మిక్కిలి సుకుమారంబై యుండును."

పై వచనమునందు శేషాద్రి రమణ కవులు పోతన కవితను తిక్కనకవితతో పోల్చిరి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు "ఎఱ్ఱ ప్రగ్గడ నిజముగా తిక్కన గారి కవిత్వము

ననుసరించెడి వాడు. ఆయన వ్రాసిన హరివంశము చూచినచో ఈ సంగతి తెలియును ... 'అంబ నవాంబు జోజ్జ్వల" ఎఱ్ఱాప్రెగడ వ్రాసిన పద్యము "ప్రాంశు పయోద నీల" తిక్కనగారు వ్రాసిన పద్యము సాధారణముగా నీ రెండు పద్యములు పోతన్నగారు వ్రాసినవనుకొందురు. ఈ పద్యములలోని రచన అంత మధురముగా నంత హృదయంగమముగా నుండును. మొత్తము మీద పోతన గారిదేమో అనిపించును" "తిక్కనగారి శైలి నన్నయ గారి నుండి గ్రహించినదే.[1] కనుక తిక్కన కవితలో పోతన బీజములున్నవనుట నిస్సందేహము. (పుట 50 మరియు 53 సాహిత్య సురభి). 'అంబ నవాంబు జోజ్వల' కూడ తిక్కన కవిత్వమని తరువాత తెలిసికొందము.

కనుక తిక్కన నన్నయవలె రచించినపుడు తిక్కన రచన ఆరణ్యపర్వశేష రచన వలె ఉండునని భావింపవలెను. ఈ సందర్భమున తిక్కన సంస్కృత శ్లోకములను కావ్యములను కూడా రచించుట గుర్తుచేసుకొనవలెను.

అట్లు మార్చి రచించినను కవి రచన కొన్ని పట్ల మారుపడదు. ఉదాహరణమునకు ప్రతి కవికి పద్య రచన ఎత్తుగడలో కొన్ని సందర్భములందు ఒరవడిగ కొన్ని పదములు పడుట అలవాటుగ నుండును. అట్టివి ఒకటి, రెండు పదములతో ముగియు వచనములలో బయల్పడును.

కనుక అరణ్య పర్వశేషమున శరదృతు వర్ణన ప్రారంభము (చతుర్థాశ్వాస మధ్యలో) నుండి వాటిన అట్టి పదములను చూచిన ఈ పదములు కనబడును.

(1) తత్సమయానంతరంబున (2) తదనంతరంబ (3) అంత (4) కావున (5) అదియునుంగాక (6) అయ్యవసరంబున (7) అట్టియవసరంబున (8) అయ్యవసరంబున నక్కడ (9) అయ్యవసరంబున దశాననుండు (10) అది యెట్లంంటేని (11) ఇవ్విధంబున

నన్నయ భాగమున ఆదిపర్వమునుండి అరణ్యపర్వ వర్ష ఋతువు పూర్తి వరకు వాడిన అట్టి పదములు (1) మఱియును (2) అంత (3) మఱియు (4) అదియునుంగాక (5) అయ్యవసరంబున (6) అంతనట (7) అట్టియెడ (8) మఱియు నొక్కనాడు (9) అట్టియవసరంబున (10) తదనంతరంబున (11) అనిన (12) తదవసరంబున (13) ఇట్లు పట్టుకొని (14) ఇట్లుకావించిన

నన్నయ తను ఆదిపర్వము నుండి ఎక్కువగా ప్రయోగించిన 'మఱియును' పదము ఆరణ్య పర్వశేషమున లేకుండుట, నన్నయ ఎక్కువసార్లు ప్రయోగించిన 'అంత' అను పదము

1. ఆంధ్ర మహాభారతోపన్యాసములు – 'శ్రీ నన్నయగారి భారతాంధ్రీకరణము' వ్యాసము శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. (పుట 19)

ఆరణ్య పర్వ శేషములో తక్కువగా ఉండుటవలన శరదృతు వర్ణనుండి నన్నయ రచన కాదని చెప్పక చెప్పుచున్నది.

ఎఱ్ఱన తన కావ్యములందు తిక్కన రచించిన ఒకటి రెండు పదముల వచనములే వాడెను. కాని 'కావున' అను ఏకపదవచనము ఆరణ్య పర్వ శేషములో చతుర్థాశ్వాసములో (165, 385 వచనములలో) రెండు మార్లు వాడబడి యున్నది. ఆ కావున పదము 5490 గద్య పద్యములు కలిగిన ఎఱ్ఱన నృసింహపురాణ, హరివంశములలో ఒక్కటైనను లేదు. తిక్కన రచనలో అనేక పర్యాయములు వాడి యున్నాడు.

1595 గద్యపద్యములు కలిగిన ఆరణ్యపర్వశేషమున రెండుమార్లు ప్రయోగింపబడిన 'కావున' అను ఏక పద వాక్యవచనము నన్నయ, ఎఱ్ఱనల రచనలలో ఒక్కటైనను లేక పోవుట చేతను, తిక్కన విరాటపర్వము నుండి కావచ్చుటచేతను అరణ్యపర్వశేషరచన తిక్కనదిగా భావింపదగియున్నది.

ఆరణ్యపర్వములో 'శరద రాత్రుల ముందరి, వెనుకగల మధ్యాక్కర, సీసపద్య రచనలలో యతిభేద ప్రయోగములున్నవని శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వచనము పై దానిని దృఢపరచుచున్నది.

ఎఱ్ఱన నృసింహపురాణ, హరివంశములలో వాడిన పదజాలము, వృత్తరచనారీతి, తిక్కన వాడిన పదజాలము వృత్త రచనారీతి సూక్ష్మముగ ఆరణ్యపర్వశేష పదసంపద, వృత్తరచనా రీతులలో పరిశోధించిన ఆరణ్యపర్వ శేష రచన తిక్కనదని ఇంకను అనుమానమున్న వారు పరిశీలించినచో తేలగలదు.

స్వప్న వృత్తాంతమున తిక్కనకు కనబడిన హరిహరనాథుని వర్ణన, కిమస్థిమాలాం శ్లోక వర్ణన, కొన్ని ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములలో హరుని ముందు వర్ణించినను, భగవంతుని పేరులో హరి ముందు వచ్చినను హరుని ముందు వర్ణించిన పద్యములు చాల తక్కువగ ఉండుట హరుని సూచితమైన ఆరణ్యపర్వ ఆశ్వాస శేషములు మూడు అవి విరాటపర్వాది సూచితమైన హరికి సంబంధించిన ఆశ్వాసముల కంటె తక్కువ అని తలంపదగి యున్నది. హరసూచితమైన ఆరణ్య పర్వ శేషమును స్ఫురింపచేయు కారణముగ శ్రీయన గౌరి నా బరగు అను అవతారిక పద్యమున 'విష్ణు రూపాయనమశ్శివాయ' అను పాదమును గ్రహించి, 'ఆరణ్యపర్వ ప్రథమ పద్యములో భూపతికిం అని ప్రయోగించినట్లు తెలిసికొనగలము.

చతుర్థాశ్వాస రచనలో మార్పు గమనించితిమి. అది ఎక్కడ నుండో పరిశీలింతము.

నన్నయ వనపర్వ 182వ అధ్యాయమును తెలిగించుచు పరమపదించెను. కనుక అందువర్ణితమైన వర్ష, శరదృతు శ్లోక రచన, పద్య రచన సరిపోల్చేదము.

నిదాఘాంతకరః కాలః సర్వభూత సుఖావహః

తత్రైవ వసతాం తేషాం ప్రావృట్ సమభిపద్యత (వన 182–1)

(పాండవులు అక్కడనే వసించుచుండగా వేసవి కాలము సమాప్తమై సర్వభూత సుఖావహమగు వర్షాకాలము ప్రవేశించెను)

ఛాదయంతో మహాఘోషాః ఖం దిశశ్చ బలాహకాః

ప్రవవర్షు దివారాత్రం అసితా స్సతతం తదా (వన 182–2)

(అప్పు డాకాశమును, అన్ని దిక్కులను మేఘము లావరించి రాత్రిపగలంతయు చిమ్మచీకటి చేసి మహాఘోష చేయుచు పెద్ద వర్షము కురియుచుండెను)

తపాత్యయనికేతా శ్శతశోద సహస్రశః

అపేతార్క ప్రభాజాలాః సవిద్యు ద్విమల ప్రభాః (వన 182–3)

(వర్షాకాలంలో వందలకొలది, వేలకొలది ఇళ్ళు సూర్యకాంతి విహీనమైనను మెరుపుల తెల్లని కాంతులలో కూడి ఉన్నవి)

విరూఢ శష్పా ధరణీ మత్తదంశ సరీసృపా

బభూవ పయసా సిక్తా శాంతా సర్వమనోరమా (వన 182–4)

(బాగుగ మొలచిన లేతగడ్డితోను, మత్తెక్కి ఉన్న అడవి దోమలతోను కూడిన భూమి, వర్షపు నీటికి తడిసి ప్రశాంతముగా మనోహరముగా ఉండెను)

నస్మ ప్రజ్ఞాయతే కించి దమ్భసా సమవస్తృతే

సమం వా విషమం వాపి నద్యోవా స్థావరాణి చ (వన 182–5)

(కొంచెము కూడ జనులు తెలుసుకొనలేక పోవుచున్నారు. ఎత్తు, పల్లములు, కొండ, నదులు మొదలగు బేధములు తెలుసుకొనుటకు వీలు లేకుండ భూమి అంతయు వర్షపునీటితో నిండెను)

క్షుబ్ధతోయా మహావేగాః శ్వసమానా ఇవాశుగాః

సింధవః శోభయాం చక్రుః కాననాని తపాత్యయే (వన 182–6)

(వర్షాకాలములో బుసకొట్టుచున్న బాణములా (సర్పములా) అన్నట్లు శీఘ్రముగ ప్రవహించుచున్న కలత చెందిన నీరు, కలిగిన నదులు అడవులను అలంకరించినవి)

నదతాం కాననాన్తేషు శ్రూయన్తే వివిధాః స్వనాః

వృష్టిభిశ్చా ద్యమానానాం వరాహమృగ పక్షిణామ్ (వన 182–7)

(వరాహములు, మృగములు, పక్షులు ఈ వర్షమునకు బాగా తడిసిపోయి, వివిధములైన అరవులను చేయగా అరణ్యములు ప్రతిధ్వనించుచున్నట్లు ఉండెను)

స్తోకకా : శిఖ నశ్చైవ పుంస్కోకిల గణై : సహ

మత్తా : పరిపతన్తి స్మదుర్దురాశ్చైవ దర్పితా : (వన 182–8)

(చాతక పక్షులు, నెమళ్ళు, మగకోకిలల సమూహములు, కప్పలు, సంతోషముతో మత్తెక్కినట్లు పరిగెత్తుచున్నవి.

తథా బహువిదాకారా ప్రావృణ్మేఘాను నాదితా

అభ్యతీతా శివాతేషాం చరతాం మరుదన్వసు (వన 182–9)

(వారు (పాండవులు) ఎడారి ప్రదేశములలో సంచరించుచుండగా, మేఘధ్వనులతో నింపబడిన మంగళకరమైన అనేక విధములైన ఆకారములుగల వర్షఋతువు గడిచినది)

క్రౌంచ హంస సమాకీర్ణా శరత్ప్రముదితా భవత్

రూఢకక్ష వనప్రస్థా ప్రసన్నజల నిమ్నగా : (వన 182–10)

(నదిలోని జలము తేరి ప్రసన్నముగ ప్రవహించుచుండ తీరమున క్రౌంచ, హంస పక్షులు చరించుచుండగా డొంకలు, వనములు, కొండల చరియలు గడ్డిమొలచి శరదృతువు ఆవిర్భవించినది.)

విమలాకాశ నక్షత్రా శరత్ తేషాం శివాభవత్

భృగద్విజ సమాకీర్ణా పాండవానాం మహాత్మనామ్ (వన 182–11)

(విమలమైన ఆకాశము, బాగుగా ప్రకాశించు నక్షత్రములు, మృగములు, పక్షులతో కూడిన శరత్కాలము మహాత్ములైన పాండవులకు శుభము చేకూర్చినది)

దృశ్యంతే శాంత రజస : క్షపాః జలదశీతలా :

గ్రహ నక్షత్ర సంఘైశ్చ సోమేన చ విరాజితా : (వన 182–12)

(పరాగములు అణగిపోగా, మేఘముల చేత చల్లగా ఉన్నరాత్రులు, గ్రహములు, నక్షత్రములు చంద్రునితోను ప్రకాశించుచున్నవి)

కుముదై : పుండరీకైశ్చ శీతవారిధరాః శివా :

నదీ : పుష్కరిణీశ్చైవ దదృశు : సమలంకృతా : (వన 182–13)

(ఆ పాండవులు) కలువల చేతను, పద్మముల చేతను అలంకరింపబడిన చల్లని జలములతో నిండిన మంగళప్రదములైన నదులను పద్మ సరస్సులను చూచిరి)

ఆకాశ నీకాశతటాం తీరవానీర సంకులామ్

బభూవ చరతాం హర్ష : పుణ్యతీర్థై సరస్వతీమ్ (వన 182–14)

(పుణ్యజలములు గల సరస్వతీ నది తటములు ఆకాశమువలె (నీల వర్ణముతో) ఉండెను. ఆ నదీతీరముల మీద ఉన్న నీటి ప్రబ్బలి చెట్లతో వ్యాకులముగా ఉండెను. అట్టి ఆ నది సమీపమున సంచరించుచున్న ఆ పాండవులకు సంతోషము కలిగెను)

తే. వై ముముదిరే వీరాః ప్రసన్న సలిలాం శివామ్
పశ్యంతో దృఢధన్వాన : పరిపూర్ణాః సరస్వతీమ్ (వన 182-15)

(దృఢములైన ధనస్సులు గల ఆ పాండవులు, ప్రసన్నమైన నీటితోనున్న మంగళప్రదమైన సరస్వతీ నదిని చూచి సంతోషించిరి)

తేషాం పుణ్యతమా రాత్రి : పర్వసందౌ స్మ శారదీ
తత్రైవ వసతా మాసీత్ కార్తికీ జనమే జయ (వన 182-16)

(జనమే జయా ! వారు అక్కడ నివసించుచుండగా కార్తీకమాసమునందు పర్వసంధియందు అతి పుణ్యమైన రాత్రి వచ్చెను)

ఈ అధ్యాయమును నన్నయ మరణమునకు ముందు ఇట్లు రచించి యుండిరి.

క॥ ఖర కిరణ తాపమున నురు, తర దవ దాహమున శోషితములైన వనాం
తర తరుతతి కాప్యాయన, కరమై వర్షాగమంబు గడు బెడఁగయ్యెన్ 133

క॥ నాలుగు కెలఁకుల నవఘన, జాలంబులు ప్రేలి కురిసె ఝంఝానిలవే
గాలోలములై బహుల, స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్ 134

క। ఘనతర నైశతమం బొకొ, యనఁగ ఘనాఘన తమిస్ర మవిరళమై క
ప్పిన జనులకు వస్తువిభా, వన మొక్కొక మాలు గలిగె వైద్యుతరుచులన్ 135

చ॥ అరుదగు తత్పయోద సమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వల భూముల భూరి దర్దురో
త్కర రవముల్ మహీరుహ శిఖాంతములందు శిఖండి తాండవాం
తర మదమంజుల స్వనము దారతరంబగుచున్ వనంబునన్ 136

చ॥ దళిత నవీన కందళకదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధుర సమీరణు డన్సఖు డూచుచుండఁగా
నులియుచు పువ్వుగుత్తులను నుయ్యెలలొప్పగ నెక్కి యూఁగె ను
ల్లల దళినీ కులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్ 137

క॥ సుర చాపచిత్ర గగన, స్ఫురణ బురణించునట్లు భూ వనిత నిరం
తర చిత్రితయై యొప్పెను, సురుచిర నవతృణ శిలీంధ్రసుర గోపములన్

ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ తాళప్రతి ఉ.వి. సంఖ్య 127 ప్రకారము పై పద్యము

వరకు నన్నయ రచన అని 25 తాళపత్రములను పరిశీలించి పాఠ భేదములతో ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణమును ప్రచురించిన ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు ప్రతి తెలుపుచున్నది.

పై పద్యములు వర్షాకాల వర్ణనతో ముగియు చున్నది. అనగా మూలములోని 9వ శ్లోకముతో ముగియుచున్నది. ఇక 7 శ్లోకములలో శరత్కాల వర్ణనము పూర్తిచేయ బడినది. నన్నయ రచించిన పై పద్యములు పూర్తికాగానే, మొదటి శరద్వర్ణన మిట్లు ప్రారంభమగుచున్నది.

వ॥ తత్సమయానంతరంబున

ఉ॥ భూసతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసిత రాజహంసగతి భాతి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసన శోభితం బగుచు నబ్జజయానముతో సమానమై (భార-3-4-140)

ఇది క్రౌంచ హంస సమాకీర్ణా' అను 10వ శ్లోకమునకు భూమిక యైనను, మూలములోని భావమే కాక మెఱుగులు దిద్ది స్వతంత్రత గోచరించుచున్నది.

తెలుగు భారతములోని శరదృతు వర్ణనము పూర్తియును మూలముతోను, నన్నయ గారి వర్షఋతు వర్ణనముతోను పరిశీలింపగా మూలములోని కొన్ని భావములను స్వీకరించి నన్నయ గారి వర్ష ఋతు వర్ణనను శరదృతువున కనువగునట్లు మార్చి ఇవి నన్నయ రచించినవా యనునట్లు రచించిన ట్లనిపించును.

ఇట్లు రచించుటకు కారణము రాజరాజు కాలసర్పముఖమున (అజగర ముఖమున అని భారతకథాగమనిక) పడి మరణించగా నిలిచిపోయిన నన్నయ ఋతువర్ణన, శరదృతు వర్ణనమైన సహజమైన మార్పుతో తిక్కన దిగివచ్చినట్లు ధ్వనింపచేయుటకు (శ్రీ మదుభయ కవిమిత్ర, కాలకూట, అస్థిమాల పదములు సంకేతములుగా) రచించినట్లు తలంపవచ్చును.

నన్నయ ఋతు వర్ణనమున సూర్య కిరణముల వేడివలన, చెట్లను దహించు కార్చిచ్చు వలన అడవిలో తపించు చెట్లను ఆప్యాయతతో ఆదుకొనునట్లు వర్షఋతువు వచ్చినదని నన్నయ వర్ణిస్తే, అదే అడుగుజాడల్లో నడుస్తూ భూసతికి దివమునకు అంతయు ప్రమోదము కలిగిస్తూ శరత్కాలము సమాగమమైనదని చెప్పి మహర్షి సమూహము ఉపాసించు రాజహంసగతి ప్రకాశించి ప్రసన్న సరస్వతీకము అబ్జాసన శోభితమగుచు అబ్జ జయానముతో సమానము చేసి నన్నయ వర్ణనా మార్గమునకు తిక్కన మెఱుగులు దిద్దినాడు.

అమూలములైన శబ్దములను ఉపయోగించు పదజాలములో కవి, తను చెప్పదలచుకొనిన

విషయములు ధ్వనించును. కనుక ఈ పద్యములోని 'భూసతికిం' దివంబునకు' 'సమాగమము' ఆ సకల ప్రమోదకరము' అబ్జాసన శోభితము పద ప్రయోగములలో కవి రహస్యము నిక్షిప్తము చేసెను.

భూసతికిం, దివంబునకు అని విభక్తి ప్రత్యయము వర్ష ఋతువర్ణనలోని 'వనాంతర తతికి' వలె ప్రయోగించుట, పద్యములో సరస్వతిని కూడియున్న స్వామి అబ్జాసన శోభితంబగు సరస్వతీకముగ ప్రార్థనారూపము చేసి విరాటపర్వమున హరిహరులను ఏకము చేసినట్లు వ్రాయుట వలన రెండు చోట్లను తిక్కన పద్య రచనా ప్రాచీనమును సూచించును.

భూసతికిం లోని సతి పదము, కిమస్తిమాలాంలోని అస్తిమాలకు సంబంధ ముండుట, 'దివంబు'నకు స్వప్న వృత్తాంతమును గుర్తు చేయుట, తిక్కన రచనా ధ్వని.

తిక్కన భారత రచన నన్నయ విడిచిపెట్టిన చోటునుండి కొనసాగించుటకు నిశ్చయించి, తన ప్రబంధ మండలికి కృతిభర్త ఎవరని ఆలోచించు చుండ ఇంచుక నిద్ర వచ్చెను. ఆ నిద్రలో నా కలోకనివాసియైన తిక్కన తండ్రి కనుపించి "కిమస్తిమాలాం" అని నీవు ముందు రచించిన శ్లోకము భక్త వత్సలుడైన హరిహరనాథుని సంతోషపరచి, తన దివ్య చిత్తమున గల కరుణను తెలుసుకొను శక్తిని ప్రసాదించి, నన్ను ఆకర్షించి, నాచే సేవలందుకొనుచు నిన్నను గ్రహించుటకు వచ్చుచున్నా"డని చూపుచుండ తిక్కన 'సవిశేష, సంభ్రమ, సంభరిత , హృదయుడై ఆ దిక్కున చూచెను. హరిహరనాథుడు తిక్కనకు ప్రత్యక్షమయ్యెను. తిక్కన భక్తి ప్రపత్తులతో కొలిచి నమస్కరించి నిలబడెను. అంత హరిహరనాథుడు చిరునవ్వుతో వ్యాసముని రచించిన భారతము పంచమ వేదమను పేరుతో జనులకు ఆరాధ్యము. దాని గౌరవము నూహించి నీవు 'అఖండిత భక్తిన్ తెలుగు బాస వినిర్మింప తివురు టరయ భవ్యపురుషార్థతరు పక్వ ఫలము గాదె?' అని తిక్కన రచింప తలచిన భారతము తన కంకిత మివ్వమని కోరెను. ఇందు 'అఖండిత భక్తిన్' లో ఒక పద్యమును ముగించుట, 'తెలుగు బాస వినిర్మింప' మరియొక వృత్తమున, మరొక చందస్సులో వ్రాయుట భారత భాగమును వదలక (నన్నయ ముగించిన చోటు నుండి) రచింపుమనిన ధ్వని భక్తి అనగా భాగమను అర్థము కలిగిన పదప్రయోగముచే ధ్వనించుచున్నది. (వినిర్మింప) పద ప్రయోగముచే విశేషముగ నిర్మించుటను తెలుపుచున్నది. నన్నయ విడిచిన భాగమును (అరణ్యపర్వశేషమును) మొదలుపెట్టునపుడు ప్రారంభమున అతుకుల బొంత వలె కాక అంతకు ముందరి నన్నయ రచనతో సరితూగి రచనా భేదము కనబడ కుండునట్లు రచించుటయును తిక్కన నన్నయ వలె రచించెదనను భావమును విశేషమే కదా.

అంత తిక్కన 'తనకిట్టి మహిమ లభించునా? భగవంతుని మహిమ ఆలోచనకైన అందని

ఎంత ప్రభావము కలిగినదని, ఆశ్చర్యపడి హరిహర నాథునితో 'అన్ని ప్రాణులలో జీవించు దేవా నీకరుణ అనే పాల సముద్రంలో నా మనస్సును మహావిస్తారముగ ఉంచుట ఆశ్చర్యము కదా !! నీ కరుణ వలననే వ్రాయగలిగితిని. నా జన్మాంతర దుఃఖములు తొలగునట్లు చేయమని కోరెను. అంత హరిహరనాథుడు జనన, మరణములైన సంసారము నుండి తొలగ మార్గము చూపితి నని మాయమయ్యెను. కనుక భారతరచన దివములోని తంద్రిని, ఆంధ్ర ప్రపంచమునకు సంతోషము కలిగించునది.

హరిహర నాథుని చూడగనే ప్రయోగించిన సవిశేష, సంభ్రమ సంభరిత హృదయుండనై అను సమాసములోని మొదటి పదమైన సవిశేషము తిక్కన షష్ఠ్యంత రచన ముందరి వచనమున ప్రయోగించి చెప్పెను. సంభ్రమమును అంతస్సన్నిధి కలిగించుకొని రచించిన మూడు హరిహరనాథ ప్రసక్తి పద్యములకు అన్వయించెను. వాటిని చూచి అరణ్య పర్వశేషము తిక్కన రచించెనా? అని సంభ్రమ పడుదు రని దీని భావముగా తలంపవచ్చును.

సంభరితమును హరిహరనాథునికి దివ్య చిత్తంబున నవధరింపు మను విషయమునకు అన్వయించెను. అందు యిట్లు రచించెను.

క॥ కథ జగత్ప్రసిద్ధ గావునఁ బూర్వప, ర్వార్థ యుక్తి చేయునట్టి యెడల
యత్న మించుకంతయయి, నను వలవదు వలసినట్లు చెప్పవచ్చి యుండు

కథ జగత్ప్రసిద్ధకావున పూర్వ పర్వమైన ఆరణ్యపర్వ ప్రారంభమున ఆశ్వాసారంభరాజరాజ ప్రశంస పద్యములు చివరన ఆశ్వాసాంత రాజరాజప్రశంస పద్యములు కలవే నాలుగవ ఆశ్వాసము చివర నుండి అట్టివి లేవే అని ఇంచుకంత యైనను ఆలోచింపవలసిన అవసరము లేదు. రాజరాజ లేడు కనుక తన (తిక్కన) కవిత్వము హరిహరనాథాంకితము కనుక అవసరమునకు తగినట్లు ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములు మాత్రము వదలిపెట్టి కథను మాత్రము రచింపవలసి వచ్చినది అని పై పద్యమున తెలిపెను. ఇందు ఇంచుకంతయయినను అని తెలుపుటవలన నన్నయ కంటె భిన్నమైన తన రచనా భేదము తేలికగా తెలియుననియు, కనుక దానిని గురించి పరీక్ష ఏ మాత్రము అనవసరమనియు జగత్ప్రసిద్ధమైన కథ ముగింపు, ప్రారంభము మాత్రము చూచుకొనిన చాలుననియు చెప్పి తన రచనను ధ్వనించినాడు. అట్లు కానిచో అసలు ఆ పద్యమే అనవసరము. హరిహరనాథుడే ప్రత్యక్షమై తనకు భారత మంకిత మివ్వమని కోరగా అట్టి కథయందు కొంతభాగము నేను వ్రాయక వదలెద నని దేవుని దివ్యచిత్తమున అవధరింపుమని చెప్పుట సమంజసమని తోచదు.

ఆఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములు లేకుండుట చూచిన ఎఱ్ఱన, ప్రతి తాళపత్రమున

కొన్ని పద్యములే ఉండును కనుక ఇందేమైన తాళపత్రములు పోయినవా? ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములు లేవే? నన్నయ మూడు పర్వములు రచించె నని తిక్కన చెప్పినాడే? అని పొందు సందేహములను పోగొట్టుటకు పదకొండు రాజరాజ నరేంద్ర ప్రశస్తి పద్యములను రచించి మొదటి మూడు పంచమ, షష్ఠ , సప్తమాశ్వాసారంభ పద్యములుగను, నాలుగవ పద్యమునుండి తొమ్మిదవ పద్యము వరకు గల ఆరుపద్యముల ప్రతి ఆశ్వాసాంతమున రెండు పద్యముల చొప్పున చతుర్థ, పంచమ, షష్ఠమాశ్వాసాంతములం వరుసగా చేర్చి (పూరించి) సప్తమాశ్వాసపు కడపట తిక్కన రచన తర్వాత తన స్వగతమును ఒక సీస పద్యమునను ఒక కంద పద్యమున చెప్పి తరువాత మిగిలిన రెండు రాజరాజ ప్రశస్తి పద్యములను పెట్టెను. స్వగతము రచించిన వెంటనే రాజ రాజ ప్రసక్తి (ప్రశస్తి) పద్యములు చేర్చుట ద్వారా తను రచించినది రాజ రాజ ప్రశస్తిపద్యములు మాత్రమే అని 'నన్నయ సారస్వతాంశ ప్రసక్తి' తనకు చెందినదని చెప్పుకొనుట ద్వారా చెప్పెనని తలంపవచ్చును. లేఖకులు ఆ ప్రసక్తి పదమును ప్రశంసగా మార్చినట్లు ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధిత ప్రతి అధోజ్ఞాపిక నుండి గ్రహింపవచ్చును.

లేఖకుల దోషములు

ఇక లేఖకు లట్లు చేయుదురా ? అను ప్రశ్నకు ఆనాటి పరిస్థితు లవగాహనము చేసుకొనవలెను. పూర్వకాలము జనసంఖ్య తక్కువ. గ్రంథాలయములు లేవు. తాళపత్రములలో వ్రాయుచుండెడివారు. సంస్కృతము బాల్యముననే చాలమంది చదువుకొనుట చేత తెలుగు భారతము ఆచార్య స్థానము వహించిన కవి పండితుల గృహములందే యుండెడిది. భారత ప్రతి కావలెనన్న ఎక్కువ డబ్బు లేఖకులకు యివ్వవలసి వచ్చెడిది. వారు కవి పండితుల నాశ్రయించి యుండెడివారు. అట్టి భాషా సాహిత్యము తెలిసిన లేఖకులు కొందరే ఉండెడివారు. అట్టి వారు వ్రాసి యిచ్చిన సప్తమాశ్వాసాంతముననే ఉన్న ఎఱ్ఱన పద్యములను చూచి ఎఱ్ఱన కవిత్వ మెక్కడ నుండి ప్రారంభమో యిందు లేదే ? అని ప్రశ్నించి లేఖకుడు ప్రతి సరిగా వ్రాసి యివ్వలేదను అవిశ్వాసమును ప్రకటించి యుందురు. ఆ లేఖకులు మూల తాళపత్రమున ఎచ్చట నుండి ప్రారంభమో లేనందున తికమకపడి, పరిశ్రమించి 'స్ఫురదరుణాంశు' పద్యములోని 'అరుణ'కును ఎఱ్ఱన పేరులోని ఎఱుపునకును గల భావసామ్యము వలన, అక్కడ నుండి ఎఱ్ఱన రచన రచించియుండవచ్చునని తలంచి 'ఇక్కడ నుండి ఎఱ్ఱన కవిత్వమనియు, అంతకు ముందరి పద్యముతో నన్నయ కవిత్వము సంపూర్ణమనియు వ్రాసియుండవచ్చును. ఇది ఎఱ్ఱననే వ్రాసి యుండిన ఎఱ్ఱన చతుర్థాశ్వాసాంత పద్యములలో సప్తమాశ్వాసాంతమున

యిప్పుడున్నట్లు రచించి, పంచమ, షష్ఠ, సప్తమా శ్వాసములందు తగు సూచన చేసి యుండెడివాడు. ఈ అంతరార్థమును గమనింపని కవి పండితులు భావసామ్యము సమంజసముగనే ఉన్నందున 'స్ఫురదరుణాంశు' పద్యము నుండి ఎత్తిన రచించి యుండునని తలపోసిరి. అది కాలగమనమున ప్రచారమై ఆంధ్రసారస్వత చరిత్రమున సత్యమైనట్లు రాణించినది. ఆ ఆలోచనా సరళి బీజరూపములో నున్న కవిపండితులు సమదృష్టితో ఈ పుస్తకమును పూర్తిగా పదే పదే చదివి సత్యాసత్యములను పరికించిన నిజము తేలగలదు. ఈ సందర్భమున

గీ॥ అనృత వచనంబు ప్రియకరమై తనర్చు, సత్యవచన మప్రియముయి చాలఁదోచు
గడఁగి యీ రెండు పరిణామ కాలమందు, గరళ పీయూష సమములై కానుపించు

(శిశు 4 –35) అను శిశుపాలవధలోని పద్యము స్మరణీయము

గోపీనాథ రామాయణములో వావిళ్ళవారి దోషములు –

ఇట్లు లేఖకులు చేయుదురనుటకు ఉదాహరణముగ ఇటీవల కాలమువాడై 19వ శతాబ్దమున జీవించిన గోపినాథ వేంకటకవి రచించిన శ్రీమద్రామాయణమును పరికింతము. అది 1887 వ సంIIన వావిళ్ళ రామస్వామిశాస్త్రులవారి ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాల యందు చెదలువాడ సుందరరామశాస్త్రులవారిచే లేఖకప్రమాదాది దోషంబులు లేకుండునట్లు పరిష్కరింపబడి శ్రీమద్వెలుగోటి సర్వజ్ఞ కుమారయాచేంద్ర బహదర్ మహారాజావారి యనుజ్ఞనొంది ప్రణీతమైనట్లు తెలుపబడినది. 1894 సంII నందు వేంకటగిరి శ్రీకాశి విశ్వనాథముద్రాక్షరశాల యందు శ్రీమదాంధ్ర రామాయణ మనుపేర ప్రథమముద్రణములోని పద్యములతోనే ముద్రింపబడినది. కాని కొన్ని పదములలో అక్కడక్కడ మార్పులు ఉండినను అంతగ పరిగణింపదగినవి కావు. ప్రథమముద్రణపు ఉపోద్ఘాతమే దీనియందు కలదు. 1916సంIIలో వావిళ్ళవారు పైరాజునుండి కాపీరైటుపొందితిమని ప్రథమముద్రణ ఉపోద్ఘాతముతోనే ముద్రించుచు గ్రంథనామమును 'గోపీనాథ రామాయణముగ' అందలి పద్యములను కొన్నిటిని క్రొత్తగా చేర్చుట వంటివి చేసి చదలువాడ సుందరరామశాస్త్రులవారి పరిష్కృతముగనే ప్రచురించిరి. అట్టి మార్పులు మూడుపరికింతము.

1. కృతాంతస్య గతిః పుత్ర దిర్వ్యభావ్యా సదా భువి
యస్త్వాం సంచోదయతి మే వచ అచ్ఛిద్య రాఘవ (అయో 24–35)

అను కౌసల్య శ్రీరాముని అడవికి పంపునపుడు చెప్పు శ్లోకమునకు వేంకటకవి

క॥ కుడుపుము గట్టుము పెట్టుము, ముడుపు మనుచుఁ గఱపదగియు మునుకొని నేనే
యడవి కరుగు మన పలసెను, గడు దుష్కర మహహ కాలగతి నేమందున్

(1887 ప్రతి అయోధ్య కాండము 57 పేజీ; 1894 ప్రతి 264 పేజీ) అని రచింపగా ఆ పద్యమును తీసివేసి

తే.గీ॥ దేని ప్రేరణ చేతను బూని నాదు, వాక్యమును ద్రోచిపుచ్చి యిబ్బంగి నీవు
విపినముగ కేగ దలచె దవ్విధి మహిమము, దుర్విభావంబు నేరికి నుర్వియందు

అని వావిళ్ళ పండితులు వ్రాసి చేర్చిరి. (గో.రా – అయోద్య 583)

2. సక్ర ద్దృష్ట్వాపి స్త్రీయ స్నృపేణ నృపవత్సలః
మాతృవ ద్వర్తతే వీరో మాన ముత్సృజ్య దర్మవిత్ (అయెధ్య 118–6)

అను శ్లోకమునకు వేంకటకవి (గో.రా – అయోధ్య–2216)

సీ॥ పరకాంత నేత్ర గోచరమైనచో దానిఁ, దల్లిని బలె నాత్మఁదలఁచు వాఁడు
పరుల సంతోష విస్ఫురణంబునకు దాను, నంచితంబుగఁ బ్రమోదించువాఁడు
ప్రజల దుఃఖమునకుఁ బరమాప్తుఁడును బోలెఁ, గొంచక దాను దుఃఖించువాడు
దీనులు రక్షార్థు లైనచో జనకుని, రీతి సత్కృప సంతరించువాడు

తే.గీ॥ వరమునీంద్రులఁ గన్న సేవకుని భంగి, వరుసఁ బరిచర్యఁ గావించువాఁడు వినయ
శీలకారుణ్య గుణములఁజెలఁగువాఁడు, రమ్య గుణమండనుండైన రాఘవుండు
(1887 ప్రతి, 204 పేజీ; 1894 ప్రతి 488 పేజీ)

రచింపగా వావిళ్లవారి 1916 ప్రతిలో ఈ పద్యము లోని 'సంతరించువాడు' ను 'ఆదరించువాడు' గా మార్చి ఈ పద్యముపైననే పై శ్లోకమున కనువాదమువారు చేసి ఇట్లు ఎక్కువగా చేర్చిరి.

క॥ క్షితిపతి యొకపరి యైనను, మతినెంచిక కాంతలందు మానము విడి తాఁ
బితృభక్తి రతుఁడు రాముఁడు, సతతంబును మాతృవృత్తి ఁజరియించురహిన్
(గో.రా. అయోధ్య 2215)

3. యుగపత్పతమానైచ్ఛ యుగపచ్ఛ హతైర్భృశమ్
యుగపత్పతిపతై శ్చైవ వికీర్ణా వసుధా ఒ భవత్ (అరణ్య 25–40)

అను శ్లోకమును వేంకటకవి

యుగపత్పతిల శరంబుల, యుగ పత్పతమాన దారుణోరుశరముల
న్యుగపత్ప్రహిత శరంబుల, జగతి పరిస్కీర్ణయయ్యె సాంద్రముగ రహిన్
(1887 ప్రతి ఆరణ్య 41 పేజీ; 1894 ప్రతి అరణ్య 62 పేజీ)

రచింపగా దానిని తీసివేసి క్రింది పద్యమును ముద్రించిరి.

క॥ పడుచున్న రాక్షసులచేఁ, బడిన మహోదారుణులగు పలలాదులచేఁ
బడనున్న వారి చేతను, బుడమి పరిక్షీర్ణమయ్యెఁ బొలుపుగ నంతన్ (గో.రా. అరణ్య - 421)

అంతేకాక అనేక పద్య, వచనములలోని పదములను మార్చిరి. వాల్మీకి వాడిన పదములే వేంకటకవి వాడినను వాటిని మార్చుట మిక్కిలి చిత్రము. 1887, 1894 ప్రతులలోని శ్రీరామచంద్ర పట్టాభిషేక ఘట్టమునందలి క్రింది సీసపద్యమును రెండు సీసపద్యములుగ విడగొట్టి తాము రచించిన పదములచే వెలయించినారు.

సీ॥ శత్రుఘ్నుఁ డానంద సహితుడై పాండుర, చ్ఛత్రంబుఁబట్టెఁ బ్రసన్నబుద్ధి
నిరువంక శశినిభ వరచామరంబులు, వీచిరి కపి దైత్యవిభులు వేడ్క
శతదళ సంయుక్త చారుచామీకర, మయసరోరుహ వరమాలికయును
దతరత్నకలితము ముక్తాహారము నొసంగె, శక్రచోదితుఁడయి స్వర్శనుండు
తే॥ గీ॥ దేవగంధర్వగానముల్దివిఁజెలంగె, సంతసంబున నప్సరః కాంతలెల్లఁ
జెలఁగి నృత్యంబుఁజేసిరి చిత్రగతులఁ, దోరముగ మ్రోసె దేవదుందుభులు నపుడు
తే॥ గీ॥ అఖిల సస్యసమృద్ధయై యలరెధాత్రి, ఫలసమృద్ధియుఁగనె బాదపంబు లెల్ల
దవిలి సుమములు గంధవంతంబు లయ్యె, శ్రీరఘూద్వహు పట్టాభిషేక వేళ
(1887 ప్రతియుద్ధ 341 పేజీ 1894 ప్రతి 729 730 పేజీ)

అను పద్యములను వావిళ్ళవారిట్లు రెండు సీసపద్యములుగ చేసిరి.

సీ॥ భూరిమోదమునఁ దాంబూల కరండము, వహియించి సేవించె భరతుఁ డపుడు
లక్ష్మణుండును ధర్మలక్షణ వ్యంజనంబు, భక్తితోఁ గరములఁ బట్టి విసరె
శత్రుఘ్నుఁ డానందసహితుఁడై పాండర, చ్ఛత్రంబుఁ బట్టెఁ బ్రసన్నబుద్ధి
నిరువంక శశినిభ వరచామరంబులు, వీచిరి కపి దైత్యవిభులు వేడ్క
తే॥ వాయుపుత్రుండు సవినయావనతుఁడగుచు, ముదితుఁడై రత్నపాదుకల్ మోచి కొలిచె
నింద్రనందనుఁడెన నుండి యెలమి మిగులఁ, జెలఁగు ప్రజకు బరాబరుల్ సేయుచుండె
సీ॥ శతదళ సంయుక్త చారు చామీకర, మయసరోరుహవరమాలికయును
దతరత్న కలితముక్తా హారము నొసంగె, శక్రచోదితుఁడయి స్వర్శనుండు
దివిదేవగంధర్వ దివ్యగానంబులు, చెలగె నప్సరసలు నెలమి నాడి
రతి సంభ్రమంబున నమర దుంధుభులును, దోరంబుగా నప్డు బోరుకొనియె
తే॥ గీ॥ నఖిల సస్యసమృద్ధయై యలరె ధాత్రి, ఫలసమృద్ధియుఁగనెఁ బాదపంబుఁలెల్ల
దవిలి సుమములు గంధవంతంబు లయ్యె, శ్రీరఘూద్వహు పట్టాభిషేక వేళ

ఇట్టి మార్పులు వచనము లందును చేసిరి. చూడుడు.

కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
దర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రత :
చారిత్రేణ చ కో యుక్త స్సర్వభూతేషు కో హిత :
విద్వాన్ కః కస్సమర్ధశ్చ కశ్చైక ప్రియదర్శన :
ఆత్మవాన్ కో జితక్రోదో ద్యుతిమాన్ కోఽనసూయక :
కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే
ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే
మహర్షే త్వం సమర్థో ఽ సి జ్ఞాతు మేవం విధం నరమ్

అను ప్రథమ సర్గ 2 నుండి 5 శ్లోకములకు వేంకటకవి ఇట్లు తెలిగించిరి.

ఇప్పుడీ లోకంబున దృష్టగుణ వ్యతిరిక్త ప్రశస్త గుణవంతుండును దా నక్షతుం డగుచుఁ బరుల జయించు వీర్యవంతుండును సామాన్య విశేష రూప దర్మజ్ఞుండును దన కొఱకుఁ గావింపంబడిన యుపకారం బల్పంబైనను బహుత్వంబున నెఱుంగునట్టి కృతజ్ఞుండును సర్వావస్థలయందును సత్యవచన శీలుండును ఫల పర్యంతంబు సమారబ్ధంబైన వ్రతంబు విడువనట్టి స్వభావంబు గల ధృఢవ్రతుండును వంశక్రమాగతాచార యుక్తుండును నపరాధంబు గావించిన వారియందైనను హితంబుఁ జేయునట్టి శీలంబు గలవాఁడును విదిత సకల వేద్య పదార్థుండును నన్యులచేత నిర్వహింప బడని కార్యంబు నిర్వహించుటకు సమర్థుండును నద్వితీయ ప్రియదర్శనుండును నసమానసర్వాంగ సుందరుండును నాత్మవంతుండును విధేయకోపుండును జితారిషడ్వర్గుండును ద్యుతి మంతుండును నసూయా రహితుండును నగు పురుషుండెవ్వఁడు సంయుగం బునందు జాతరోషుం డగునప్పుడెవ్వానికి సురాసురాదులు దలంకుదు రట్టి వాని వినం గుతూహలం బగుచున్న దట్టి  పురుష శ్రేష్ఠు నెఱుంగ నీవె సమర్థుండవు కృపామతి నెఱింగింపు మని యభ్యర్థించినఁ.

పై వచనమునందు 'అన్యులచేత నిర్వహింపంబడని కార్యంబు' తీసివేసి అన్యులకు నిర్వహింపం గూడని కార్యంబు' అని మార్చిరి.  మూలభావము చెడుట సహృదయులు గమనింపగలరు.

ఇన్ని మార్పులు చేసి ఈ మార్పులకు కారణముగా ' ఈ గ్రంథమందు చందో వ్యాకరణ లక్షణ విరుద్ధములగు ప్రయోగములు గనఁబడుచున్నవి గాని యీ ముద్రణమునం దవి చాలవఱకు ముద్రణాలయస్థ పండితులచే మార్పఁబడినవి గాన నుదాహరింప బడలేదు.  ఇట్టి దోషములు ప్రాచీన కవుల గ్రంథముల యందుఁ గూడఁ గానవచ్చుటం బట్టి యీ కవి, లాక్షణికుఁడు గాఁడని మనము చెప్పలేము" అని వ్రాసిరి

ఇట్టి లేఖకులను తలంచియే వేంకటకవి తన శ్రీమద్రామాయణమున

ఉ॥ కొంచెపువిద్యలన్ గడుపుకూటికి నన్యుల యొద్దఁజేరి తా
ఇంచుక పారమార్థికము నెంచక యన్నియు నేర్చినట్టు గ
ర్వించి కృతుల్ రచించుటకు లేక మహాకవులన్ గుయుక్తులన్
ఒంచన సేయు దుష్కవుల వారక బుద్ధి నిరాకరించెదన్ (గో.రా.– 16)

అని రచించిరి. వావిళ్ళ పండితులు ఈ పద్యమును ముద్రించుచు 'లేక మహాకవులన్' అను 1887, 1894 లో ప్రచురితమైన మూడవపాదపు పదమును తీసివేసి 'బెల్కురి సత్కవులన్' లని మార్చిరి. ఈ మార్పులోని అసమంజసమును విజ్ఞులు గ్రహింపగలరు.

పై పద్యమున వాడిన 'కొంచపు విద్యలన్' అను పదము లేఖకులను సూచించును. వారు కవి, పండితుల నాశ్రయించుకొని జీవించుచుండెడివారు. ఎఱ్ఱన నృసింహపురాణమున రచించిన 'భాసుర భారతార్థముల భంగులు అను పద్యమున 'పరమార్థము' ను ఈ పద్యమున వాడుట గమనించిన ఈ పద్యమున చెప్పిన కుకవులు భారతమును వ్రాసియిచ్చిన లేఖకుల వంటి లేఖలుగా తెలియగలదు.

సాధారణముగ కుకవి నిందచేయ నిచ్చగించని వేంకటకవి ఇరవై ఏండ్ల వయస్సున రచించిన మొదటి కావ్యమైన శ్రీమద్రామాయణమున పై పద్యమును రచించుట పూర్వజన్మ పుణ్యవిశేషమా అనిపించును. దీని ద్వారా ఆరణ్య పర్వ శేష రచన తిక్కనదే అని ధ్వనించుట వలన తిక్కన, వేంకటకవి ఒకే అక్షరు డనిపించును. 16 ఏండ్ల వయస్సున వేంకటకవి వేదగిరి నరసింహస్వామి కళ్యాణోత్సవమునకు వెళ్ళి యాదృచ్ఛికముగ అచ్చట కలిసిన ఒక యోగి వలన కవిత్వవిద్య అలవడినదని చెప్పుట చేత తిక్కన వేదగిరి నరసింహ స్వామి దేవళ ప్రాంగణమున భారత రచన చేసి యుండునని తలంపవచ్చును. ఈ విషయమును ఎఱ్ఱన తాతద్వారా విని యుండుటవలననే, తిక్కన కథాంశములను తన రాజరాజ ప్రశస్తి పద్యముల ద్వారా కలిపిన ఎఱ్ఱన, తిక్కన అంకితమిచ్చిన హరిహరనాథుని నరసింహస్వామిగ తలంచి నృసింహపురాణమును తిక్కన ననుకరించుచు రచించినట్లు తలంపవచ్చును.

తిక్కనకు ఇంచుక నిద్రించు సమయంబున స్వప్నము వచ్చి తిక్కన తండ్రి కనబడగా ఎఱ్ఱన నృసింహ పురాణమున 'నిమీలితేక్షణుండై యున్న క్షణంబున' స్వప్నము వచ్చి తన తాత కలలో కనబడినట్లు చెప్పుకొనెను.

తిక్కన పంచముఖుడు, పంచాక్షరి మంత్ర సంకేతముగా 5 షష్ఠ్యంతములను భారత విరాట పర్వమున హరిహరాంకితముగ వ్రాయగా ఎఱ్ఱన, నృసింహ పురాణమున హరికి, హరునికి

యిరువురికి సంకేతమైన 11 షష్ఠ్యంతములు (హరుని ఏకదశ రుద్ర సంకేతమైన ఏకాదశి రోజున యోగ నిద్ర నుండి హరి మేల్కొనుట ప్రసిద్ధము) వ్రాయుట అటువంటి షష్ఠ్యంతములు హరి వంశమున వ్రాయకుండుట గమనింపదగినది.

'ఏను విన్నపంబు సేయు తెలుంగున నంతస్సాన్నిధ్యం గలిగించుకొని యమ్మహో కావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద' అని తిక్కన భారతమున రచింపగా 'ఏను విన్నపంబు సేయం గల లక్ష్మీ నరసింహావతారంబను పురాణ కథకు బ్రారంభం బెట్టి దనిన' అని ఎఱ్ఱన నృసింహ పురాణమున రచించెను.

తిక్కన ఆశ్వాసారంభమును 'దేవా ! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' అని హరిహరనాధ సంబోదనము వెంటనే వ్రాయగా ఎఱ్ఱన 'దేవా ! రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె' అని నరసింహస్వామి సంభోదనము వెంటనే వ్రాసెను.

తిక్కన 5 షష్ఠ్యంతములు రచించిన చిహ్నముగా నృసింహ పురాణమును 5 ఆశ్వాసములుగ రచించెను.

తిక్కన 'స్ఫురదరుణాంశు' అని ఆరణ్య పర్వశేషమున అంధకారము మాపు స్ఫురదరుణాంశునిగా తెలుపుకొనగా ఎఱ్ఱన హరియోగమాయ నుండి మేల్కొంచు సమయమున తనను నూతనస్ఫురదరుణాంశునిగా చెప్పుకొనెను. ఇంతేకాక నృసింహ పురాణములో మూడు పద్యములు నన్నయ, తిక్కనలే భారత కథాంశమును రచించినట్లు రచించి ధ్వనించెను. హరివంశమున నన్నయను ఒక పద్యమున తిక్కనను ఒక పద్యమున వేరు వేరుగ వర్ణించుట ఇక్కడ గమనార్హము. నృసింహ పురాణమున హరి యోగమాయ నుండి మేల్కొంచు సమయమున ఎఱ్ఱన ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములను ఆరణ్యపర్వ శేషమున రచించినట్లు ధ్వనించెను.

ఇట్లు చేయుట ద్వారా 'హరిహరనాధాంకితమైన ఆరణ్యపర్వశేష పద్యములకు ఎఱ్ఱన తిక్కనపట్ల హరిహరనాధునికి లోకహితముగ తను చేసిన కార్యమును నివేదించుకొని నట్లయినది. నృసింహ పురాణమును మొదటి స్వంతరచనగా రచించిన ఎఱ్ఱన, తిక్కన మనుమసిద్ధి కంకితముగా రచించిన ఉత్తర రామాయణము వలె పూర్వ రామాయణమును వేమారెడ్డి కంకితము చేసి రచించెను. భారతములో నన్నయ షష్ఠ్యంతములు రచింపని విధముగ ఎఱ్ఱన హరి వంశమున షష్ఠ్యంతములు రచింపలేదు. నన్నయ భారతము రాజరాజ నరేంద్రుని కంకితముగ రచించినట్లు ఎఱ్ఱన హరివంశమును నన్నయ ప్రారంభించి నట్లు ఆశ్వాసారంభములు రచించి వేమారెడ్డి కంకితమిచ్చెను.

కాని ఎఱ్ఱన ఎక్కడను తను భారత కథాంశమును రచించినట్లు చెప్పుకొనలేదు. ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములను మాత్రమే అరణ్యపర్వమున రచించినట్లు ఎఱ్ఱన నొక్కి నొక్కి చెప్పుకొనెను. కాని వాటిని చదివిన కవి పండితులు ఎఱ్ఱన వినయవంతుడు కనుక లేఖకులు వ్రాసిన మాటలను భావసామ్యమును సత్యమని నమ్మి ఎఱ్ఱన రచించినట్లు ప్రచారము చేసిరి.

వేంకటకవి తన అసూయాపరుల ద్వారా వేంకటగిరి రాజు పెట్టిన పరీక్షగా రచించిన శ్రీ కృష్ణ జన్మ ఖండమున కాని, శిశుపాలవధ మహాకావ్యమందు కాని కుకవి నింద పద్యములు లేవు. కాని కడపటి కావ్యమైన శ్రీ రాధికాపరిణయమున నిట్లు కుకవులను నిందించెను.

చ॥ సముదితవృత్తి నింపగు రసాలకిసాలము మాని నింబప
త్రముఁ దినుమాడ్కి నీఁగయు ఘృతమ్మును మాని వ్రణమ్ము జేరు చం
దమున రహిన్ మహాకవి కృతంబగు సత్కృతి యందుఁ దప్పులే
నెమకుదు రొప్పు లున్నను గణింపరు దుష్కవు లీర్షచే మహిన్

మ॥ చతురత్వంబునఁ జారు చిత్ర కవితా సామ్రాజ్య సింహాసన
స్థితుఁడై యున్న కవీంద్రుఁ గాంచి కుకవుల్ సిగ్గేది నిందింపఁ ద
త్కృతికిం దత్కవి కేమి యెగ్గు ? ద్విరద శ్రేష్ఠంబు పై నున్న భూ
పతినిన్ గన్గొని క్రిందఁ గుక్క లదలింపం గూసినట్లే కదా

క॥ తుమ్మెద పువ్వులె వెదకును, దిమ్మరి కోలంబు పెంట దిబ్బలె వెదకున్
సమ్మతి నొప్పులె వెదకు ము, దమ్మన సత్కవియు గుకవి తప్పులె వెదకున్

క॥ తనయంత వలచివచ్చిన, ఘన పదములు గూర్చి చెప్పు కవి పద్యము నూ
తన ముక్తా ఫలములచే, నొనగూర్చిన సరము మాడ్కి నొప్పుచునుండున్

తే॥ సరసశబ్దార్థ సంగతు లెఱుఁగ లేక, పూర్వ కవుల శబ్దార్థముల్ ముచ్చిలించి
కూర్చు సమయం బెఱుంగని కుకవిపద్య, ముండు భువి గాజుపూసల దండకరణి.

పై పద్యములను వేంకటకవి పుంలింగ ప్రయోగమైన 'రాక' శబ్దము నాక్షేపించిన అముద్రిత గ్రంధ చింతామణి (సంపుటి 4 సంచిక 7 జులై 1891) కి సమాధానముగ రచించినట్లనిపించును:. ఆ పద్యమును చూడుడు.

"చ॥ రమణుని ముద్దు మోముఁ గని రాక సుధాంసుని నిందు వెన్నెలం
గోమరు వహించు కల్వలనఁ గోమలి వాలిక చూపు లారఘూ
త్తము రమణీయ దివ్యపద తామరసంబుల మీఁద నెంతయుం
బ్రమద మెలర్ప వ్రాలెఁ బతి పాదములం బ్రణమిల్లుకైవడిన్ (గో.రా.–బాల – 1291)
రాక శబ్దమునకుఁ బుంలింగ ప్రయోగము గీర్వాణ గ్రంధముల యందుఁ జింత్యము.

తెలుంగు నందైన నొక్కండు దక్క దక్కినవన్నియు స్త్రీ లింగముగానే "రాకాచంద్ర నిభాస్య-రాకాచంద్ర బింబాస్యలన్ - రాకా నిశా రాజ శ్రీ సఖమైన మోము" అని అనేక ప్రయోగములగపడుచున్నది. "కళాహీనే సానుమతిః పూర్ణేరాకా నిశాకరే" అని అమరము, అనఁగా అనుమతి. రాకా శబ్దములు వరుసగా నొక కళ తక్కువగా నున్న చంద్రుని తోఁగూడిన పున్నిమకును, అఖండ చంద్రునితోఁ గూడిన పున్నిమకును నామములు ఇంతియగాక నానార్ధ రత్నమాలయందును" రాకా నవరజో నార్యాం. పూర్ణచంద్ర పిధావతి" అని వ్రాయఁబడి ఉన్నది. "పూర్ణే రాకా నిశాకరే పూర్ణే సతిసా రాత్రీత్యుచ్యతే". నిండు చంద్రుఁడుగల రాత్రి రాకయని చెప్పఁబడు నమర ప్రయోగమువలన రాకాచంద్రునికిఁ బరిపూర్ణత్వము సిద్ధమయి యుండగా మరల నిండు వెన్నెల యననేల? పూర్ణచంద్రుఁ బూర్ణచంద్రికయని చెప్పుటఁ బౌనరుక్త్యమున కవకాశ మిచ్చెడిని. ఉపమేయ భూతములగు వాలిక చూపులకుఁ దతిపాదములఁ బ్రణమిల్లుట సాధారణ ధర్మము. యుక్తమయి యుండినట్లు సమానములగు కల్వలకును తామరసముల మీద వ్రాలుట. యుక్తమయి యుండవలదా ?

పరస్పర విరోధములగు వాని రెంటికిని సాధారణ ధర్మమే విధి జెల్లు ? "కొమరు వహించు కల్వలనఁ గోమలి వాలిక చూపులా రఘూత్తము రమణీయ దివ్యపద తామరసంబుల మీద నెంతయున్ బ్రమద మెలర్పవ్రాలె" నని చెప్పుట కడు నక్కజముగ నున్నది గాననిందలి సంశయాంశమును మా మిత్రుని వలనఁ దెలిసికొనుటకు నిది విద్యా విషయముగానఁ బ్రకటింపఁబడియె.

పూండ్ల రామకృష్ణయ్య అముద్రిత గ్రంథ చింతామణిలోనే చేసిన ఈ విమర్శను పరికించండి.

తే॥ దశరద కుమార వరుని సౌందర్యవార్ధి, కడరి యెదురెక్కు మీనులో యనఁగ సీత
వాలుచూపులు పతిమీఁద వ్రాలెనపుడు, రాజుపై వ్రాలు ఘన చకోరముల కరణి ॥

(గో.రా. బాలకాండ 1294)

"ఈ పద్యమునందు "దశరథ .. వ్రాలెన్" అని అలంకార సమాప్తి యగుచుండ, మరల సీతాదేవి వాలుఁ జూపులకు రాజుపై వ్రాలు ఘన చకోరముల కరణియని వేఱొండు సమాసంబిచుట నామ్రేడితమయ్యె అయిన నుపమాన భూతములగు మీనులకు వార్ధియం దడరుటయు. నెదురెక్కుటయు సహజముగాని చకోరములు చంద్రునిపై వ్రాలుట యప్రశస్తము. కిరణ వ్యాప్తిచేఁ బరితృప్తములగు జకోరములు చందురుపై వ్రాల గతంబేమి? మీలును, జకోరములును నుపమాన భూతములె యైనను మీనలకు వార్ధి విహార ధర్మముంబోలెఁ జకోరములకు రాజు పై వ్రాలు ధర్మ మసంగతము గాన నిందలి సంశయమును దెలిపి కొనఁగోరి దీనినిందుఁ బ్రకటించితిమి".

అముద్రిత గ్రంథ చింతామణి సంపుటము 4 సంచిక 9 సెప్టెంబరు 1891.

పూండ్ల రామకృష్ణయ్య చేసిన ఈ విమర్శ సరియైనదే. రంగనాథ రామాయణంలో, సీతాకళ్యాణ ఘట్టంలోని వర్ణనను వెంకయ్యశాస్త్రిగారు పద్యంగా రచించారు. ద్విపదభావాన్ని పద్యంలోకి తెచ్చునప్పుడీ లోపములేర్పడినవి. రంగనాధ రామాయణంలోని వర్ణనను చూడండి.

అంతట సుముహూర్తమని తెరదీయఁ, గొంత నెమ్మోము మున్గనుఁగొని యలరె
రాముని కనుగవ, రాకాసుధాంశు, గోమున నలరెడు కుముదంబులనఁగ
భామ చూపులు నిల్చెఁ బతిపాదయుగళిఁ, దామరపై తేటి తండంబు వోలె
నింతి లావణ్యాబ్ధి కెదురెక్కు మీన, సంతానమై రామచంద్రు చూపడరె
వరుదేహకాంతి ప్రవాహ మధ్యమునఁ, దరుణి చూపులు పద్మదళములై గ్రాలె,
సతిచూపుఁబతి సరసతఁజూపు రతిరూపు రతి మనోరమణుని రూపు,
నెలమి నొండొరులు మేనెఱుఁగ రాకుండ, గళలంటఁ దాకిన గతిఁ గొంతసేపు"

పూండ్ల రామకృష్ణయ్య విమర్శ కేవలము శాబ్దికమైనది. వెంకయ్యశాస్త్రి రామాయణమును చక్కగ పరిశీలించు విమర్శించు వారెవరును లేరనియే చెప్పవచ్చును. ఆనాటినుండి యీ నాటివరకు శాస్త్రిగారి పీఠిక పద్యాలు మాత్రం చదివి, ఉపోద్ఘాత వాక్యాలు మాత్రం పఠించి రామాయణంలో మూలమునకన్యూనాతిరిక్తమని చెప్పుట అపచారము. కొణిదెన బాలక్రిష్ణయ్య అను ఆధునిక విమర్శకు లొకరు వ్రాసిన ఈ రెండు వాక్యాలను గమనించండి. "తెలుఁగున సమగ్రమగు రామాయణము లేని కొరత ఇంచుమించుగ గోపీనాధ రామాయణముతోఁదీరినది. ఇయ్యది తెలుఁగున నింకొక రామాయణము వలయునను నవసరము నల దోపనీయదు గూడను. అయిన నీ గ్రంథ మొకింతమూలము నతిక్రమించి గ్రంథకర్త స్వకీయాభిప్రాయములతోఁ గలసి యున్నది... భాస్కరుని కవిత పారతంత్ర్యము నెఱుఁగదు. గోపీనాధుని వాణి స్వతంత్ర పరతంత్రముల రెంటిని యనుభవింపనేర్పరి.. గోపీనాధుని పద్యములు మాత్రము కొంత స్వతంత్రము, కొంత మూలాను సరణము, కొంతదనుక భాగవత పద్యానుకరణము గలుగుటఁజేసి లలితములై యాంధ్రత్వ గౌరవమునకుఁ దగియున్నవి."

(ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1930. ప్రమోదూత కొణిదెన బాలకృష్ణయ్య. ఆంధ్ర రామాయణములు (వ్యాసము) పుటలు 87 నుండి 91 వరకు.)

పేజీల కొద్దీ రాయకపోయిన ఈ విమర్శకుడు శాస్త్రిగారి అనువాద సరళిని ఆకళింపుకు తెచ్చుకుని చక్కగా చెప్పారు. నాటికి నేటికీ వెంకయ్య శాస్త్రిగారి రామాయణంపై ఇంత చక్కని అభిప్రాయం చెప్పిన వారెవ్వరూ లేరు."[1]

ఇట్టి ఆక్షేపణలకు వేంకటకవి రామాయణములోనే యిట్లు విన్నవించుకొనినారు.

1. గోపీనాథ రామాయణము – వెంకయ్యశాస్త్రులు అను కాళిదాసు పురుషోత్తంగారి వ్యాసము నుండి చూడుడు. శ్రీ సత్యసాయి మహిళా కళాశాల, అనంతపురం వారి 'రామాయణ రసవాహిని'

మ॥ ఇల సర్వజ్ఞుడు దేవదేవుడు రమాధీశుండు లేఁడన్యుఁ డే
నెలమిన్ నేర్చిన భంగి చెప్పితి శుభం బీరామచారిత్రమున్
బలుమాఱిందులఁ దప్పు లుండిన గణింపకన్ బోక సద్భక్తితోఁ
దిలకింపం దగు భావి సత్కవు లమందీ భూత చేతస్కులై (గో.రా. పీఠి-15)

ఇట్లు చెప్పుట చేత లేఖకులకు చెప్పునపుడు ఎప్పుడైన కొన్ని తప్పిదములు దొరలు ననియు, వాటిని లేఖకుడు తన దృష్టికి తేనందున సహృదయతతో రామాయణముపై నున్న భక్తితో పరిగణింపవద్దని రామాయణముననే విన్నవించుకొనినట్లు మనము గమనింపగలము ఈ సందర్భమున వేంకటకవి, తన 20వ ఏట రామాయణము రచింప ప్రారంభించి 25వ ఏట, పూర్తిచేయుటను కూడ గుర్తు చేసికొనుట సముచితము.

ఎవ్వరైన భారత, భాగవత, రామాయణాదులగు కావ్యములను కాని, ప్రబంధములను కాని కావలసిన కవి, పండితుల నాశ్రయించి ప్రతి చేయించిపెట్టమని కోరెడువారని తలంపదగి యున్నది.

పూర్వకాలమున ఇప్పటివలె గ్రందాలయములులేవు. గ్రంథాలయము రాజుగారి భాండాగారముననే ఉండెడిది. అది కవి, పండితులకు రాజులకు మాత్రమే అందుబాటులో ఉండెడిది.

కనుక పై పద్యము 'ఇక్కడ నుండి ఎఱ్ఱన కవిత్వము ప్రారంభమని రచించిన లేఖకుల వంటి లేఖకుల కన్వయముగ వేంకటకవి రచించెనని తలంపదగియున్నది.

'ఆసకలప్రమోదకరమై' అనునది తిక్కన విరాటపర్వమునందలి 'ఆంధ్రావళి మోదముం బొరయ'ను గుర్తుచేయుచున్నది.

శరత్సమాగమమని చెప్పుటచేత శరము (నీరు) ఆవిరియై ఆకాశమున మేఘరూపము (వాయురూపము) న శరత్కాలమున వర్షింపకుండుట వలన వర్షాకాలము వర్ణించిన (వర్షించిన) నన్నయ వర్షరూపమునుండి శరద్రూపముగ (రసరూపుడుగ) తిక్కన దిగివచ్చినట్లు ధ్వని.

సమాగమము అను పదము నన్నయ, తిక్కన రచనల సమాగమ మిచ్చుట అని సూచితము.

ఎఱ్ఱన చెప్పుకున్న తన రచన

దీనిని పెద్దలవలన సంపూర్ణముగ గుర్తించిన ఎఱ్ఱన నృసింహపురాణమున

"వ॥ కతిపయాక్షర పరిగ్రహజనితంబైన నైసర్గిక చాపలంబు కలవాఁడను

ఉ॥ మించిన వేడ్క వీనులకు మిక్కుటయై మధువృష్టి గ్రమ్మఁ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగడంగు భంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్యఁగీ
లించిన కీర్తి సంగసుఖలీలకు నేనును కాంక్షఁ జేసితిన్ (నృ.పు. 1–12, 13)

అని నన్నయ, తిక్కనలను కీర్తించినాడు. ఇంతేకాక 'తను కావించిన సృష్టి తక్కొరుల చేతం కాదు నా' అను పద్యమున తిక్కనను కవిబ్రహ్మ అని కీర్తించినాడు. కనుక నన్నయ, తిక్కనలు బ్రహ్మలు.

నన్నయ, తిక్కన బ్రహ్మలు రచించిన భారత భావములందు మన మనస్సును విహరింపచేయు భారతములోని అక్షరములు బ్రహ్మ వాహనమైన హంసగ ధ్వనించెను. ప్రారంభ దశలో నున్న తన రచనలోని అక్షరములు క్రౌంచముగ ధ్వనించెను. క్రౌంచము వంకరగతిగల దగుటచే పరిణత కవిత్వముగల ఆరణ్య పర్వశేష కథాంశ రచన తనది కాదని ద్వనించెను.

రాజహంసలైన నన్నయ తిక్కనల (భారత రచన) సంగీతామృత ధారావర్షము కూయగా, ఆ కూతవిని సహజముగ వంకరనడకనేగల క్రౌంచపక్షి (తన నృసింహపురాణ రచనలోని అక్షరముల ధ్వని) ఆవల ( ఆరణ్య పర్వశేష రచన తరువాత లేక దూరప్రదేశమున అనగా నృసింహ పురాణమున) కూయ ప్రయత్నించు విధముగా శబ్దము యొక్క అంతరార్థము తెలిసిన ముందరి మహాకవులు నిపుణులై సంపాదించిన కీర్తి వంటి కీర్తి తనకు చెందిన నన్నయ సారస్వతాంశ ప్రశస్తిలో నన్నయ వర్ణించిన రాజరాజ ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములలోని కొన్ని అక్షరములను గ్రహించి ఆరణ్య పర్వశేషమున రాజరాజ వర్ణన చేసిన కారణముచేత పుట్టిన స్వభావసిద్ధమైన చపలత్వముచేత తాను ఆశించితి నని పైపద్యవచనములలో ఎఱ్ఱన చెప్పుకొనెను.

పై వచనమునను, పద్యమునను ఎఱ్ఱన ఆరణ్య పర్వశేషమున రచించినది రాజరాజ ప్రశంసా పద్యములు మాత్రమే నని దానినుండి లభించిన ధైర్యోత్సాహములతో గొప్ప రచనలను సాధించగల మనోధైర్యమును ఎఱ్ఱన ప్రకటించినాడు.

నన్నయ కాలము నాటి రాజరాజ ప్రశస్తి ఆరణ్యపర్వ చతుర్థాశ్వాస ప్రారంభము వరకు నన్నయ రచన ననుసరించి కొన్ని పదములు గ్రహించి ఎఱ్ఱన రచించుటచే, రాజరాజ ప్రశస్తి రచనా సమగమము నన్నయతోను, ఆరణ్యపర్వ శేష కథను తిక్కన రచింపగా దాని వెనక కాని ముందుకాని ఉండు రాజరాజ ప్రశస్తి ఎఱ్ఱన పద్యములు ఉండుటవలన నన్నయ, తిక్కనల కావ్యశయ్యల కీర్తి సంగమ సుఖలీలకు కాంక్షించితి నని చెప్పుకొనెను.

ఈ పద్యమున క్రౌంచ, హంసలను పేర్కొనుట వలన, ఈ 'భూసతికం దివంబునకు'

పద్యపు మూలశ్లోకము 'క్రౌంచహంస సమాకీర్ణ' అగుటవలన, శరత్సమాగమము. నన్నయ, తిక్కనల కవిత్వ సమాగమమని, వారి రచన ఆరణ్యపర్వములో ఉన్నందున ఆ పర్వముననే తన రాజరాజ ప్రశస్తిపరమైన కొన్ని అక్షరములు శేషరచనగ చేసియుండుటచే తను వారి సమాగమము కీర్తి వంటి కీర్తిని ఆశించుచున్నా నని ఎఱ్ఱన పేర్కొనినట్లు మనము గమనింప గలము. ఈ శ్లోకానువాదమున తిక్కన క్రౌంచపదమును తెలుగున తీసికొనరాకపోవుటను గుర్తించిన ఎఱ్ఱన, ఆ క్రౌంచమును తను రచించిన రాజరాజ ప్రశస్తి పద్యములలోని అక్షరములకు అన్వయించినట్లు తెలిసికొనగలము. ఇట్లు చెప్పుట ద్వారా ఎఱ్ఱన ఆరణ్యపర్వ శేషాంశకథ తిక్కన రచించెనని ధ్వనించెను.

భారత రచనమున ఎఱ్ఱన తను రచించిన ఆరణ్యపర్వశేష రచనము నిట్లు తెలుపుకొనెను.

తే॥ ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ, డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తి దన్ను, జెందుటయు సాధుజన హర్షసిద్ధిగోరి

క॥ ధీరవిచారుఁడు తత్కవి, తారీతియుఁ గొంతదోప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్ (భార–3–7–468, 469)

ఈ పద్యములను భారత కథాంశము పూర్తికాగానే రచించి తదుపరి రాజరాజ ప్రశస్తి పద్యములను వర్ణించుటచేత కథాంశము తిక్కన, నన్నయ వలె చెప్పినదని, తదుపరి రచించిన రాజరాజ ప్రశస్తి పద్యములు మాత్రమే తనవని ఎఱ్ఱన ధ్వనించెను. కవి ముందు స్వగతమును చెప్పి తదుపరి తను రచించిన భాగమును తెలుపుట సంప్రదాయము కదా. చతుర్థాశ్వాస ఆశ్వాసాంత పద్యములనుండి రెండు పద్యముల చొప్పున సప్తమాశ్వాసమువరకు 8 ఆశ్వాసాంత పద్యములును, పంచమాశ్వాసమునుండి సప్తమాశ్వాసము వరకు 3 ఆశ్వాసారంభ పద్యములను మొత్తము 11 పద్యములను రచించిన ఎఱ్ఱన, చతుర్థాశ్వాస ఆశ్వాసాంతమున రాజరాజ ప్రశస్తి పద్యములకు ముందు తన స్వగతము చెప్పుకొనినచో, నన్నయ వలె తిక్కన రచించిన పంచమాశ్వాసాదుల కద ఎఱ్ఱన రచించినట్లు ధ్వనించును. కేవలము 11 పద్యములు మాత్రమే ఆరణ్య పర్వశేషమున అదికూడ సాధుజనులు ఆరోజులలో పద్యములు పోయినవా అని పొందు సంశయములను పోగొట్టుటకు మాత్రమే రచించిన కారణమున, అట్లు చేయుట ధర్మవిరుద్ధము. కనుకనే మహనీయుడగు ఎఱ్ఱన, సప్తమాశ్వాసకథ పూర్తికాగానే తన స్వగతమును చెప్పుకొని, రాజరాజప్రశస్తి పద్యములు రచించి తానటువంటి ప్రశస్తి పద్యములనే రచించితినని ధ్వనించెను.

పై పద్యమున ధీరవిచారుడెందుకు ? కథాంశము మాత్రమే రచించిన తిక్కన, భారతము చదువు ఎఱ్ఱన కాలము నాటివారికి రాజరాజ ప్రశస్తి పద్యములు లేనందున, ఆశ్వాసాంతములందు

ఆశ్వాసారంభమునకు ముందు ఏమైన పద్యములు పోయినవా అని సంశయించు సాధుజనుల సందేహములను పోగొట్టు రాజరాజ ప్రశంస పద్యములను మాత్రము వ్రాయు ధైర్య మెవ్వరకును లేకపోయెను. అట్లు రచించిన కుకవి అని సమకాలికులు వెలివేతురని భయపడుచుండిరి. అట్టి సమయమున మహనీయుడైన ఎఱ్ఱన సాహసించి తత్కవితారీతియు కొంత దోప (నన్నయ రచించిన రాజరాజ ప్రశంస నన్నయ రచించిన భారతభాగములో కనబడగా) తద్రచనయకా (ఆ రాజరాజవర్ణన మట్లే ఉండునట్లు) ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములను పూరించితినని ఎఱ్ఱన చెప్పుకొనెను.

సాహిత్యలోకమున 'కవీంద్ర కర్ణపుట పేయముగాన్' అని ఉన్న పదములను చూచి ఆరణ్యపర్వ శేషము రచించెనా లేక చెదలు కొట్టిన భాగములను పూరించెనా అని ఉన్నయ పదమును చర్చించి ఆరణ్యపర్వ శేష కథ కూడ రచించినట్లు నిర్ణయించిరి. ఎఱ్ఱన ఆరణ్య పర్వ ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములు రచించినను ఆరణ్యపర్వ శేష రచనమే కదా. సాహిత్య లోకము తిక్కన రచనలోని అంతరార్థము గ్రహింపక తిక్కన నాటికి మూడు పర్వములున్నట్లే తలచిరి.

మహాభారత తాళప్రతులను ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు సేకరించి, పరిశీలించి, పాఠాంతరములతో ప్రచురించిరి. వారు పరిశీలించిన 24 తాళప్రతుల వివరములను 'సాధన సామగ్రి' అను అంశమున వివరించిరి. ఆ 24 తాళప్రతులను గ్రహించిన కర్తలగా ఈ క్రిందివారిని పేర్కొనిరి.

1) ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ – 14 ప్రతులు
2) గౌతమీ గ్రంధాలయము, రాజమహేంద్రవరము – 2 ప్రతులు
3) దివ్యజ్ఞాన సమాజమందిరము, అడయార్ – 2 ప్రతులు
4) సంస్కృత అకాడమీ – 1 ప్రతి
5) ఆంధ్రవిశ్వవిద్యాలయము – 1 ప్రతి
6) సరస్వతీమహల్ గ్రంధాలయము, తంజావూర్ – 1 ప్రతి
7) శ్రీవాయల్పాడు కన్యకాపరమేశ్వరీ దేవాలయము – 1 ప్రతి
8) శ్రీ కొమరగిరి నారయ – 1 ప్రతి
9) శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ – 1 ప్రతి

పై 24 తాళప్రతులలో 15 ప్రతులు 19వ శతాబ్దిని లిఖించిన తాళప్రతులని తెలిపిరి. మిగతా 9లో 6 తెలుగు సంవత్సరములు మాత్రమే కలిగినందున ఎప్పుడు లిఖించినది

తెలుపలేకపోయిరి. అవియును 19వ శతాబ్దిలేక 18వ శతాబ్ది చివరివిగా ఉండవచ్చును. మొత్తము 24లో 10 తాళప్రతులు జీర్ణావస్థలోకాని, క్రిమిదష్టము లనికాని, చివరికమ్మలు లే వనికాని, కడపటి సప్తమాశ్వాసము లే వనికాని వ్రాయబడి యున్నవి.మంచిగ, సమగ్రముగ ఉన్న 14 తాళప్రతులలో క్రింది మార్పులను తెలియచేసి యున్నారు.

1) 'సారస్వతాంశ ప్రశస్తి' బదులు సారస్వతాంశప్రసక్తి అని ఇ,ఏ.జౌ, గ, ఘ, చ అని పేరిడిన 6 తాళప్రతులలో కలదని అధోజ్ఞాపిక యందు యిచ్చియున్నారు.

2) ఉ ప్రతిలో తప్ప మిగిలిన అన్ని ప్రతులలో "శారదరాత్రులు" పద్యముతో నన్నయభట్ట కవిత్వము సమాప్తమైనదని అధోజ్ఞాపికయం దిచ్చియున్నారు.

3) ఉ ప్రతిలో 'భూసతికిం' పద్యముతో ఎఱ్ఱాప్రగడ కవిత్వమారంభమని యున్నది.

4) ఐప్రతిలో స్ఫురదరుణాంశు పద్యమునకు ముందు ఈక్రింది పాఠము అదికముగా కలదని అదోజ్ఞాపికయం దిచ్చియున్నారు.

శ్లో॥ మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషం
వేదావాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహమ్ అని

సీ॥ భవ్యచరిత్రుఁడా....అను సీసపద్యమును

క॥ ధీరవిచారుడు....అను తేటగీతి పద్యమును అది యెట్లనిన

5) ఇ తాళపత్రపు 115వ కమ్మె రెండవప్రక్క "యింతటనుంచి యర్రాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వము" అని కలదు.

6) చ తాళపత్రములో "శారదరాత్రులు" తర్వాత యిక్కడికి నన్నయభట్టుగారి కవిత్వము సరి......యిట మీఁదట చదలవాడ యెర్రాప్రెగ్గడ గారి కవిత్వము చన్వకం" అని కలదని వ్రాసియున్నారు.

ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమంతయు రచించిన యెడల ఎఱ్ఱన రచన 1595 గద్యపద్యము లగును. ఇవి మొత్తము నన్నయరచన అయిన 4007 గద్యపద్యములతో సరిపోల్చిన కతిపయాక్షరములు కావు. కనుక 11 ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములే కతిపయాక్షరముః

ఎఱ్ఱన తనకు చెందినది నన్నయభట్ట మహాకవీంద్రు సరససారస్వతాంశ ప్రసక్తి చెప్పుకొనెను. కధాంశమని చెప్పుకొనక నన్నయ సారస్వతాంశ ప్రసక్తి అని చెప్పుకొనుటచే భారతాంశప్రసక్తి అని రాజరాజ ప్రసక్తి అని తెలిసికొనవచ్చును.

కధాంశము నన్నయ, తిక్కనలు రచించినట్లు ఎఱ్ఱన నృసింహపురాణమున ఇట్లు తెలుపుకొనెను.

ఉ॥ బాసురభారతార్థముల భంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వు తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగ జేసినట్టి య
బ్జాసన కల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్ (నృ.పు – 1-9)

ఎఱ్ఱన ఏమాత్రము భారతకథాంశము రచించి యుండినచో నన్నయ, తిక్కనలతో భాగము పంచుకొనగల్గు భాగ్యమును 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం తెలుగుం సేయుచు మత్పురాకృత పుణ్యంబు తానెట్టిదో...' అనియో మరొక సముచితరీతిగనో తెలుపుకొని యుండును. అట్లు చెప్పుకొనకపోగా నన్నయ, తిక్కనలనే బ్రహ్మకల్పులని స్తుతించుటచేత ఎఱ్ఱన కథాంశము రచించ లేదని ధ్వనించుచున్నది. అంతేకాక భారతములో నన్నయ రాజరాజ ప్రశస్తిలోని కొన్ని అక్షరములు గ్రహించుటచేత పుట్టిన స్వభావ సిద్ధమైన చపలత్వముచేత అని రచించుట ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత రచననే ధ్వనించుచున్నది.

పై పద్యమున 'పరమార్థము' అను పద ప్రయోగముచే అరణ్యపర్వశేష రాజరాజ ప్రశస్తి పద్యములను ఎఱ్ఱన రచించినందుకు ఆనాడు వచ్చిన విమర్శకు యిది జవాబు అని, కనుక ఈ పద్యమున కథాంశము రచించినది నన్నయ, తిక్కనలే అని ధ్వని. ఎఱ్ఱన సమకాలికులు, భారతమున ఎఱ్ఱన రచించిన కేవలం 11 పద్యములకు అరణ్యపర్వ కథాంశము రచించిన తిక్కన భాగమునంతయు ఎఱ్ఱన రచించినట్లు భ్రమ పడు అవకాశము కలదని, 1595 పద్యములను అరణ్యపర్వ శేష కథలో రచించినను తిక్కన తన పేరు చెప్పుకొనక నన్నయనే రచించెనని చెప్పుట వలన, ఆక్షేపించగా వారికి సమాధానముగా నేను చతుర్థాశ్వాసాంతము నుండి ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములను రచించినను సప్తమాశ్వాసపు రాజరాజ ప్రశస్తి పద్యములకు ముందే నా పేరు చెప్పుకొనినాను కాని చతుర్థాశ్వాసము కొనలో కాదు అని 'భాసుర భారతార్థముల భంగులు'లో ధ్వనించినాడు. తెలుగువారికి అనుటవలన తెలుగు భారతమున అని, వ్యాసముని ప్రణీత పరమార్థము (కథాంశము) తెల్లము చేసినది బ్రహ్మకల్పులైన నన్నయ, తిక్కనలే అని, వారి సంశయములను విశదపరచునదిగా దీనిని రచించెనని తలంపనగును. దీనిని దృఢపరచునట్లుగా ఎఱ్ఱన నృసింహపురాణమున తన తాత యిట్లు చెప్పినట్లు చెప్పెను.

ఉ॥ ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్ (నృ.పు. 17)

పై పద్యమున ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథములు కథాంశమునకన్న విశిష్టమైన సంస్కృతశబ్దములు గల రాజరాజ ప్రశంస కన్వయము. ప్రశంస చతురోక్తులతోనే కదా. పథము అనగా మార్గము, త్రోవ. కనుక పై పద్యభావమిది.

నన్నయ తిక్కనలపై గల భక్తి అతిశయముచేత తిక్కన వదలిన రాజరాజ ప్రశంస పద్యరచనచే (ఉన్నత సంస్కృతపదములచే రాజరాజ చాతుర్యమును వర్ణించు మార్గమున) కావ్యకర్తవై తెలుగు భారతములో ఆరణ్యపర్వశేషము ఆశ్వాసాంతమునుండి ఆశ్వాసారంభములను పూరించి, ఏమి పద్యములు పోలేదు అను సంశయము రాకుండునట్లు సుజనుల నానందపరచి గణనకు ప్రబంధపరమేశ్వరుడనునట్లు నిర్వహించితివి (అంగములులేని మన్మధుని అంగములు ఈశ్వరుడు కల్పించుటను తను రచించిన ఆరణ్యపర్వరచనకు ఎఱ్ఱన ధ్వనించెను) నన్నయ కాలమునాటి రాజరాజును ఎఱ్ఱన చూడకపోయినను, నన్నయ పర్వభాగములోని రాజరాజ ప్రశంస ఆధారముగ వర్ణించి (తిక్కన రచించిన) చతుర్థా శ్వాసములోని కదను, పంచమాశ్వాసా రంభములోని కథకు మధ్య పద్యములు రచించెను. కావున 'నన్నయ సారస్వతాంశ ప్రశంసే తన్ను చెందినను నన్నయ, తిక్కనల నిరువురను ఈ పద్యమున స్మరించెను. ఇట్లు కానిచో ఈ పద్యమున కేవలము నన్నయనేపేర్కొనవలసి యుండును. ఈ సందర్భమున డాక్టర్ పాటిబండ మాధవశర్మ ఆంధ్రసాహిత్య అకాడమీ వారి ఆరణ్య పర్వములోని పీఠిక యందలి 'ఎఱ్ఱనకు' శంభు దాసుడు అను బిరుదము కలదు గాని ప్రబంద పరమేశ్వరుడు అను బిరుదము లేదు. అది బిరుదమే యైనచో ఆయన గద్యలో గాని యితర గ్రంథములలో గాని దానికి ప్రసక్తి ఉండవలెను గదా ?' స్మరణీయము.

క॥ గురుభజన పరాయణుఁడవు, సరసబహుపురాణ ధర్మశాస్త్ర కదావి
స్తరవేదివి వినయోదయ, భరితుఁడ వతులానుభావ భవ్యుఁడవు మహిన్

క॥ కావునఁబ్రబంధరచనా, ప్రావీణ్యము నీకు సహజపరిణత సిద్ధం
బై వెలసినయది యొకకృతి, గావింప జగద్ధితంబుగా నేఁబనుతున్ (నృ.పు. 1–19, 20)

ఉన్నత సంస్కృతాది పద్యమున ఆరణ్యపర్వములోని ఆశ్వాసాంత, ఆశ్వాసార పద్యరచనా గణనచే ప్రబంధ పరమేశ్వరుడ వనునట్లు కావ్యకర్త వైతివని చెప్పి, బహుపురా ధర్మశాస్త్రకథలను విస్తరించుపద్ధతిని తెలిసినవాడవు. ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధమని తెలిపి ఒక కృతికావింప నియోగించెదనని చెప్పుటచేత నృసింహపురాణము ఎఱ్ఱన మొదటి కావ్యమని తెలియజేసుకొనెను. లేనిచో ఆ సమాసమున 'విస్తరవేదివి కాక రచించిన కావ్యము పేరుండును. ఈ నృసింహ పురాణ కావ్యముననే ఆరణ్యపర్వశేష రచనను పేర్కొనుట వలన ఎఱ్ఱన ప్రథమముగా ఆరణ్యపర్వ ప్రశస్తి పద్యములు రచించి నృసింహపురాణ రచన

కుపక్రమించెనని తెలియగలదు. ఈ నృసింహపురాణమున 'కతిపయాక్షర పరిగ్రహ చాపలంబు కతంబున' అని 'మించిన వేడ్క' పద్యము రచించినందున ఎఱ్ఱన రచన అరణ్యపర్వ శేష కాలమందు తన రచన పరిణతస్థితిలో లేదనియు కనుక కథాంశము రచించినది తిక్కన అనియు ఆశ్వాసాంత పద్యములే ఎఱ్ఱన రచించెననియు చెప్పకయే చెప్పుచున్నది.

ఇదే కావ్యములోని 'భాసుర భారతార్థములలోని నిక్కమెఱుంగనేరమిన్, పరమార్థము పదప్రయోగములచే భారతము నన్నయ, తిక్కన లిద్దరే రచించిరని ఎఱ్ఱననే చెప్పుటచేత నృసింహపురాణము మొదటి కావ్యమని చెప్పుటచేత ఉన్నత సంస్కృతాది పద్యమున చెప్పినది, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యరచననే చేసినదని స్పష్టము చేయుచున్నది.

హరిహరనాథాంకిత భారతమును తిక్కన వేదగిరి లక్ష్మీనరసింహ స్వామి దేవాలయ ప్రాంగణమున రచించినట్లు ఎఱ్ఱన తాతవలన వినియుండుట వలననే, తిక్కన భాగపు ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములను రచించిన ఎఱ్ఱన నృసింహపురాణము రచించినట్లు తలంపవచ్చును. ఈ సందర్భమున ఎఱ్ఱన రచించిన ఆరణ్యపర్వశేషపద్యములు తిక్కన రచించిన కథాభాగములనే కలుపుట (బంధించుట) గమనార్హము.

తిక్కన భారతమును ప్రబంధమండలి అనుటచే కవి, కథానాయక బంధమైన హరిహరనాథుని బంధమును నన్నయ భాగపు రాజరాజ బంధమును కలిపి ప్రబంధపరమేశ్వరు డైనట్లును తలంపవచ్చును.

ఉన్నత గోత్ర సంభవము నూర్జిత సత్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్యపరిభావి మదోత్కటమున్ నరేంద్ర పూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయ భట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్ (హరి. వం-1-8)

అను హరివంశపద్యమున నన్నయ భట్టకుంజరము, నరేంద్ర పూజోన్నయమై ఒప్పుచున్నట్లు చెప్పెను – ఈ పద్యమున నన్నయనే ఒక ఏనుగుగ వర్ణింపుచు 'నరేంద్ర పూజోన్నయనోచితంబు' అను పదము రాజ రాజ నరేంద్ర ప్రసక్తిని తిక్కన రచింపనట్లును దానిని తాను పూరించినట్లును ధ్వనించుచున్నది. లేని యెడ అట్లు రచించుటలో సముచితము కానరాదు. నరేంద్ర పూజోన్నయ మను పై పద్యములోని పదము ఉన్నత సంస్కృతాది పద్యములోని 'ఆరణ్య పర్వ నిర్వహణముతో సరిపోల్చి చూచిన ఆరణ్యపర్వ శేషము నందలి నరేంద్ర పూజ (రాజరాజ ప్రశంస) ఎఱ్ఱన పూరించినట్లు సరిపోల్చి తెలిసికొనగలము.

గాఢముగ కారుమేఘము లావరించుటచే పట్టపగలే చిమ్మచీకట్లు క్రమ్మగా రేయింబవళ్ళ

భేదము తెలియక తబ్బిబ్బు పడు జనులకు మెరపుతీగల వెలుగులే వస్తు పరిజ్ఞానమును కలిగించుచున్నవని నన్నయ వర్షవర్ణన చేయగా, తిక్కన దినదిన ప్రవర్ధమానమగు శరత్కాల వెన్నెలచే పరిపూరితములగు శారద రాత్రుల నన్నిటిని, ఉదయ భానుని (బ్రహ్మాంశలో ఉన్న సూర్యుని అనగా కవి బ్రహ్మ) అరుణ కిరణములచే ప్రకాశించు శరత్కాల పగలును వేరు వేరు పద్యములలో శరత్కాలమున కనువుగ వర్ణించి నన్నయ అడుగు జాడలను నడుస్తూ మెఱుగులు దిద్దాడు.

ఉపత్వాగ్నే దివేదివే దోసావస్త ర్ధియావయః
నభో భరంత ఏమసి ఋ : 1-1-7 సోమ 1-1-4

(హే అగ్ని దేవా ! మేము దినదినము రాత్రి పగళ్లయందు బుద్ధి కర్మల ద్వారా నమస్కారము సమర్పిస్తూ నీ యొక్క సమీపమునకు వచ్చుచున్నాము)

కII అవ్యక్తము వలననె స, ర్వ వ్యక్తులుఁబుట్టు బవలు వచ్చిన యపుడా
యవ్యక్త మందె యణఁగును, భవ్యగుణా రాత్రివేళ వచ్చిన మరలన్ (భ.గీ - 210)

అను శ్రీ భగవద్గీతా సూక్తి ననుసరించి నన్నయ మరణమును తనపుట్టుకను తలపిస్తూ తిక్కన రాత్రి, పగలు రెండు, రెండు పద్యములలో వర్ణించినాడు.

ఉII శారద రాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్య మాణ క
ర్పూరపరాగ పాండురుచి పూరము లంబరపూరితంబులై

చII స్ఫురదరుణాంశు రాగరుచిఁబొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దిశల్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడగన్

ఈ పద్యములు విరాట పర్వములోని షష్ఠ్యంతములోని కడపటి పద్యము, ఆశ్వాసారం పద్యములలో కడపటిదిని పోలిన కళానైపుణ్యము కలిగినది. చూడుడు.

కII హరిహరనాధునకు మరు, త్సరిదా కల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతోయుక్త భక్త పరతంత్రునకున్ (విరాట -36)

కII జలనిధి హిమవద్భూధర, కలిత జనన కేళీ కౌతుక వ్యక్తావ్య
క్తలలిత సౌందర్య స్ఫుర, దలఘుతను శ్రీ సనాధ హరిహరనాధా (విరాట -40)

హరిహరనాధ పదము పై పద్యమున ప్రధమ పదముగా షష్ఠ్యంతమున నుండి ఆశ్వాసారంభ

పద్యములో కడపటి పదముగా మారినట్లు 16 కళలు కలిగిన శారద పదము రాత్రి వర్ణనలో మొదటి పదముగా నుండి బ్రహ్మ, విష్ణు, శివరూపమైన పగలులో ఉదయభానుని (అరుణుని) వర్ణించునపుడు కడపటి మూడు పదములను బ్రహ్మవిష్ణు శివస్థానములుగ భావించి శారదను బ్రహ్మాంశలో ప్రయోగించుట అనగా కడపటి నుండి మూడవ పదముగ వాడుట తిక్కన కళావిదుని కళాకౌశల పరాకాష్ఠ

దీనిని గురించే ఎఱ్ఱన తిక్కనను కవిబ్రహ్మగా ఇట్లు స్తుతించెను. ఇది తిక్కన ఆరణ్య పర్వ శేషమును రచించెనని ధృవపరచు పద్యము.

మ॥ తను కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదు నా, నేముఖం
బున దా(ఋ)క్కిన పల్కు లాగమములై పొల్పొందు నా వాణి న
త్తను పీతం డొకరుండ నా(జను మహత్వాప్తిన్ గవిబ్రహ్మ నా
వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతా భ్యర్చితున్

పై పద్యమున ఎఱ్ఱన తిక్కన స్వతంత్రముగ రచించుటే కాక, ఏ కవి ఎక్కడ నిలిపినా ఆ కవిరచన వలెనే పూర్తి చేయు భావము కూడ కలవాడనియుస్తుతించినాడు. ఇచ్చట ఏముఖ మవి నందున ఆ – గమము, ఆ+తను (అత్తను) అని అన్వయము చేయునట్లు ఎఱ్ఱన రచించినాడు. కనుక తిక్కన ఆరణ్యపర్వ రచన చేసెనని శారదపదము 'స్ఫురదరుణాంశు' పద్యమున బ్రహ్మాంశలో వాడినందున కవిబ్రహ్మ అని తిక్కనకు కీర్తి వచ్చినదని ఎఱ్ఱన ధ్వనించినాడు. కవి అనగా సూర్యుడు అని ఆదిత్య హృదయము తెలుపుతును. కనుక కవిబ్రహ్మ శారదను బ్రహ్మాంశపదములో వాడిన తిక్కన అని తెలుపుటేకాక, 'అరుణ' శబ్దము బ్రహ్మాంశ కనుక కవి బ్రహ్మ అని కూడ ధ్వనించును.

'శ్రీ వాణిగిరిజాశ్చ' అన్న నన్నయ ఋషి వాక్కులో ప్రథముడైన బ్రహ్మ ఉదయమును అనగా తిక్కన పుట్టుకను ఈ పద్యము సూచించుచున్నది. శ్రీకృష్ణునకు ఖర్ఘ్యమిచ్చు సందర్భమున నన్నయగారి 'ఆదిజు(డైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవా(డు (సభా 2–18) లోని బ్రహ్మ ఉదయమే బ్రహ్మాంశలో ఉన్న సూర్యునిగ 'అరుణ' శబ్దము స్ఫురింపచేయుచున్నది.

'స్ఫురదరుణాంపురాగరుచి' లోని 'అరుణ' శబ్దము కవిబ్రహ్మ తిక్కన అని చెప్పుటకా అనునట్లు ఎఱ్ఱన తన నృసింహ పురాణమున శరదృతు వర్ణనము చేసినను, అందు ఆపదము ప్రయోగింపక హరి యోగనిద్ర నుండి మేల్కొంచు సమయపు అరుణుని

చ॥ ఉరుతర తల్ప పన్నగ ఫణోజ్జ్వల రత్న సహస్ర దీప్తిమై
బర(గ( గరంబు పొల్పెస( గె బద్మదళాక్షుని మేను నూతన

స్ఫురదరుణాంశురాగరుచి నూరెలఁ బర్వఁగ నుల్లసిల్లు నుం
రద మహనీయ నీల వసుధాధర శృంగము పోల్పు వట్టగన్ (నృ.పు. 1–73)

ఈ పద్యపు ఎత్తుగడ 'మహామహీధర మజ్జన సహస్ర ఫణాళి దాల్చి దుస్సహతర మూర్తికిన్ జలధిశాయికి' ని తలపించు నన్నయను ప్రథమపాదమునను, 'దీప్తిమైఁ బరఁగఁ గరంబు పొల్పెసఁగె బద్మదళాక్షుని మేను' అను అలతి అలతి పదములతో తిక్కనను తలపింపచేయుచు, 'నూతన' అను రెండవ పాదపు కడపటి పదము ఎఱ్ఱనను గుర్తుచేయుచున్నదా అనునట్లు మూడవ పాదపు ప్రారంభము నందలి 'స్ఫురదరుణాంపురాగరుచి' లోని అరుణ తిక్కన ఆరణ్య పర్వ శేష రచనను గుర్తుచేయుచున్నది. నూతన స్ఫురదరుణాంశు రాగరుచి నూరెలు పర్వగ నుల్లసిల్లు చున్నట్లు తనను గురించి ఎఱ్ఱన చెప్పినట్లు ధ్వనించినాడు. దీనివలన శరత్కాలమున రచించిన తిక్కన అరుణుడైనట్లును, హరిని మేల్కొంచు రచన చేసిన ఎఱ్ఱన నూతన అరుణుడు అనగా నూతన తిక్కనగా తనను ఎఱ్ఱన చెప్పుకొనినట్లు భావింపవచ్చును. నూతనకు ముందు, వెనుక తిక్కన రచన ననుకరించిన తిక్కన ఆరణ్యపర్వ కథాంశమును తన రాజరాజ ప్రశస్తి పద్యములచే కలిపినట్లును ధ్వనించినాడు.

ఇందు కథకు ఈవల, ఆవల ఉండే ఆశ్వాసారంభా, ఆశ్వాసాంత పద్య రచననే 'నూరెల' పదము. ఒకవైపు నుండి ఎక్కి మరొకవైపు నుండి దిగివచ్చుచు మధ్యనున్న కొనను కలిగిన 'శృంగము' ఆశ్వాసాంతముల కొనను చేరి ఆశ్వాసారంభమునకు దిగివచ్చు రాజరాజ ప్రశస్తి పద్య రచనను గుర్తుచేయుచున్నదా అనునట్లున్నది.

హరియోగ నిద్రనుండి మేల్కొంచు సమయమున ఈ పద్యముండుట కూడ ఆశ్వాసారంభ రచనను సూచించుచున్నది. నన్నయ రచనను గుర్తుచేయు ప్రథమ పాదము, తిక్కన రచనను గుర్తుచేయు రెండవ పాదపు కడపటి పదముగా 'నూతన' ప్రయోగించుటచేత ఆరణ్యపర్వశేష రచన తిక్కన చేసినట్లు ధ్వనించుచున్నది. 'స్ఫురదరుణాంశురాగరుచి' అను మూడవ పాదము విరాట పర్వము రచించిన తిక్కనను గుర్తుచేయుచున్నది.

ఇంతేకాక 'నూతన' పదము స్వతః భావహీనమై ఇంకొక పదముచేతనే భావవంతమైనట్లు తన ఆశ్వాసాంత రచనను గుర్తుచేయుచున్నది. 'నూతన' అను పదము లేకపోయినను భావలోపము లేనందున తను రచించిన ఆశ్వాసారంభ – ఆశ్వాసాంత పద్యములు లేకపోయినను భారత కథాంశ లోపము లేదని ధ్వనించుచున్నది. కనుక ఈ పద్యమున ఎఱ్ఱన తను రచించిన రాజరాజ ప్రశస్తి పద్యములే అని 'భాసుర భారతార్థముల' పద్యమున ఆక్షేపించిన సందేహమున తీర్చినట్లు భావింపవచ్చును.

శృంగము, సూరెల, నూతన వంటి పదప్రయోగములనే శ్రీ నాధుడు ఎఱ్ఱన సూక్తి వైచిత్రిగా పేర్కొనెను.

ఈ త్రయిఁదాఁ బ్రబంధ పరమేశ్వరుడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీ నరసింహ రామ చా
రిత్రములన్ బుధవ్రత గరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁడా
చిత్ర కవిత్వ వాగ్విభవ జృంభితుఁ గొల్చెద భక్తియుక్తి తోన్ (విక్ర 1-14)

అని చెప్పిన జక్కన పద్యమును పరిశీలింపగా తెలియవచ్చు భావములివి.

(1) శబ్దవైచిత్రి అనగా శబ్దమును విచిత్రముగ ప్రయోగించుట కనుక ప్రబందపరమేశ్వరుడు అనగా రాజరాజ హరిహరనాధులు కావ్యమునకు ఈశ్వరులు కనుక వారి బంధమును చేకూర్చిన ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడు లేక కథను, కావ్యభర్త (ఈశ్వరుడు) ను కలుపు బంధము అనగా రాజరాజ ప్రశంస పద్యములు ఎఱ్ఱన రచించినట్లు ధ్వనించును (2) ఎఱ్ఱన రచించిన కావ్యముల క్రమము ఆరణ్య పర్వ శేషము శ్రీ నృసింహ పురాణము, శ్రీ రామాయణము (3) హరివంశమును పేర్కొననందున ఎఱ్ఱన అప్పటికి హరివంశము రచింపలేదనియు, కనుక ఎఱ్ఱన జీవిత కాలమున జక్కన రచించిన కావ్యము విక్రమార్క చరిత్రమనియు గమనింపవచ్చును.

శారద రాత్రులను పద్యమునకు మూలము వ్యాసభగవానుని (183-12) శ్లోకము దృశ్యంతే శాంత రజసః అనునది. కాని నన్నయ పగలు, రాత్రులు రెండు చిమ్మ చీకటిగ నున్నట్లు మేఘము క్రమ్మినదని వర్ణన చేసినందున రాత్రి, పగలు రెండు వేరు వేరు పద్యములలో తిక్కన వర్ణించినాడు. 'భూసతికిం' పద్యములో 'ఆసకల ప్రమోదకరమై' అని శరత్కాలమంతటిని వర్ణించిన దినదిన ప్రవర్ధమానమైన చంద్రుని కళలన్నిటిని వర్ణించినాడు.

'హరిహరాజగజానన' అన్న నన్నయ గారి ప్రార్ధనలో సూర్యుడు ద్వారముఖమున నున్నట్లును దానిని తెరచి, వేయుటచే రాత్రి, పగలు వచ్చుచున్నట్లుగను నన్నయ, తిక్కనలోకే అక్షరుడని తెలియచేయుచున్నది. ఉత్పలమాలలో రాత్రి చంపకమాలలో పగటి వర్ణనను చేసి ఉత్పలమాల మొదటి గురువును రెండు లఘువులుగ మార్చి చంపకమాలగ మార్చగలిగిన విధముగా రాత్రి పగలు మారుచున్నట్లు ధ్వనింపచేయునట్లు రచించుట తిక్కన కళాకౌశలము.

'శారదరాతులుజ్జ్వల లసత్తర' పద్యమున శారదకీర్తి ప్రసన్నమైన వెన్నెలగ ఉత్పలమాలలో ఉండుట, 'భూసతికిం, దివంబునకు' అని బ్రహ్మ, సరస్వతుల ప్రార్ధన ఉత్పలమాలలో ఉండుట, 'అంబ' నవాంబుజోజ్జ్వల కరాంబుజ!' అను ఆరణ్య పర్వశేష

సరస్వతీ స్తుతి ఉత్పలమాలలో ఉండుట, శ్రీ యన గౌరి నా బరఁగు అను విరాట పర్వములోని హరిహరతత్త్వస్తుతి ఉత్పలమాలలోనే ఉండుట తిక్కన కళావిదుత్వమును ప్రదర్శించుటే కాక ఆరణ్యపర్వ శేషరచన తిక్కనదని సూచించుచున్నది.

ఆదరణీయ సారవివిధార్థ గతి స్ఫురణంబు గల్గి' అని నన్నయ సమాసము వంటి సమాసముచే నన్నయను కీర్తించిన తిక్కన, ఆరణ్యపర్వమును ప్రారంభించునపుడు 'భూసతికిం' పద్యమున తన స్వప్నవృత్తాంతమునకు 'దివంబునకు' పదప్రయోగము ద్వారా గుర్తుచేసి, ఈ పద్యమున నన్నయ సారస్వతమను (శారదను) శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులం చారుతరంబులయ్యె అనగా నన్నయ పద్యములు సారస్వతాకాశంలో ప్రకాశించు నక్షత్రముల వంటి ప్రకాశము కలగినవని నన్నయపట్ల భక్తి ప్రదర్శించినాడు. తిక్కన తన కవిత్వము 'విలసన్నవ కైరవ బంధురోదార సమీర సౌరభము తాల్చిన వనినాడు. సుధాంశుడను పదము రాజరాజును సూచించును. (రాజు అనగా చంద్రుడు రాజరాజు చంద్రవంశపు రాజు కనుక) సుధాంశు వికీర్యమాణ కర్పూరపరాగ పాండురుచి (రాజరాజకీర్తి) పూరములైన ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములు అంబర పూరితములు అనగా శూన్యముగా వదలిపెట్టబడి కథాంశమును మాత్రము తిక్కన రచించినట్లు ధ్వనించినాడు.

హరిహరనాథుడు ప్రత్యక్షమైనపుడు తిక్కన హరుని వర్ణించి తదుపరి హరిని వర్ణించుట హర సంకేతమైన ఆరణ్యపర్వము మొదట హరిసంకేతమైన విరాటాది అంత్యపర్వములు తరువాత వచ్చునని తిక్కన తలంపుగా భావింపవచ్చును.

అట్లే హరశిరము ధరించిన చంద్రుని సంకేతమైన రాత్రిని ముందు వర్ణించిన తదుపరి సూర్యునిచే (హరి) శోభితమైన పగలును వర్ణించుట కూడ తిక్కన తలంపుగా భావింపవచ్చును. రాత్రి వర్ణన నన్నయ మరణమునకును, పగటి వర్ణన తిక్కన ఉదయ రచమునకును సంకేతముగ భావింపవచ్చును.

నాలుగు దిక్కుల పెద్ద పెద్ద నీటి ధారలతో కప్పబడగా గాలివేగమునకు వచ్చు మ్రోతతో క్రొత్త మేఘముల సమూహము నిట్టనిలువుగ వర్షము కురిపించుచు తుములయుద్ధము చేయుచున్నట్లున్న దని వర్షఋతువును నన్నయ వర్ణిస్తే, శారదాగమనమునకు (తిక్కన శరద్వర్ణన ధ్వని) భయపడిన మేఘపటలముచే (నన్నయ వర్ష వర్ణన ధ్వని) ఆకాశము నుండి భూమి పైకి నల్లని ఏనుగులుగా దిగివచ్చి మేఘ గర్జన బృంహిత ధ్వనిగా వర్షధార (లే దానాంభః పటలము) గా వర్ణిస్తూ అడవి చివరలో (ఆరణ్యపర్వ తిక్కన రచన ధ్వని) సంచరించుచున్నవా అనునట్లు న్నవని తిక్కన వర్ణించినాడు. చూడుడు.

శా॥ దానాంభః పటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్ప్రయో
దాసీకంబు శరద్భయంబున నిగూఢా కారతన్ డిగ్గెనాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్

దీనికి మూలము శరద్వర్ణనలో లేదు. కాని నన్నయ వర్ష వర్ణన నుండి తిక్కన మలచినాడు.

తే.గీ. కరి కరంబునఁ గోరిన శరము దెచ్చి, ఘనమున కొసంగు; నది బలుగాడ్పు చేతఁ
దోలితంబయి దేశంబు కాల మెఱిఁగి, నీశ్వరాజ్ఞచే వర్షించు నిది నిజంబు (శ్రీ కృ.జ.3)

పై పద్యమున సూర్యునికి కరి అని వేంకటకవి ప్రయోగించినాడు. కరము అనగా సూర్యకిరణములని ప్రసిద్ధికదా. కనుక సూర్యుడు కరి. కవి అనగా సూర్యుడు, వాల్మీకి అని అర్థములు కలవు. ఆది కవియే కవిశబ్ద వాచ్యుడు. తెలుగున ఆది కవియైన నన్నయ కూడ కవి శబ్దవాచ్యుడే. సూర్యుడు సముద్రము, సరస్సులలోని నీటిని తన కరములచే గ్రహించి మేఘరూపుడై వర్షరూపమున భూమికి దిగివచ్చునట్లు నన్నయనే తిక్కనగ వచ్చిన ధ్వని పై పద్యము నుండి వచ్చుచున్నది.

ఆకాశమున మేఘధ్వని, పల్లపుభూముల యందు వాననీళ్ళ బురదలో కప్పల బెక బెక ధ్వని వినబడుచుండగా, వృక్షముల కొమ్మలపై నెమళ్ల నాట్య రవళులతో కనబడు మనోహర ప్రకృతిని నన్నయ వర్షవర్ణన చేయగా, కప్పల విషయమును ప్రత్యేక పద్యమున తర్వాత వర్ణించుటకు దాచి, శరత్కాలమున నెమళ్ల నాట్యలీలలు హంసలను చేరినట్లును (మూల శ్లోకమును ప్రథమముగ వర్ణించిన తిక్కనకు చేరినవని ధ్వని) ఏడాకుల అరటి వికసించి కొండమల్లె పూలు వికాసము పోయినట్లును నన్నయ భావన నుండి శరత్కాల వర్ణన తిక్కన మలచినాడు. చూడుడు.

క॥ కలనీల కంఠకోలా, హలలీలలు సెలగె రాజహంసకులంబున్
విలసించె సప్తపర్ణా, వలి విగళిత కుసుమకుటజ వాటిక లడరెన్

మూలమున 'క్రౌంచ, హంస సమాకీర్ణా' అని చెప్పినను ఈ భావన లేదు. తిక్కన నన్నయ రచననుండే మలచినాడు. అంతేకాదు 'అమూలమైన' నన్నయ చెప్పని సప్త పర్ణావలి (ఏడు ఆకులు. అవి ఏవి ఆరణ్యపర్వములోని ఏడు ఆశ్వాసములు. కనుక సప్తపర్ణావలి అనగా ఏడు ఆశ్వాసములుగ ఆరణ్యపర్వము తిక్కన మలిచిన ధ్వని 'నన్నయ మరణ ధ్వని') తీసికొని వచ్చినాడు. ఇది కూడ తిక్కన రచనా ధ్వని.

వర్షాకాలమున పూచిన పుష్ప సుగంధమంతయు వంటి నిండ పూసుకొని వచ్చిన వాయువు, పూగుత్తులను ఊయలను ఊపుచుండగా, తుమ్మెదరాణులు వానిపై కూర్చుండి, ఉల్లాసంగా ఊగుతూ, గొంతెత్తి తియ్యగా పాడుతున్నట్లు నన్నయ వర్ణింపగా దీనిని రసహృదయుడైన పరిత హృదయమునకు డోలాయమానముగ రసతరంగముల నానంద పరచు సారస్వతముగ ప్రతిబింబిస్తు నన్నయ మరణమునకు గుర్తుగా యముని దిక్కును స్ఫురింప చేస్తూన్నట్లు ఒకపుక్కిలి గర్వము చేత (బలముచేత) నీటి బొట్టు మిగులకుండ ఎండబెట్టిన (తపింపచేసిన) సముద్రపు నీరు కలిగిన ముని దక్షిణ దిక్కున ఉదయించి (తిక్కన ఉదయమని ధ్వని) వర్షాకాలమున బురదతో కలుషితమైన కప్పలకు ఆలవాలమైన నీటి బురదను విరగగొట్టి స్వచ్ఛత నిచ్చు శుచితో (సిద్ధిప్రద + ఆచార్యుడు – నన్నయ ప్రారంభించిన కవితా యజ్ఞము చెడకుండ సిద్ధింప చేయు కార్యకర్తగా అని తిక్కన పూర్తిచేసిన ధ్వని) ఆచార్యుడిగా అగస్త్య నక్షత్ర ముదయించెనని నాటకశైలి, కళలలో రసమూర్తిగా భారతమును తుదముట్ట రచించి హరిహరనాథాంకిత మిచ్చి సహృదయుల నలరించినాడు. చూడుడు.

మ॥ అతిగాంభీర్య విభూతి నేకచులుకాహంకార విశ్శోషణో
షిత పాథోధిపయస్కుఁ డైనముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీధి బ్రకట క్రీడా కళాగర్వ గ
ర్జిత మండూక కళంకితాంబు శుచితా సిద్ధి ప్రదాచార్యుడై

దీనికి మూలము వ్యాసుని భారతములో లేదు. అరుదగు తత్ప్రయోద సమయంబున' అను నన్నయ వర్షఋతు పద్యములోని దర్దుర (కప్పల) రవములు 'కలనీలకంఠ' అను పద్యమున చేర్చక 'దళిత నవీన కందళ' అను నన్నయ వర్షవర్ణన పద్యముతోచేర్చి శరత్కాలమున కనువుగ వర్ణించినాడు. కప్పలు బురద చేసినవనుట వలన తిక్కనకు పూర్వము ఆరణ్య పర్వ శేష రచన కొందరు పూర్తి చేయ రచించి మలినము చేసి రనియు, దానిని తాను శుచిత్వ సిద్ధి ప్రదముగా చేసితి ననెను. ఆచార్యుడనగా నన్నయ అని ధ్వని. కనుకనే ప్రథమ శిష్యుడైన తిక్కన ఆరణ్య పర్వ శేషమును నన్నయ పేరనే రచించినాడు. కనుకనే వేంకటకవి శ్రీ కృష్ణ జన్మఖండ కవి స్తుతిలో నన్నయను ప్రథమాచార్యుడని నాడు. తిక్కన ద్వితీయాచార్యుడు ఈ ఉభయ కవుల సమష్టి కృషి తెలుగు భారతము కనుకనే వారిరువురు బ్రహ్మలు.

వర్షాకాలమున ఇంద్ర ధనస్సుల కాంతిచే ఆకాశము విచిత్ర కాంతిమయముగ చేసి దాని ప్రభావమున భూవనిత పచ్చగడ్డి మొక్కలమధ్య విచిత్రముగ నిరంతర చిత్రితయై ప్రకాశించుచున్న దని నన్నయ వర్షవర్ణన చేయగా శరత్కాల మేఘముల చేత చుట్టుకొనబడిన నీలివర్ణపు ఆకాశమునకు ప్రతిబింబమా అనునట్లు పుష్పించిన రెల్లు గడ్డి మధ్య ప్రకాశించు

నీలవర్ణపు నీరు కలిగిన నిర్మల సరస్సులను తిక్కన శరత్కాలమున కనుపుగ నన్నయ వర్ణిన నుండి ప్రతిబింబించినాడు. చూడుడు.

తే॥ విశద శారదాంబుధి పరివేష్టనమున, బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచ కాశవనీ పరివేష్టనమున, నతిశయిల్లె నిర్మల కమలాకరములు

ఈ పద్యమునందు తిక్కన తనకు ముందువారు చేసిన మలినమును శుభ్రపరచి దివి చేరిన నన్నయ భాగమునకు ప్రతిబింబముగ ఆరణ్య పర్వ శేషము పూర్తి చేసినట్లు ధ్వనించినాడు.

నన్నయనే తిరిగి తిక్కనగా పుట్టినట్లు తిక్కన ఆత్మ విశ్వాసమని దానిని ప్రతిధ్వనిస్తూ 'కిమస్థిమాలాం' శ్లోకము రచించెనని, దాని చివరిపాదమున ప్రయోగించిన 'కాలకూట', 'యశోదాస్తన్య పదముల వ్యాఖ్యానముగా పోతన 'కాలుచే నమ్మెట ప్రేటులంబడక సమ్మతి శ్రీ హరి కిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్' అని ధ్వనించెను. దీనినే వేంకటకవి 'కాలకూటము తాను కబళించి సేవక తతుల కెవ్వా డమృతం'బొసంగె' నని మోక్ష ప్రదాతగా చెప్పెను.

కాలము దైవ స్వరూపము. సంవత్సర సంవత్సర కాల పరిమితులు పరిమాణమున ఒకటే యైనను ప్రతి సంవత్సర కాల ప్రభావము జీవులపై వివిధములుగ నుండును. అట్టి కాలము అనంతశక్తి సంపన్నమైనది.

జీవిత సంఘటనలు ప్రకృతి మూలములైన కర్మ బద్ధములు. సహజ సిద్ధములైనవి. ఒక జన్మమున చేసిన పనులు కొన్ని ఋణానుబంధ రూపమున మనకు మరుజన్మమున సాక్షాత్కరించును. అట్టివి మనము ప్రయత్నము చేసినను చేయకపోయినను సిద్ధించును. అట్టి కర్మలు రాజులవంటి శక్తి సంపన్నులయందును, సామాన్య వ్యక్తుల యందును సమానముగ వర్తించును. ఇట్టి వానికి సాక్షు లెవ్వరును దొరకరు. దైవ రూపమైన కాలమే సాక్షి.

కాలగమనమున జరిగిన ఏ కార్యమునకైనను దానితో సంబంధమున్న వ్యక్తులే సాక్షులు. మిగిలిన వారు ఆ కాలమున జీవించి ఉన్నప్పటికీ వారి కది వినికిడి సత్యము లేక జనశ్రుతి. అట్టి కొన్ని మాటలు అప్పుడు వినువారికే అసత్యములుగ ననుపించవచ్చును. ఇక వేరు కాలమున జీవించిన వారి సంగతి చెప్పవలయునా? ఆవేశముతో పూర్వకాలపు రాజులు ఎప్పుడో ఏ సందర్భముననో చేసిన పనులు జనశ్రుతిగా ప్రచారమగును. అట్టి వానిని ఆనాటి సంగతి సందర్భములు, పరిస్థితులు వారి ధర్మా ధర్మ పరిపాలనముల ప్రత్యక్షానుభవము లేక జరుగుట కవకాశము లేదనుట సమాధానము కాదు.

అపకీర్తి యైన గీర్తి
యైన నుపద్రవం బైనను మరి యప్ర, తిష్టయైనను సుప్రతిష్టయైన
ఘనులకు గాని జఘన్యులకును గాని, కర్మ వశంబున గలుగుచుండు

సీ॥ గర్మ ముత్కృష్ట మన్నిటి కన్న నెందు, గర్మమునఁ బ్రేరితంబయి కాల మంగ
మందు జరయును బలము శుభాశుభములు, గడిమిఁ సుఖమును దుఃఖంబుఁ గలుగజేయు
(శ్రీకృ. జ.4 ఆ)

అంతేకాదు కాలమే బంధు వర్గమును చేయునట

ఉ॥ ఎవ్వని కెవ్వడాత్మసుతుఁ డెవ్వని కెవ్వడుతండ్రి ధాత్రిలో
నెవ్వతె కెవ్వ డాత్మ విభుఁ డెవ్వనికెవ్వతె పత్ని నీ మదిన్
నెవ్వగలేల గర్మమున నిత్యము ప్రాణులు మామకాజ్ఞచే
నివ్విధిఁ బుట్టుచున్ మనుచు నేగుచు నుందు రకాల సంగతిన్ (శ్రీ కృ.జ. 5 ఆ)

ఒక కవి యొక్క బుద్ధి వికాసమును, కాలక్రమమైన మానసిక పరిణామము తెలిసికొనుటకు ఆయా కాలములలో రచించిన కవి రచనలే ప్రత్యక్ష ప్రమాణములు. పూర్వజన్మ సంసిద్ధి పొందిన ఒకే అక్షరునికి జన్మజన్మల అనుభవము బీజరూపమున నుండి పూర్వ జన్మమున జీవిత ప్రాణమైన స్థల సందర్శనము, అసంపూర్తిగ వదలిన కార్యమును పరిపూర్ణము చేయుట, ఋణానుబంధమైన కర్మల నుండి విముక్తులగుట వంటి వాటి పట్ల ప్రసు ఫుటముగ కనుపించును. అవి వేరు వేరు కాలమునకు చెందినవి.

వేరు వేరు కాలమునకు చెందిన అట్టి సత్యరూపము పగిలి దూరముగ వెదజల్లబడిన గాజుపెంకుల వలె, నిరువు గప్పిన నిప్పు కణికవలె నుండును. అట్టి సూక్ష్మమైన గాజుపెంకులను వాటి కనురూపమగు ఆకారములను బట్టి దగ్గరకు చేర్చిన వస్తువు యొక్క సత్య స్వరూపము కనబడును.

శబ్దబ్రహ్మము నుపాసించు కవి, తన ఆత్మ తపఃఫలమున తన ఆలోచనాపరంపరను శబ్దములలో నిక్షిప్తము చేయును. కనుకనే కవి శబ్దమే కవి అంతఃకరణమునకు ప్రమాణము. తను చెప్పదలచిన కథాంశమునకు ప్రయోగించు పదములలో కథాంశమే కాక తన ఇతర సంకల్పములను కూడ వెదజల్లు శబ్దమును ఎన్నుకొని కావ్యమున ప్రయోగించును. కవి జీవితాధారము శబ్దబ్రహ్మము. కనుక కవి పూర్వ పరంపరను తెలిసి కొనుటకు కవి యొక్క తీరని కోరిక ప్రయోగమైన శబ్దమే ప్రమాణము. అట్టివి అమూలములైన పదములలోనే సాధారణముగ ధ్వనించును. అట్టి ఋషి ప్రమాణ శబ్దములు పరిశీలింతము.

గోపీనాథ వేంకటకవి పూర్వకవి పరంపర

కనుక నన్నయ, తిక్కన, పోతన వేంకటకవులు రచించిన కావ్యములలో వెదజల్లిన మొదటి పద్యములు, ఇష్టదేవతా స్తుతులు, కవిస్తుతులు, స్వప్న వృత్తాంతములు వ్యంతములు. ఆశ్వాసారంభ పద్యములు, ఆశ్వాసాంత పద్యములు, ఒకే చోట క్రమముగ వ్రాసుకొని వాటినుండి ప్రసారితమగు సత్య రూపమును పరిశీలించెదము.

నన్నయ, తిక్కన, పోతన వేంకటకవుల రచనా పద్యముల పరిశీలన

నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవుల కావ్యములలోని మొదటి పద్యములివి.

శా। శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖా ఙ్గేషు యే
లోకానాం స్థితి మావహన్త్య విహతాం స్త్రీ పుంసయోగోద్భవాం
తే వేదత్రయ మూర్తయ స్త్రి పురుషా స్సంపూజితా వస్సురై
ర్భూ యాసు : పురుషోత్త మామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే (భార 1-1-1)

తిక్కన

శా। శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మండల
ప్రాసాద స్థిర భారభాజి దధతీ సా సాలభంజీ శ్రియం
శుండాలోత్తమ గండ భిత్తిషు మదవ్యాసంగ వశ్యాత్మనాం
యా ముక్తే జయతే తరాం మధులిహామానంద్ర సాంద్రాస్థిత : (ఉ. రా. 1-1)

శా। శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్ట సిద్ధికిన్ (భార 4-1-1)

పోతన

ఉ। శ్రీలలితంపు భూతియును శేషవిభూషణమున్ శిరంబుపై
వేలుపుటేఱు పాపటను వెన్నెలపావఁడు మేన గొండరా
చూలియుఁ గేల ముమ్మొనల శూలము నీలగళంబు గల్గు నా
వేలుపు శ్రీమహానగము వేలుపు మాకుఁ బ్రసన్నుడయ్యెడున్ (వీర. వి. 1-1)

శా। శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకు నై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండ కుంభకు మహానందాంగనా డింభకున్ (భాగ. 1-1-1)

వేంకటకవి

శా॥ శ్రీ మీఱన్ వనజాసనాదికులు ప్రార్థింపన్ ఖలశ్రేణి సం
గ్రామ క్షోణి జయించి సాధుజనులన్ రక్షించి భూభార ము
ద్దామ ప్రీతి హరించి ధర్మమును సంస్థాపింపఁ గృష్ణాకృతిన్
భూమానందముతో జనించిన కృపాపూర్ణుం హరిం గొల్చెదన్ (గో. రా. 1–1)

శా॥ శ్రీ వైదేహికుచాగ్ర గందరసకాశ్మీరాంకితోరస్థలుం
డైవందారు జనాళికిం దన త్రిమూర్త్యాత్మ స్వరూపత్వ లీ
లావిర్భావము దెల్పు శ్రీరఘువరుం డస్మద్ఘన స్వాంత రా
జీవం బందు వసించి మమ్ము శుభదృష్టిం బ్రోచు నెల్లప్పుడున్ (శ్రీ కృ.జ. 1–1)

శా॥ శ్రీ వైదర్భియు సత్యభామయు ముఖశ్రీ మీఱ నిర్వ్యంకలన్
సేవింపన్ స్మితమొప్ప వారినడుమన్ జెల్వొందు శ్రీకృష్ణుఁడున్
శ్రీ వెల్గోటికులాబ్ధి పూర్ణ విధునిన్ శ్రీరాజగోపాల కృ
ష్ణావిర్భావుని యాచ భూవిభుని నిత్య శ్రీయుతుం జేయుతన్ (శశు. వ. 1–1)

శా॥ శ్రీ రాధాకుచ కుంభ గంధరస కాశ్మీరాంకితోరస్థలుం
డై రాజీవభవా భవా చ్యుతులు తానై యుంట వాణీ శివా
శ్రీరామామణులం ధరించె ననగా జెల్వొందు కృష్ణుండు శో
భారమ్యుం జెలికాని వంశభవు గోపాల ప్రభుం బ్రోవుతన్ (శ్రీరా 1–1)

లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోను ఽధావతి

లోకమునందలి సాధువులు రాబోవు అర్థమును బట్టి మాట్లాడుదురు. ఆర్యులగు ఋషులాడెడు మాటలను బట్టి ముందు జరుగునవి జరుగును)

కావ్యములోని మొట్టమొదటి పద్యములు ఇష్టదేవతాస్తుతి రూపకమైన మంగళాచరణములని ప్రసిద్ధము. నన్నయ రాజరాజశ్రోతగా రచించిన భారతమునందు 'శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ' ప్రార్థనలో త్రిమూర్తులు స్త్రీపుంస యోగోద్భవమైన లోకముల స్థితి నావహింతు రని చెప్పుచు వేదత్రయమైన భారత, భాగవత, రామాయణము (భారతము పంచమవేదము భాగవతము వేదసారము రామాయణము శ్రీరాముని అవతరణముతో వేదమే రామాయణ రూపమున అవతరించినది) రచనా మూర్తులుగా ముగ్గురు కవులు ఆంధ్ర వాఙ్మయ ప్రపంచ స్థితిని ఆవహింతురని సూచన కావించెనని చెప్పుదురు.

ఋషివంటి నన్నయ వాక్కున సరస్వతి వసించి దానిని సత్యము చేయుటకు తిక్కన,

పోతన వేంకటకవులు జన్మించి భారత, భాగవత, రామాయణ రచనలను కవిబ్రహ్మ, విష్ణు, శివస్థానము లలంకరించిరా యనునట్లు ధ్వనించుచున్నది. (ఋషి వాక్కు భవిష్యద్వాణి)

నన్నయ నారాయణ శబ్ద భవమని, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సాహిత్య సురభి ప్రథమ పుటయందు తెలిపియున్నారు. అట్టి నన్నయ కవిబ్రహ్మ (ఉదయాంశలో ఉన్నకవి (సూర్యుని) గా పుట్టెనా అనునట్లు శ్రీకృష్ణ పరమాత్మ కర్ణ్యమిచ్చు సందర్భమున 'ఆదిజుడైన బ్రహ్మ ఉదయంబున కాస్పదమైనవాడు' అని అమూలకముగ ప్రయోగించెను. నన్నయ మాఘుని శిశుపాలవధ మందలి అనేక శ్లోకములను లీలామాత్రముగ తెలిగించెను. తిక్కన కూడ మాఘుని శ్లోకములు తన కావ్యములందు లీలా మాత్రముగ తెలిగించెను. పోతన కూడ మాఘుని శ్లోకములను లీలామాత్రముగ తెలిగించి తన భాగవతమున ప్రకాశింప చేసెను. వేంకటకవి శిశుపాలవధ మహాకావ్యమును తెలుగు కావ్యముగ చేసెను. నన్నయ రామాయణ రచనా కాంక్షతో కూడిన శిశుపాలవధ మహాకావ్య రచన తన పరంపరకు సంకేతమేమో అనునట్లున్నది.

తిక్కన తెలుగు పదములు, తెలుగు పద్య రచనమునందు మక్కువ ఎక్కువ కలవాడయ్యు నన్నయవలె సంస్కృత శ్లోక రచనతో ఉత్తర రామాయణ రచనను ప్రారంభము కావించెను. నన్నయ వలె దానిని శార్దూల వృత్త శ్లోకమే రచించెను. నన్నయ చంద్రవంశ రాజుశ్రోతగా రచిస్తే, తిక్కన సూర్యవంశ రాజుల చరిత్రమైన ఉత్తర రామాయణము సూర్యవంశ రాజు మనుమసిద్ధి శ్రోతగా రచించెను. రాత్రి, పగలు కలిసి దినమైనట్లు చంద్రవంశకీర్తుడు నన్నయ, సూర్యవంశరాజకీర్తుడు తిక్కన కలిసి భారతమును రచించి ఒకరు బ్రహ్మ మరొకరు కవిబ్రహ్మ స్థానము నాక్రమించినారు.

నన్నయ రాజరాజును ఉత్పలమాల, కంద పద్యములలో వర్ణించి కడపట వర్షవర్ణనమున 'సుర చాపచిత్ర గగన' మనుకంద పద్య రచన చేసి పరమపదించెను. తిక్కన 'తత్సమయా నంతరంబున' అను వచనముతో మనిషి రచనా మార్పును ధ్వనించిన ట్లనిపించును. కారణమేమనగా 'తత్సమయానంతరంబున' అను పదము నన్నయ ఆది, సభా పర్వముల యందు ప్రయోగింప లేదు. తత్సమయమను పదము నన్నయ మరణమును సూచింపుచు తిక్కన ప్రయోగించి యుండవచ్చునని అనిపించుచున్నది. మనిషి మార్పును తత్ పదమును ముందుంచి సూచించియుండవచ్చును. ఈ సందర్భమున మరణించిన రోజునకు ప్రతి సంవత్సరము ఆ రోజులలోనే చేయు క్రియను తద్దినమని చెప్పుదురు కదా. ఈ పదము నన్నయ నట్లు గుర్తుచేయుచున్నది.

భూ సతికిం దివంబునకు అని షష్ఠీ విభక్తి ప్రత్యయముతో నన్నయ రచించి నుత్పల

మాల వృత్తముననే ధ్వనించి ప్రారంభించి, కిమస్థిమాలాంలోని అస్థిమాలకు భూసతికింలోని సతికి గల సంబంధముచే ధ్వనించినాడు. షష్ఠ్యంతములు విరాట పర్వమున క్రొత్తగ ప్రవేశపెట్టినాడు.

నన్నయ కావ్యారంభమున రాజరాజును 'దేవ' అని సంబోధించిన దాని కనుగుణముగ తిక్కన విరాటపర్వమును దేవా దివ్య చిత్తంబున నవధరింపుమని రచించెను.

నన్నయ సూచించిన మొదటి వేదత్రయమూర్తి యగు బ్రహ్మ తానే నని ధ్వనించునట్లు స్ఫురదరుణాంశుపద్యమున అరుణ (ఉదయ సూర్యుడు, కవిబ్రహ్మ) శబ్ద ప్రయోగముచే ధ్వనించెను. ఈ సందర్భమున నన్నయగారి అమూలకమైన (ఆదిజుడైన బ్రహ్మ ఉదయంబున కాస్పదమైనవాఁడు' అని నన్నయ శిశుపాలవధ మందలి సభా పద్యము సూచన నొసంగు చున్నది,

నన్నయ రచించిన ఆరణ్య పర్వ ఈశ్వర దండక మూల శ్లోకములలోనిది ఒకటి.

శ్లో॥ అజేయస్త్వం త్రిభిర్లోకైః సదేవాసురమానుషైః

శివాయ విష్ణు రూపాయ విష్ణవే శివరూపిణే (వనపర్వము 39 అధ్యాయము – 76)

నన్నయ ఈశ్వరదండకమున 'కారుణ్యమూర్తీ త్రిలోకైక నాథా.. (అరణ్య 1 –324) అని ముగింపులోని కారుణ్యామూర్తి గుర్తింపే 'కరుణారసము పొంగెడు' హరిహరమూర్తి.

నన్నయ 'శ్రీ కంఠలోకేశ' అను శివదండకమున పై భావము ప్రదర్శింపకపోయినను తిక్కనగా పుట్టి 'శివాయ విష్ణు రూపాయ విష్ణవే శివరూపిణే' అను భావమును 'శ్రీయన గౌరినా బరగు' అను ఉత్పలమాల పద్యమున 'విష్ణు రూపాయ నమశ్శివాయ' అని వ్రాసి నన్నయ, తిక్కనల ఏకత్వమును సూచించెను.

నన్నయ 'హరి హర, అజ, గజానన' క్రమమున విడివిడి పద్యములతో ఆయా దేవతలను పార్థించుట, తిక్కన అరణ్య పర్వమున రచించిన అంబ ! నవాంబుజోజ్జ్వల కరాంబుజ ! పద్యమును భాగవత ప్రార్థనా పద్యములలో పోతన చేర్చుట, 'కాలుచే సమ్మెట వ్రేటులం బడక', నందాంగనాడింభకున్ అను (పోతన) పదములచే తిక్కన కాలకూట యశోదాష్టన్య పదములచే పోతనను తలపింపచేయుట నన్నయ, తిక్కన, పోతనల ఒకే అక్షరత్వమును ధ్వనించును.

తిక్కన షష్ఠ్యంతములోని కడపటి పద్యమున భాగవతమును ధ్వనించు 'భక్తలోక పరతంత్రునకున్ అను పదము వేంకటకవి రామాయణ షష్ఠ్యంతమునందలి ప్రథమ పద్యముననే వ్రాయుటచూడగా రైలు పెట్టెకు ముందరి పెట్టె కొనకును వెనుక పెట్టె ముందునకు బంధించునట్లు పోతనకు పూర్వపరలైన తిక్కన, వేంకటకవుల బందమును కలిపి నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవులు ఒకే అక్షరునిగా గోచరింపచేయుచున్నది. (పోతన, వేంకటకవుల ఒకే

అక్షరత్వము ప్రథమమునే అనేక దృష్టాంతములతో నిర్ణయింపబడి యుండుట ఇక్కడ గమనార్హము)

వేంకటకవి రామాయణములోని బ్రహ్మ ప్రార్థనమున 'త్రయీసరణిన్ ముజ్జగముల్ సృజించిన జగత్స్రష్టన్ విధిన్ గొల్చెదన్' అని త్రయీసరణి పదము వాడుటవలన నన్నయ స్త్రీ పుంసయోగోద్భవమున ఆంధ్ర ప్రపంచ వాఙ్మయమును ముగ్గురు కవు లావహింతురనినట్లు మూడు రకములైన వారి రచనా వైఖరులు పూర్తి చేయుట నిక్కడ ధ్వనించుచున్నవి.

(1) పగలు సూర్యోదయము నుండి ప్రారంభమైన కాలము చీకటి మొదలగు మార్పు పొంది తిరిగి సూర్యోదయమునకు ఒక దినమైనట్లు, ఉష్ణకాలమున ప్రారంభమైన కాలము వర్ష, శీతాది మార్పులుపొంది ఉష్ణకాలము రాగానే ఒక సంవత్సరమైనట్లు ఆదికవి నన్నయ నుండి ప్రారంభమైన కవితా బిందువు రాజరాజు శ్రోతగా బయలు దేరి తిక్కన నిర్వచనోత్తర రామాయణము మనుమసిద్ధి శ్రోతగా నరాంకితముగా నుండి భారతమున భగవదంకితముగ (హరిహర నాథాంకితము) మారి పొందిన మార్పుతో పోతన యందు హరుని కంకితముగ వీరభద్ర విజయమును హరికంకితముగ (శ్రీ రాముని కింకితము కాని షష్ఠ్యంతములు శ్రీ కృష్ణ పరము) భాగవతమును, పొందిన మార్పుతో వేంకటకవి శ్రీమద్రామాయణము శ్రీకృష్ణాంకితముగ శ్రీకృష్ణ జన్మఖండము శ్రీరామాంకితముగ చేసి, శ్రీకృష్ణునిచే శిరోవికలనము చేయబడి శ్రీకృష్ణునిలో ఐక్యము పొందిన శిశుపాలుని వృత్తాంతమును (శిశుపాలవధ మహాకావ్యము) నరాంకితముగ చేయుట నన్నయ నుండి బయలుదేరిన కవితాబిందువు భారత, భాగవత, రామాయణమైన వేద త్రయమను చుట్టును పూర్తిచేసికొని ఒక సంపూర్ణ చుట్టు పూర్తయినట్లు తలంపవచ్చును.

ఆ చుట్టు పూర్తి చేయుట శాపము పొందిన జయుడు హిరణ్యకశిప, రావణ శిశుపాలురుగ మూడు జన్మలెత్తగా వారికి మోక్షమిచ్చుటకు అవతారమెత్తిన నరసింహ, శ్రీరామ, శ్రీకృష్ణులను పోలిన ఐక్యమును గుర్తు చేయుచున్నది. ఇట్టి ఐక్యము వలన నలుగురు కవులయొక్క, ఒకే అక్షరత్వము వ్యక్తమగుచున్నది.

ఇచ్చట ఒక విషయము గోచరించుచున్నది. హరి అష్టాక్షరిలోని 'రా' అక్షరము, హరుని పంచాక్షరిలోని 'మ' అక్షరములను ఆయా మంత్రముల నుండి తీసివేసిన అపార్థమును కలిగిన వగును. అట్టి ప్రాణబీజములైన రామ అక్షరములు శక్తివంతములగుట రామనామము వాల్మీకి 'మరా' అని తపమాచరించినను, ప్రభావవంతమై వాల్మీకిని తరింపచేసి తారకమంత్రముగ ప్రసిద్ధికెక్కెను. జీవిత మాత్మతపః ఫలముగ అట్టి రామాయణమును రచింప తలపెట్టిన నన్నయ, తిక్కనగా పుట్టి హరిహరాత్మకమైన రామనామసంకేతముగ హరిహరాంకితము

చేసినట్లును, కనుకనే పోతన షష్ఠ్యంతములు కృష్ణ పరముగ రచించి సంబోధనలు రామపరముగ రచించినట్లును వేంకటకవి రామచరితము షష్ఠ్యంతములు శ్రీ కృష్ణ పరముగను సంబోధనలు కూడా శ్రీకృష్ణపరముగను రచించి ఒక చుట్టు పూర్తిచేసి ఒకే అక్షరత్వమును ధ్వనించినట్లు తెలిసికొనగలము.

(2) నన్నయగారి 'శ్రీ వాణి గిరజా'లో త్రిమూర్తులు ^ి శ్రీ మతులతో లోకమునకు శ్రేయస్సు చేయమని ఉన్నది. తిక్కనగారి 'శ్రీ యన గైరి నా బరఁగు'లోని చెల్వ లలితాదేవి అనియు, ఆ లలితా దేవి వికాసమునకు శ్రేయోదాయియై ముల్లోకాధిపతి యై లలితాదేవి భర్తగా పేరుపొందిన త్రిలోకాధిపతి పరమేశ్వరుని ప్రసన్నుడవగుమని పోతన ప్రార్థించినట్లును, వేంకటకవి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి ధర్మస్థాపనము చేయు హరిని ప్రార్థించిరి.

నన్నయ గారి త్రిమూర్తులు వారు ధరించిన శ్రీమతులలో బ్రహ్మ, సరస్వతిని తిక్కనగారు, బ్రహ్మ, విష్ణువు వారి సతీమణులను పోతనగారు, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను వేంకట కవి తీసివేసి త్రిమూర్తుల ఆత్మస్వరూపుడై శ్రీ రఘువరుని ప్రార్థించినారు. ఇందులోని క్రమవృద్ధిని గమనించిన ఒకే అక్షరత్వము గోచరింపగలదు.

తిక్కన 'శారద' అను పదమును స్ఫురదరుణాంశు పద్యమున బ్రహ్మ స్థానమున ప్రయోగించి కవిబ్రహ్మ కీర్తిని పొందెను. పద్యమున వర్ణించినదే 'అరుణాంశుని రాగ రుచి'ని అనగా ఉదయించు సూర్యుని కనుక కవిబ్రహ్మ. కనుక తిక్కనది బ్రహ్మస్థానము. పోతనది మధురామృత భక్తిరసము ధర్మ స్థాపనము విష్ణుస్థానము. వేంకటకవిది శ్రీకంధరుని లయ స్థానము. కనుకనే ప్రాచీన మమాకవుల కోవకు చెందిన వారిలో కడపటి వాడు. పద్య రచన ప్రవీణుడైన వేంకటకవి కాలమున, వచన కవిత్వమునకు బీజమై పద్య కవిత్వమునకు చరమ స్థాన మందుటయే దీనికి సాక్ష్యము.

ఇష్ట దేవతాస్తుతి పద్యముల పరిశీలన

తరలము (నన్నయ)

హరిహరాజ గజాననార్క షడాస్యమాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి చేసి దు
ర్భరతపోవిభవాదికున్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భవిభుం బ్రచేతసుపుత్రు భక్తిఁ దలంచుచున్

తిక్కన

చ॥ హరిహర పద్మగర్భులను నాదికవీంద్రుల నాత్మ నత్క వీ
శ్వరులను భక్తిఁగొల్చి తగవారి కృపం గవితావిలాస వి

ష్ఠర మహనీయుఁడైన నను ... (ఉ.రా.)

ఉ॥ శ్రీయన గౌరి నా బరగు

పోతన

శా॥ శ్రీ కైవల్యపదంబు... మహానందాంగ నాడింభకున్ 1

ఉ॥ వాలిన భక్తిమ్రొక్కెద నవారితతాండవకేళికిన్ ... 2

ఉ॥ ఆతతసేవ సెసెద సమస్త చరాచరభూతసృష్టి విజ్ఞాతకు 3

వ॥ అని నిఖల ప్రధాన దేవతా వందనంబు సేసి 4

ఉ॥ ఆదరమొప్ప మ్రొక్కిడుదు .. సమదమూషిక సాదికి సుప్రసాదికిన్ 5

ఉ॥ క్షోణితలంబు నెన్నుదురుసోక మ్రొక్కి నుతింతు సైకత శ్రోణికి 6
పుట్టంబుట్ట ... బ్రహ్మ దయాంభోనిధి 7

ఉ॥ అమ్మలగన్నయమ్మ ... దుర్గమా
యమ్మ కృపాబ్ధి యీవుత మహత్వ కవిత్వము పటుత్వసంపదల్ 8

ఉ॥ హరికిం బట్టపు దేవి ... సిరి యిచ్చు నిత్య కళ్యాణముల్ 9

వ॥ అని యిష్టదేవతలంజింతించి దినకరకుమార, ప్రముఖులం దలంచి ప్రథమ కవితా రచనా విద్యా
విలాసాతిరేకి వాల్మీకి నుతియించి 10

వేంకటకవి

శా॥ శ్రీమీఱన్ వనజాసనాదికులు ప్రార్థింపన్ ఖలశ్రేణి సం
గ్రామక్షోణి జయించి సాధుజనులన్ రక్షించి భూభార ము
ద్దామ ప్రీతి హరించి ధర్మమును సంస్థాపింపఁ గృష్ణాకృతిన్
భూమానందముతో జనించిన కృపాపూర్ణున్ హరిం గొల్చెదన్ 1

చ॥ కలశ పయోధిపుత్రి యలకాంచన గర్భునిఁ గన్నతల్లి క
ల్వలదొర తోడఁబుట్టు హరివల్లభ లేములఁ బాపులేమ సాం
పలరఁగఁ బద్మషండముల యందు వసించెడు తన్వి లచ్చి నా
కెలమి సమస్తసంపదల నిచ్చి కృతార్థునిఁ జేయుఁ గావుతన్ 2

సీ॥ కరటి చర్మము దాను గట్టి భక్తులకు సు, వర్ణచేలంబు లెవ్వాఁడొసంగె
ఫణిహారములు దాను బైఁదాల్చి యెవ్వాఁడు, మణిహారములు దాసగణమున కిడెఁ
గాలకూటముఁ దాను గబళించి సేవక, తతుల కెవ్వాఁ డమృతం బొసంగెఁ
దాను గపాలంబు ధరియించి యెవ్వాఁడు, మితిలేని భాగ్య మాశ్రితుల కిచ్చె 3

తే॥ నట్టి పరమదయాశాలి నబ్జమౌళిఁ, నఖిలలోకేశు భూతేశు నభ్రకేశుఁ
ప్రమద గణనాథు వినత సుపర్వ నాథుఁ, బార్వతీనాథు మదిలోనఁ బ్రస్తుతింతు 4

మ॥ పతి సామేన వసించి భారతియు లోపాముద్రయున్ లక్ష్మియున్
సతతంబున్ భజియింప భూరి కరుణా చంచత్కటాక్షంబులన్
బతికన్నన్ నతకోటి కెక్కుడుగ సంపద్భోగ సౌభాగ్యముల్
చతురత్వంబున నిచ్చు గౌరి నను వాత్సల్యంబునన్ బ్రోవుతన్ 5

మ॥ హరినాభీకమలంబునం బొడమి భాషాబ్జేక్షణం పత్నిఁ గాఁ
గర మర్థింగొని తత్సమేతముగ వేడ్కన్ బద్మపీఠస్థుఁడై
పరమప్రీతి సనందనాదులు భజింపన్ నేర్పు మీఱన్ ద్రయీ
సరణిన్ ముజ్జగముల్ సృజించిన జగత్స్రష్టన్ విధిన్ గొల్చెదన్ 6

శా॥ వీణా పుస్తకపాణి షట్పద లసద్వేణిన్ బృహత్స్రైకత
శ్రోణిన్ బద్మజురాణి సర్వసుగుణ క్షోణిన్ బురాణిన్ నతేం
ద్రాణిన్ నేత్ర జితైణిఁ బాదగత గీర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత
శ్రేణిన్ వాణి నభీష్టసిద్ధికి మదిన్ సేవింతు నశ్రాంతమున్ 7

పంచచామరము ॥ అజాది దేవబృంద మే మహాత్ము భక్తి నాత్మలో
నజస్రమున్ భజించి వాంఛితార్థసిద్ధిఁ గాంచు నా
గజాస్య సర్వదేవతాగ్రగణ్యుఁ గార్తికేయ పూ
ర్వజున్ గణాధిపుం ద్రిలోక వందితున్ భజించెదన్ 8

చ॥ సరసిజ గర్భ నిర్మిత లసచ్ఛతకోటి విశాల రాఘవే
శ్వర చరితంబు లోకహిత సంగతి నిర్వదినాల్గు వేలుగా
వరుస రచించినట్టి మునివల్లభు నాదికవీంద్రు యోగవి
స్ఫురితు విరించనాంశభవుఁ బుణ్యుప్రచేతసుపుత్రుగొల్చెదన్ 9

చ॥ తొలుత జగద్ధితంబుగ శ్రుతుల్ విభజించి తదర్థయుక్తిచే
నెలమిఁ బురాణముల్ పదియు నెన్మిదియున్ రచియించి సన్మతిన్
బలువుగ భారతం బనెడు పంచమవేదముఁ జేసినట్టి ని
ర్మలునిఁ ద్రివిక్రమాంశజుఁ బరాశరపుత్రుని సన్నుతించెదన్ 10

సీ॥ వేడ్కతో నెద్దాని వినినఁ బఠించినఁ, గర మర్థి భోగ మోక్షము లొసంగు
నరుదార నెద్ది గాయత్ర్యాఖ్య మగుపర, బ్రహ్మ నివాసమై పరఁగు చుండు
రత్నాఢ్యమగు సముద్రము భంగి సత్కథా, విస్తీర్ణమై యెద్ది వినుతి కెక్కు
నొక్క పాదంబైన నొక్క పదంబైన, నెద్దానిఁ బఠియింప నిచ్చుఁబరము

తే॥ శ్రుతి మనోహర మెద్ది విశ్రుత పురాణ, ముని రచితమెద్ది సత్కావ్య ముఖ్య మెద్ది
యట్టి బుధసేవ్యమైన రామాయణమున, కాది కావ్యంబునకు నతు లర్థిఁజేతు 11

ఒక వ్యక్తి గాని, ఒక సంస్థ కాని కొన్ని గుర్తులు, పద్ధతులతో తన ఉనికిని స్ఫురింప చేయును. అట్లే నన్నయ 'హరిహరాజ' పద్యమును ప్రత్యేకమైన తరళ వృత్తమున వ్రాసి తొమ్మిది దేవతారూపులను స్తుతించెను. దాని రహస్యమును తెలిసిన అక్షరుడు కనుక తిక్కన కుటుంబ పెద్దలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను మాత్రము ఉత్తర రామాయణమున స్మరించి భారత ఆరణ్యపర్వమున బ్రహ్మ సరస్వతులను, విరాట పర్వమున హరిహర శ్రీ గౌరుల తత్త్వమును స్తుతించినాడు. హరిహర తత్త్వస్తుతితో శారద రాత్రులు, స్ఫురదరుణాంశులగుచంద్ర సూర్యులను, భూసతికిం దివంబునకు అన్న శారద, బ్రహ్మ స్తుతుల వెంటనే పేర్కొనినాడు.

నన్నయ చెప్పిన విధముననే పోతన ప్రతి దేవతా స్వరూపున కొక పద్యమున స్తుతించినాడు. కాని గజాననుని తర్వాత స్తుతించవలసిన అర్కషడాస్యులను దినకర కుమారులను పేర ప్రార్థనా పద్యములతర్వాతి వచనము నందు పేర్కొనిరి. కారణమేమనగా ఆ అక్షరునిచే పూర్తి చేయవలసిన భారతము నన్నయ, తిక్కన రూపములలో పూర్తిచేసినందున అట్లు వచనమునకు మార్చుటచే భారత, రామాయణములు రచింప తలపెట్టిన 'హరిహరాజ' లోని సందిగ్ధ భావములు తొలగిపోయినవి. నన్నయ పద్యమున విరసమైన క్రమమును పోతన సరిచేసి ఆది, అంత్యములందు హరి, లక్ష్ములను పెట్టి కేంద్రము వైపు సరితూగ దంపతులను పెట్టెను.

వేంకటకవి నన్నయ, తిక్కనల భావముననే దంపతులుగ ఒకరి వెంట ఒకరినిచేర్చి దంపతుల అవగాహనాసామ్యములతో స్తుతించిరి. కోరికలను శ్రీ గిరిజావాణుల పద్యములందు మాత్రమే పేర్కొనిరి. గజాననుని పద్యము నందే షడాస్యుని 'కార్తికేయ పూర్వజున్' అని స్తుతించి సోదరుల సహజీవనమైన రామాయణ రచనము ధ్వనించెను.

నన్నయ 'అర్క' శబ్దముచే సూర్యవంశ చరిత్రమైన రామాయణమును స్ఫురింపచేసెనా అనునట్లు వేంకటకవి యిష్టదేవతాస్తుతిలో వాల్మీకి, వ్యాసుల తర్వాత రామాయణమును స్తుతించిరి. నన్నయ 'హరిహరాజ' పద్యములోనే వాల్మీకిని చేర్చినందున వాల్మీకిని కొల్చెదన్ అను ప్రార్థన పూర్వకముగను, వ్యాసుని వేరొక పద్యమున కొలిచినందున సన్నుతించెదన్ అని ధ్వనించెను.

వేంకటకవి, పోతనల లక్ష్మి, సరస్వతీ, బ్రహ్మల పోలికలను కూడ, వేంకటకవి పోతనల ఒకే అక్షరత్వమును సూచించుచున్నదని మనము ముందు చూచితిమి.

ఇట్లు నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవి రచించుటకు వారొకే అక్షరుడై ఉండి ఉండవచ్చునని తలంపదగి యున్నది.

కవిస్తుతి పద్యముల పరిశీలన

నన్నయ 'దుర్భరతపోవిభవాధికున్ గురుపద్యవిద్యకు నాద్యు నంబురుహగర్భ సముం బ్రచేతసుపుత్రు భక్తి దలంచుచున్' అని వాల్మీకి మహర్షిని దేవతా ప్రార్థనమైన పద్యముననే చేర్చి వ్యాసమహర్షిని ప్రత్యేక పద్యమున నుతించిరి. నన్నయ మరే సంస్కృత కవిని కాని, తెలుగు కవిని కాని స్తుతించలేదు.

తిక్కన వాల్మీకి, వ్యాస మహర్షులను స్తుతించి తెలుగు కవులలో నన్నయ నొకరినే స్తుతించెను.

పోతన కవిస్తుతిలో వాల్మీకి వ్యాసులే కాక పెక్కు సంస్కృత కవులను స్తుతించి తెలుగు కవులలో నన్నయ, తిక్కనలను మాత్రమే స్తుతించెను.

వేంకటకవి రామాయణ కవిస్తుతిలో నన్నయ, తిక్కన, భాస్కర, పోతనలను స్తుతించెను. వేంకటకవికి పూర్వము భాస్కరుడు రామాయణము రచించినందున సముచిత గౌరవము భాస్కరుని కిచ్చినట్లు తలంపవచ్చును.

పై విషయములే కాక భారత, భాగవత రామాయణములను కూలంకషముగ పరిశీలించిన 'త్రయీ సరణిన్ ముజ్జగముల్ సృజించిన జగత్స్రష్టన్ విధిన్ కొల్చెదనన్న బ్రహ్మదేవుని ప్రార్థనములోని విధి నన్నయ అక్షరుడు తలంచినట్లు భారత భాగవత రామాయణములు మూడు విధముల విస్తరింప చేసినట్లు తలంపవచ్చును.

స్వప్న వృత్తాంతముల పరిశీలన

తెలుగు సాహిత్యమున మొట్టమొదటి స్వప్న వృత్తాంతము తిక్కనదే. అది తిక్కన మొదటి కావ్యమైన ఉత్తర రామాయణమున లేదు. నన్నయ భారతమును కొనసాగింప తలపెట్టినపుడు ఈ స్వప్నము వచ్చినది.

నన్నయ శైలి వేరు. తిక్కన శైలి వేరు. నన్నయకు లలిత సంస్కృత సమాసఘటన ఇష్టము. తిక్కనకు పెద్ద సమాస ఘటన కాక అలతి అలతి పదము లుపయోగించుట ఇష్టము. తెలుగు పదప్రయోగము రసభావ నాటకీయతతో ప్రదర్శించుట తిక్కన కిష్టము.

తిక్కనకు పుట్టి, జ్ఞానము వచ్చినప్పటి నుండి, భారత రచనాసక్తి ఉండును. అందును

నన్నయ విడిచి వెళ్ళిన చోటునుండి కొనసాగింపు చేయతలంచుచుండి యుండును. దానికి కారణము.

తే.గీ॥ ఏ యే భావము దలపుచు, బాయక యంతమున మేను బాయు మనుష్యుం
డాయాభావము నొందును, ద్రోయక తద్భావ భావితుండయి విజయా

తే. గీ॥ ఇట్లు జన్మించి పూర్వ దైహిక విశేష, బుద్ధి సంయోగమును బొంది పురుషవరుఁడు
చెలఁగి తన పూర్వయోగ సంసిద్ధి కొఱకు, యత్న మొనరించు నదిక ప్రయత్నమలర

అను భగవద్గీయందలి (భ.గ. – 201, 177) శ్రీ కృష్ణుని వచనమునందు గల ఆత్మవిశ్వాసము.

భారత రచనను గురించి ఆలోచించుచుండగా ఆరణ్య పర్వశేషమును హరునిగ పోల్చవచ్చునను పోలిక తట్టి యుండును. దానిని ఉద్యోగ పర్వమున తెలిపి ధ్వనించినాడు.

భోగలాలసులైన రాజులకు వేటాడుట యందు వేడుక కాని అరణ్యమునందే 12 సంవత్సరములు నివాసము చేయుట విప్రాయముగ నుండును. శక్త్యాత్ములైన పాండవులను దుర్యోధనుడు కపట ద్యూతమున రాజ్యపదభ్రంశముచేసి ఆరణ్య వాసనమునకు పరిభవము చేసి పంపినను తత్సమయ సంక్షుభితులు కాక ధర్మగతి వారు వనంబున విషాదవేదనాశ్రమము పడిరని తిక్కన ఉద్యోగ పర్వమున తెలిపియున్నాడు. ఈ విషము (ద్రౌపది వస్త్రాపహరణము) వంటి అవమానములను దిగమ్రింగుకొని ఆరణ్యవాసము సలిపిన పాండవుల సంకేతమే అరణ్య పర్వమును విషమును కంఠమున నిలిపిన హరునితో పోల్చుట. ధర్మముగ అజ్ఞాత వాసము గడుపుట తదుపరి ధర్మ పోరాటమునకు సంకేతము ధర్మ స్థాపనమున కవతరించు హరి. భారతమున ఆరణ్యవాసము కాగనే అజ్ఞాత వాసమును వర్ణించు విరాటాది కథతో స్వర్గారోహణము వరకు పాండవుల కథ కొనసాగును. కనుక అది హరహరిచిహ్నముగ హరిహరనాథునికి సమన్వయించుకొనవచ్చునని తట్టియుండును.

వెంటనే నెల్లూరికి సమీపమున పెన్నానది తీరమున గల జన్నవాడ క్షేత్రము దర్శించి యుండును. అచ్చట మహాశక్తి సంపన్నురాలగు కామాక్షిదేవి విగ్రహము కలదు. మల్లికార్జున స్వామి వారి విగ్రహము కూడ అక్కడ కలదు. ఆ క్షేత్రమును ఆదిశంకరులు దర్శించిరని ప్రతీతి. ఆ పెన్నానది అవతలి తీరమున ఒక కొండ, కొండపై వేదగిరిలో లక్ష్మీ నరసింహస్వామి శాంత విగ్రహము కలదు.

ఆ కొండపై సప్త ఋషులు యాగము చేసి చతుర్వేదము లభ్యసించిరనియు, సప్త తీర్థములు దాని సమీపమున ఉన్నవనియు ప్రసిద్ధి. అక్కడ అశ్వత్థామ ఉండినట్లును, అశ్వత్థామ గుహ అనుపేరున అక్కడ ఉన్న గుహ సాక్ష్యమని అచ్చటి స్థలపురాణము చెప్పును.

జన్నవాడ కామాక్షిదేవి అనుగ్రహము పొందిన తిక్కన వేదగిరి శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారిని దర్శించి యుండును. అప్పుడు స్వామి వారి ప్రహ్లాద చరిత్ర స్మృతికి వచ్చి యుండవచ్చును.

హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని విష్ణువెక్కడనుండునని ప్రశ్నించినపుడు సర్వాంతర్యామి ఐన హరి "ఇందు గల డందులేడని సందేహము వలదని" చెప్పగా హిరణ్యకశిపుడు స్తంభమును తన ముష్టితో కొట్టుటయు వెంటనే నరసింహస్వామి అందవతరించి హిరణ్యకశిపుని హరించుటయు (హరము వేయు నరసింహరూపము) ప్రక్కనే ఉన్న ప్రహ్లాదుడు 'విష్ణు రూపాయ నమశ్శివాయ' అని బ్రహ్మ తత్త్వమును ప్రదర్శించిన రూపు మనస్సున రూపు కట్టి యుండును. దానిని

ఉ. శ్రీయన గౌరి నాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చిఁ విష్ణు రూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్త జనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్

పై పద్యమున హరి వద్ద నిలిపి హరంబగురూపము దాల్చి అని అన్వయించుకొనిన, జయుని మొదటి రూపమైన హిరణ్యకశిపుని చంపుటకు ఎత్తిన మొదటి హరిరూపమే నరహరి అని, రౌద్ర రూపము పై సన్నివేశము వలె, ఉన్నట్లుండి దక్షయజ్ఞమున కూడ ఉండుట స్ఫురించి పై పద్యమును రచించియుండును. కనుకనే సతి ప్రతిరూపమైన గౌరి, పల్లవింప భద్రాయిత మూర్తి పదములు దొరలియుండును.

భారతమును నన్నయవలె రచింపవలెనా లేక స్వభావ సిద్ధమైన రచనముగ రచింపవలెనా అను సంశయమును పై నర, సింహ రూపములు కలిసిన నరసింహస్వామి వలె రెండును కలిపి రచించుస్ఫురణ కలిగి హరి, హరరూపములు కలిపి 'కిమస్థిమాలం' శ్లోకమును రచించియుండును.

మరికొంత కాలమునకు యించుక సేపు నిద్రించుచుండగా రామాయణమున సీతాదేవి అగ్ని ప్రవేశము. అప్పుడు దశరధుడు దేవరూపముతో మహేశ్వరుని వెంట వచ్చుట, మహేశ్వరుడు దశరధుని శ్రీరామునికి పరిచయము చేయుట స్ఫురించియుండును.

కావ్యమనగా చరిత్ర కాదు జరిగిన సంఘటనలకు కాని, భావనా పరమైన కల్పిత వస్తువునకు కాని, రమణీయ రూపు కల్పించుట. కనుక పై ఆత్మవృత్తాంతమును, జీవితబంధముల నేర్పరచు పరమాత్మ, నన్నయ అక్షర బీజమును, కేసన తండ్రి ద్వారా తనకు సంక్రమింప చేసెనను భావనను, స్వప్న వృత్తాంతము ద్వారా ప్రదర్శించియుండును.

దీనికి వేంకటకవి రచించిన 'సింహపురంబునుండి నృసింహ దేవ కళ్యాణోత్సవ సమా

లోకన కుతూహలాతి రేకంబున వేదశైలంబునకుం జని యందొక్క మహాయోగి వలన నొక్క విద్య వడసి తత్ప్రసాద లబ్ధ కవిత్వ విద్యావిశేషుండనై' అను రామాయణములోని వచనము వేదగిరి లక్ష్మీనరసింహ స్వామి క్షేత్రము తిక్కన అక్షరుని యిష్టమైన ప్రదేశమా అని జన్మాంతర వాసనచే తిక్కన, వేంకటకవి ఒకే అక్షరుడని తలంచినచో స్ఫురింప చేయుచున్నది.

అంతేకాక శ్రీ కృష్ణ జన్మ ఖండము నందలి ఆంధ్ర కవిత్వవిద్య మొదల వివిధ విచిత్ర శబ్దార్థ గుణాలంకార రసబహుళ ప్రవాహ రూపంబుగా నన్నపాఖ్య మహాకవి వదన వినిర్గతంబై ప్రబంధ పరమేశ్వరుని కుక్షి ప్రదేశంబున విశ్రమించి, యచ్చట నుండి తిక్కన యజ్వయందుఁ బ్రవేశించి, యచ్చటనుండి బహుప్రకారంబుల బహుకవి ముఖంబులందుఁ బ్రవర్తిల్లె' అను వచనమున ప్రబంధపరమేశ్వరుడు అనిన జీవిత బంధముల నేర్పరచు పరమాత్మ అని స్వప్న వృత్తాంతముగా తిక్కన రచించినది దేహాంతర ప్రాప్తి పొందినప్పటి వృత్తాంతమును తెలియ చేయునను అర్థమును వ్యక్తము చేయుచున్నదని ధ్వనించుచున్నది.

పై వేంకటకవి వచనమునందు వినిర్గతంబై, విశ్రమించి, ప్రవేశించి క్రియాపదములలో వినిర్గత, ప్రవేశములమధ్య విశ్రమించుట దేహాంతర ప్రాప్తిని సూచించును. చూడుడు శ్రీ మద్భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగములోని

ఏ తనువు నీశ్వరుడు పొందు నేతనువు
వదలు నట్టి శరీరంబువలన వీని
నరవి గైకొని యేగు నాశయము వలన
ననిలుఁ డటు గంధములు గొని చనినపగిది (భ.గీ. – 357)

కనుక ఇది నన్నయనే తిక్కనగ పుట్టినట్లుగా సూచించుచున్నది.

ప్రబంధ పరమేశ్వరుడ నని ఎఱ్ఱన తనను గూర్చి తెలుపుకొనినాడు. ఇచ్చట ప్రబంధ పరమేశ్వరు డెఱ్ఱన అని అన్వయించిన ఎఱ్ఱన కుక్షి ప్రదేశంబున విశ్రమించి అనినపుడు విశ్రమించి క్రియ ఎఱ్ఱన భారత కథారచనను సూచింపదు. భారత ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములందు కథ ఉండదు అనగా భారత కథ ఆ భాగములలో విశ్రమించును. కనుక ఆ భాగరచనను సూచించును. కుక్షి అనిన మధ్య అను అర్థమును గ్రహించినచో, ఆరణ్యపర్వమధ్యమందు నన్నయ మరణమును, తద్వారా కొంతకాలము రచన లేకుండుటను సూచించును. ఈశ్వరుడు కృతిభర్త. కావున ప్రబంధపరమేశ్వరుడనిన రాజరాజ, హరిహరనాథుల బంధము మధ్యలో చతుర్థాశ్వాస మధ్యలో ఉన్నట్లును, అక్కడ కొంతకాలము విశ్రమించినట్లును తెలుపును.

తిక్కన 'ప్రబంధమండలి కధినాధునిగా ఎవ్వరి నెంచుకొనవలె నని చెప్పుట వలన భారతమును ప్రబంధమండలి అని చెప్పెను. అనగా ప్రతిపర్వము అనేక ఆశ్వాసములు కలిగినందున ప్రబంధము అని చెప్పెను. కధను చెప్పుచు గుక్క విరామ మిచ్చు కధా భాగాంతము వరకు ఒక ఆశ్వాసము. అట్టి వాటిని శ్రోతచే బంధించునది ప్రబంధము.

అదినాధుడే పరమేశ్వరుడు కనుక ప్రబంధ పరమేశ్వరుడు హరిహరనాధుడు. కనుక హరిహరనాధుని కుక్షి ప్రదేశంబున విశ్రమించి అనిన ఆరణ్య పర్వ చతుర్ధాశ్వాస మధ్య నుండి హరిహరనాధుని విరాటపర్వసంబోధనలలో ఉండి ఆరణ్య పర్వ ఆశ్వాసారంభ, ఆశ్వా సాంతములు తిక్కన వ్రాయక వదలి నట్లు ధ్వనించుచున్నది. ఇది నన్నయ మరణ సూచనగా తలంపవచ్చును.

ఆత్మ నాశము లేనిచి. బాల్య యౌవన, వృద్ధాప్యమైన దేహము నుండి అంతిమశ్వాస వాయురూపమున అక్షరునిజీవము తీసికొని పైకెగసి దేహాంతరప్రాప్తియోగమున కర్మాను రూపేణా ఫలించి కొంతకాలమునకు మళ్లీ మరో దేహము తాల్చునని భగవద్గీత తెలుపుతుంది.

కనుక తిక్కన స్వప్న వృత్తాంతము యోగనిద్రలో జీవాత్మ, పరమాత్మల అంతర్వాణి ప్రబోధముగ కావ్యరూపమును యిచ్చినట్లు గ్రహింపవచ్చును. దీని నుండి సాధించిన ఫలము 'నన్నయ కారణ శరీరము, కేసన రూపముద్వారా తిక్కనకు సంక్రమింపచేసి, తిక్కనను పుట్టించె ననిచెప్పుటగా భావింపవచ్చును.

పోతన శ్రీ మన్నారాయణ కధ రచియింప నిశ్చయించి చంద్రగ్రహణము రోజు గంగకుం జని క్రుంకులిడి తీరపుటిసుక తిన్నెపై మహేశ్వర ధ్యానము చేయుచు కన్నులు తెరచితెరవకముందు శ్రీ రామచంద్రుడు కనబడి భాగవతమును తన కంకితమివ్వమని భవబంధములు తెగునని చెప్పి మాయమయ్యెను.

వేంకటకవి పురాణ కధితమైన మహాకావ్యమును రచింపతలచి, అది ఏది, ఎవరి కంకితమివ్వవలెనని ఆలోచించుచుండెను. అప్పుడు కలలో శ్రీ కృష్ణ పరమాత్మ ప్రత్యక్షమై "నీ కిష్టమైన నా అవతారకథలలో దేనినైనా వ్రాయి. పూర్తిచేయు నట్టి భారము నేను వహించెదను. నీకు ఈ జన్మ తప్ప మరుజన్మలేదు' అని చెప్పి శ్రీ కృష్ణుడు మాయమయ్యెను.
తిక్కన, పోతన, వేంకటకవులకు వారికి కనబడిన భగవంతుడు చెప్పిన వాక్యములను మాత్రము వరుసగ వ్రాసుకొని వాటిలో అంతర్లీనమైన సత్యమును పరిశీలింప యత్నించెదము.

ఉ॥ వైదిక మార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్
భేదము లేని భక్తి మది నిర్మల వృత్తిఁగ జేయుచుండ మ

త్పాద నిరంతర స్మరణ తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్య రసముం గొనియాడుచునుండు దెప్పుడున్ అందును

కె॥ పారాశర్యుని కృతియయి, భారతమను పేరఁబరగు పంచమవేదం
బారాధ్యము జనులకు ద, ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్

తె॥ తెనుఁగు బాస వినిర్మింప దివురు టరయ; భవ్య పురుషార్థ తరు పక్వ ఫలము గాదె
దీనకెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ

తె॥ జనన మరణాదులైన సంసారదురిత, ములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువు
గను వెలుంగు నిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెదనిండ నెలవుకొనఁగ
మేలుకాంచి నాడు.

పోతన

వ॥ ఏనా రాజశేఖరునిం దేఱఁజూచి భాషింప యత్నంబు సేయునెడ నతండు దా రామభద్రుండ మన్నామాంకితముగా శ్రీ మహాభాగవతంబుఁదెనుంగు సేయుము నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుం డయ్యె

వేంకటకవి

వ॥ వత్సా నీవు పవిత్రంబులైన మదీయ దివ్యావతార చరిత్రంబులలో నీకభీష్టమెయ్యది దాని మదంకితంబుగా నాంధ్రభాష వచింపు మక్కావ్యంబు నిర్విఘ్నంబుగా బరిసమాప్తి నొందించు నట్టి భారం బేను బూనెద. నీకును నీవు రచించిన కావ్యంబునకు నభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లుగా ననుగ్రహించెద, నీకీ జన్మంబు దక్క నొండు జన్మంబు లే దీ జన్మాంతంబున బునరావృత్తి రహితంబైన పరమ పదంబుఁ బ్రాపించెదవు"

పై భగవద్వాక్యములనుండి మనము ఈ క్రింది క్రమవృద్ధిని గమనింపగలము.

(1) భగవద్వాక్కులో తిక్కనకు 'సంసార దురితములకు నగపడకుండంగఁ దొలగు తెరవు గను వెలుంగు నిచ్చితి' ననెను. పోతనకు 'భవబంధంబులు తెగు' నని వేంకటకవికి నీకీ జన్మంబు దక్క నొండు జన్మంబు లే దీ జన్మాంతంబునఁ బునరావృత్తి రహితంబైన పరమపదంబు బ్రాపించెదవు' అని పలికెను.

అనగా నీకు మోక్షమునకు మార్గమును కనుగొను మార్గమును, తెలిసికొను శక్తి నిచ్చితి నని తిక్కనకు చెప్పి, పోతనకు మోక్షమిచ్చితి ననెనే కానీ, ఈ జన్మాంతముననే అని తెలుప లేదు. కాని వేంకటకవికి ఈ జన్మాంతమునందే అని చెప్పుటచేతను అనేక సహస్రజన్మార్జిత పుణ్యఫలమున పుట్టిన తిక్కన, పోతనలకు ఒకటి రెండు జన్మములు వచ్చుట ముఖ్యము కాదనియు వారు తలపెట్టిన రామాయణ రచన పూర్తి అగుట ముఖ్యమనియు తలంపనగును.

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

(2) తిక్కన, పోతన, వేంకటకవులకు కనబడిన దేవతారూపులు హరిహరనాద, శ్రీరామ, శ్రీకృష్ణులు. వీటిని హిరణ్యకశిప, రావణ శిశుపాలురుగా పుట్టిన వైకుంఠద్వార పాలకు డైన జయునికి మోక్షమిచ్చుట కవతరించిన నరసింహ, శ్రీరామ, శ్రీ కృష్ణమూర్తులతో పోల్చి చూడగా నరసింహస్వామి రూపము హరిహరనాధునకు సరిపోలుచున్నది. ఇది మనము భావించిన వేదగిరి లక్ష్మీ నరసింహ రూపమునకు సరియగుచున్నది.

ఎఱ్ఱన రచించిన నృసింహ పురాణము అహోబిల నరసింహ స్వామి కంకితము. తిక్కన రచించిన ఆరణ్యపర్వ శేష కదా భాగముల సరికూర్చు ఆశ్వాసారంభ ఆశ్వాసాంతములను రాజ రాజ ప్రసక్తిగా చేర్చిన ఎఱ్ఱన, తిక్కన రచించునట్లు రామాయణము, భారత పరాంశమైన హరి వంశము, హరిహరనాదుని అనురూపమైన నృసింహ పురాణము రచించి తిక్కనపై తనకు గల అచంచల భక్తిని ప్రదర్శించెను. 'తను కావించిన సృష్టి తక్కొరుల చేత' కాదని తిక్కనను స్తుతించెను. తిక్కనకు సమీపకాలము వాడైన ఎఱ్ఱన, నృసింహపురాణ రచన వలన హరిహరనాధుడు నరసింహస్వామి అనియు, వేంకటకవి ఒకే అక్షరుడై నందుననే వేంకటకవి ఆత్మ వేదగిరి నరసింహస్వామి క్షేత్రమునకు లాక్కొని వెళ్ళినదనియు తలంపవచ్చును.

షష్ఠ్యంత పద్యముల పరిశీలన

షష్ఠ్యంతములు పురాతన కాలము నుండియు శిలాశాసనములందు రాజుల కీర్తి ప్రతిష్ఠలు రాబోవు తరముల వారికి తెలియుటకు చరిత్ర ప్రాముఖ్యముగా రచించిన రచన. తిక్కన వలన ఈ షష్ఠ్యంత రచన కావ్య సంప్రదాయమునకు విస్తరించినది.

నన్నయ భారతము నందును, పాల్కురి సోమనాధుని రచనలయందును షష్ఠ్యంతములు లేవు. తిక్కన ప్రధమ కావ్యమైన నిర్వచనోత్తర రామాయణమున కూడ లేదు.

నన్నచోడుని కుమారసంభవము నందును, తిక్కన రచించిన భారతములలో కానవచ్చుచున్నది. స్వప్న వృత్తాంతము, షష్ఠ్యంతములు రెండింటిని తిక్కననే ప్రప్రధమముగ ప్రవేశపెట్టినట్లు జనశ్రుతి ఆధారముగ పలువురు గ్రంధస్థము చేసియున్నారు.

తిక్కన భారతమును ఆరణ్యపర్వ మధ్య నుండి ప్రారంభింపవలసిన అవసరమేర్పడినది. కాని అచ్చట తన స్వగతము చెప్పుకొనుట రసభంగము. దానిని విరాట పర్వముననే చెప్పుకొనవలెను. ఆరణ్య పర్వ మధ్యమునను, విరాట పర్వ ప్రారంభమునను ఒకే విభక్తి ప్రారంభించిన ఆరణ్య పర్వ రచనను వేరొకరు రచించినట్లు భావి కవులు తలంపవచ్చును. కనుక రెండు చోట్లను రెండు విధములుగ ప్రారంభింపవలెను. దీనికి పరిష్కారముగ ఆరణ్య పర్వ మధ్య తన భారత ప్రారంభ సంకేతము షష్ఠీ విభక్తితో ప్రారంభించి, విరాట పర్వ

ప్రారంభమున శిలాశాసనములందు వలె షష్ఠీ విభక్తి సూచించు షష్ఠ్యంతములతో ప్రారంభింపవచ్చును అని తలంచి యుండవచ్చును.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమున షష్ఠ్యంత రచన రచింపక, భారతమున తగిన కారణముతో రచించుట చేత తిక్కననే షష్ఠ్యంత రచన ప్రవేశపెట్టినట్లును, నన్నెచోడుడు తిక్కన సమకాలికుడు కాని, తరువాత కాలము వాడుకాని అయివుండవచ్చునని తోచుచున్నది. ఈ సందర్భమున వేదము వెంకట రాయశాస్త్రి గారి నన్నచోడుడు తిక్కన తర్వాతి వాడనుట స్మరణీయము.

ఈ సందర్భమున దోషములతో నిలిచి పోయిన యింటిని శాంతి మంత్రముల ద్వారా పునః ప్రతిష్ట చేయుట ఎట్టిదో, అసంపూర్తిగా నిలిచిన నన్నయ భారతమును షష్ఠ్యంతములతో రచించుట అట్టిదని షష్ఠి అనగా 16 నామములు కలిగిన పార్వతీదేవి నామములలో షూడవదియైన దుర్గాదేవి అను అర్థము వలన స్ఫురించుచున్నది. దుర్గ దుర్గతి నాశిని' అని వేంకటకవి శ్రీ కృష్ణ జన్మఖండ ఉషా కన్యావృత్తాంతమున తెలిపియున్నాడు.

షష్ఠ్యంత, అస్థిమాల, భూసతి వంటి ప్రయోగముల ద్వారా కూడ ఆరణ్య పర్వశేషము తిక్కన రచనగా ధ్వనించుచున్నది. అంతేకాక 'శ్రీ యన, గౌరినాబరగు' పద్యములోని 'గౌరి పదమునకు భాస్కరరాయ వ్యాఖ్యాయనమైన శ్రీ లలితా సహస్ర నామములలో 'సతి యోగాగ్నిచే తగులఁ బెట్టబడి మఱల హిమవంతునకుఁ బుట్టెను. ఆమె శంఖము, కడిమ, చంద్రుని గలది గాన గౌరి అని పిలువఁబడెను. పద్మ పురాణమును బట్టి కాన్యకుబ్జ పీఠము నధిష్ఠించిన దేవి గౌరి యగునని. కాన్యకుబ్జ మందు గౌరి, అని దేవీ పురాణమునందు ఉన్నట్లు, వ్రాయబడి యున్నది. ఇది కూడ పై తిక్కన రచనకు బలమిచ్చునదిగా ఉన్నది.

శక్తి సంపన్నురాలైన దుర్గాదేవి ప్రభావముచే శిలాశాసనము నందలి అక్షరములు కీర్తి గాంచునను ప్రమాణమే కావ్య ప్రచారమునకు షష్ఠ్యంతములుగ నిలిచినవని భావింపదగి యున్నది.

నన్నయ ఆది పర్వ ప్రారంభమున రాజరాజ నరేంద్రుని ఈ క్రింది పద్యములలో వర్ణించినాడు.

ఉ। రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజ తే
జో జయశాలి శౌర్యుడు విశుద్ధ యశశ్శరదిందూ చంద్రికా
రాజిత సర్వలోకుఁ డప రాజిత భూరి భుజాకృపాణ ధా
రాజల శాంత శాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుడున్నతిన్ (భా –1–1–3)

క॥ విమలాదిత్య తనూజుఁడు, విమల విచారుఁడు గుమార విద్యాధరుఁడు
త్తమ చాలుక్యుఁడు వివిధా, గమ విజిత శ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్ (భా–1–1–4)

ఇవి ప్రథమా విభక్తిలో ఉన్నవి. ఈ పద్యములు షష్ఠ్యంత స్థానమున లేకున్నను, ఆ స్థానమునకు నిర్దేశించినట్లు కథా ప్రారంభమునకు ముందు

వ॥ అయినను దేవా నీయనుమతంబున విద్యుజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విదంబున నిక్కావ్యంబు రచియించెద అని వ్రాసెను. తరువాత కథా ప్రారంభమునకు ముందు తన కవితావతరణమునకు సహకరించిన సరసీవనంబులైన సభలను, తోడ్పడిన నారాయణ భట్టును, తన కవితా విశేషములను తెలుపుకొనినాడు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణమును షష్ఠీ విభక్తి ప్రత్యయములతో ప్రారంభించెను. భారతమును షష్ఠీ విభక్తి ప్రత్యయములతో ఆరణ్య పర్వమును ప్రారంభించి, షష్ఠ్యంతములుగ ఐదు కందపద్యములు విరాట పర్వమున వ్రాసి, ఆరణ్యపర్వశేషమును తను రచించిన గుర్తుగా మూడు ఆశ్వాసారంభ సంభోధనలు విరాట పర్వమున పెట్టి, సరస్వతీ దేవి స్తుతి 'అంబ నవాంబు జోజ్జ్వల కరాంబుజ' ఆరణ్య పర్వమున రచించినాడు.

పోతన వీరభద్ర విజయమున హరుని కంకితముగ 3 షష్ఠ్యంత కందపద్యములను రచించి అవి మూడు ఆశ్వాసములు త్రినేత్రుడైన హరుని సంకేతముగ ఆరణ్య పర్వమును చేసిన తిక్కన మరుజన్మ నేనే అనునట్లు ఉద్దేశించెనా అనునట్లు తిక్కన గారి అంబ ! నవాంబు జోజ్జ్వల కరాంబుజ పద్యమును తన భాగవత ప్రార్థనా పద్యముగ చేర్చుకొనినాడు.

అంతేకాక హరిహరనాథాంకితముగ తిక్కన రచించినట్లు తాను శ్రీ రామాంకితము చేయుచున్నానని శ్రీ రామ పరముగ ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములను రచించి, షష్ఠ్యంతములు శ్రీ కృష్ణాంకితముగ చేసి రచించినాడు.

అట్లు చేయుచు, షష్ఠ్యంతములుగ తను (హరుని కంకితమైన) వీరభద్ర విజయమున రచించినట్లు 3 కంద పద్యములు కాని, తిక్కన వలె 5 కందపద్యములు కాని రచింపక, 4 ఉత్పల మాల వృత్తములను రచించి నాడు. ఇది నన్నయ కంద, ఉత్పలమాలలే వ్రాయుట చేత, హరిహరానాథాంకితముగ కందములు తిక్కన వ్రాయుటచేత, మిగిలిన ఉత్పలమాల వృత్తములను హరికంకితముగ పోతన స్వీకరించెనేమో. అదే అక్షరుని సంకేతమేమో అనితలంపవచ్చును.

కందమునందు మొదటి పాదమున 3 గణములు రెండవ పాదమున 5 గణములు, మొత్తము పద్యమున 16 గణములుండుట వలన మొత్తమునకు 64 మాత్రలై, 5 కందములకు 320 మాత్రలగును. ఉత్పలమాలలో పాదమునకు 20 అక్షరములతో 4 పాదములకు 80

అక్షరములై 4 ఉత్పలమాలలకు 320 అక్షరములగును.

తిక్కన, పోతనల మార్పు 320 సంఖ్య కూడిన అక్షర, మాత్రల మార్పులతో సూచించెనా అని తోచుచున్నది.

వేంకటకవి రామాయణమును శ్రీకృష్ణాంకితముగ, శ్రీకృష్ణ జన్మఖండము శ్రీ రామాంకితముగనే రచించి ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత పద్యములు అంకితమిచ్చిన శ్రీ కృష్ణ, శ్రీ రామ పరముగనే పై కావ్యములలో 5 కందపద్యములు షష్ఠ్యంతములుగ రచించినాడు.

తిక్కన షష్ఠ్యంత పద్యములలో కడపటి పద్యమున 'భక్త పరతంత్రునకున్ అని భాగవతమును ధ్వనించు పదముతో ముగించి కిమస్థిమాలంలోని యశోదాస్తన్యమునకు సరియగు 'నందాంగ నా డింభకున్' పోతనను సూచించుచున్నది. ఈ భక్త పరతంత్రునకున్ అను పదమే వేంకటకవి రామాయణ షష్ఠ్యంతములలోని మొదటి పద్యముననే కడపటి పదముగ వాడి రైలుపెట్టెలను కడపటి పెట్టె మొదలును ముందరి పెట్టె కొనతో తగిలించు విధమున తిక్కన, వేంకటకవుల షష్ఠ్యంతములను బంధించు (కలుపు) పోతన భాగవతమును ధ్వనించుచు ఒకేఅక్షర పరంపరను సూచించునట్లున్నది.

### ఆశ్వాసారంభ పద్యములు పరిశీలన

నన్నయ భారత ఆదిపర్వ ద్వితీయాశ్వాసము నుండి సంబోధనా ప్రథమా విభక్తిగా రాజరాజ సంబోధనా ప్రసక్తి పద్యములు రచించినాడు.

తిక్కన పై విధముననే నిర్వచనోత్తర రామాయణమున రచించినాడు. కాని భారతము విషయమున నన్నయ వదలివెళ్ళిన చోటు నుండి రచింపవలసిన అవసరమయ్యెను. దానిని గురించి ఆలోచించుచుండగా తిక్కనకు ఇంచుక నిద్ర వచ్చి స్వప్నము వచ్చెను. ఆ స్వప్నములో హరిహరనాథుడు 'భారతము పంచమ వేదము, ఆరాధ్యము అను గౌరవమున నీవు అఖండిత(సంస్కృతమూలము తెలుగుచేయని) భక్తిన్(భాగమును) తెలుగుభాషలో వినిర్మించుట (అతుకుల బొంతవలె కాక విశేషముగ నిర్మించుట) కు తివురుట భవ్య పురుషార్థ చెట్టుకు పండినపండు కదా. దానినికోరి అంకిత మడుగుటకు వచ్చితిని తిక్కశర్మ అని పలికెను.

రసహృదయుడైన పాఠకుని దృష్టిలో ఉంచుకొని తిక్కన, మరణించిన నన్నయ పేర ఆరణ్యపర్వ శేషకథాంశమును మాత్రము రచించి అందలి 5,6,7 ఆశ్వాసారంభ పద్యములను అంతస్సన్నిది కలిగించుకొని హర సూచకముగ మూడు హరిహరనాథ సంబోధనలు విరాట పర్వమున రచించి, విరాట పర్వ ఆశ్వాసారంభముగ ఇట్లు హరిహరనాథునకు దేవా దివ్య చిత్తంబున నవధరింపుమని విన్నవించినాడు.

### గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

ఆ॥ కద జగత్ప్రసిద్ధ గావునఁ బూర్వప,ర్వార్థ యుక్తి చేయునట్టి యెడల
యత్న మించుకింత మయినను వలవదు, వలసినట్లు చెప్పవచ్చియుండు

పూర్వ పర్వమైన అరణ్యపర్వమును అర్ధయుక్తి చేయునట్టి ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములు చూచు సమయమున, కథ జగ(త్ప్రసిద్ధి కనుక ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములు లేవే అను (ప్రయత్నము ఇంచుకైనను చేయవద్దు. రాజరాజు లేడు కనుక, నేను రచించిన రచన హరిహరనాదాంకితము కనుక, ఈ అరణ్యపర్వశేషము చతుర్థాశ్వాసము నుండి సమయమునకు తగినట్లు నేను రచింపవలయును కదా' అని చెప్పుకొనెను. అరణ్యపర్వశేషమును భోగాసక్తులైన రాజులకు అరణ్యావాసము విష(ప్రాయముగ నుండునను విషయమును సూచించుటకు, విషమును కంఠమున ధరించిన హరుని సంకేతముగ తిక్కన రచించె నను నట్లు, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములు రచింపక వదలివేసెను.

5,6,7 ఆశ్వాసముల ఆరణ్యపర్వ ఆరంభ పద్యములను సూచించుటకా అనునట్లు పోతన హరుని కంకితమిచ్చిన వీరభ(ద్రవిజయమున మూడు కందపద్యములే షష్ఠ్యంతములుగ రచించినాడు. అరణ్యపర్వ శేషములోని అంబ నవాంబు జోజ్వల కరాంబుజ పద్యమును, భాగవత (ప్రార్ధనా పద్యములలో చేర్చినాడు. భాగవతములో షష్ఠ్యంతములు (శ్రీ కృష్ణ పరముగ, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములు (శ్రీ రామ పరముగ రచించినాడు. ఇట్లు పోతన హరిహర ధ్వని చేసినాడు.

వేంకటకవి పోతన రచించినట్లే కథా (ప్రారంభమును చేసి ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములు అంకిత (ప్రభువు పేరనే రచించి సాధారణ స్థితి (అంకిత (ప్రభువు పేరన ఆశ్వాసారంభ పద్యములు ఉన్న స్థితి) వచ్చినట్లు ధ్వనించినాడు.

ఆశ్వాసాంత పద్యములు పరిశీలన

నన్నయ ఆశ్వాసాంతములను ఉత్పలమాల, కందము, తోటకములతో (ప్రారంభించి ద్వితీయాశ్వాసము నుండి సభా పర్వము (ప్రదమాశ్వాసము వరకు ఒక కంద పద్యమును తప్పనిసరిగా రచించి మార్చిమార్చి ఏదో నొక వృత్త పద్యమును (వ్రాయుచుండిరి.

మరల సభాపర్వ ద్వితీయాశ్వాసమున రథోద్ధతము, కందము, ఉత్సాహము రచించి, తదుపరి, మునుపటి వలెనే ఒక కంద పద్యమును తప్పని సరిగా రచించి వృత్తపద్యమును మార్చుచు రచించిరి.

తిక్కన ఆరణ్య పర్వశేషమును పూరించునపుడు ఆశ్వాసాంతములు రచింపక

వదలివేసెను. విరాట పర్వము నుండి తన భాగమునంతయు ఒక వృత్తమును, ఒక కందమును, ఒక మాలినీ వృతమును ప్రతి ఆశ్వాసాంతముననను రచించిరి.

భాగవతము పాతిపెట్టినందునను, కొన్ని స్కంధములు వేరు వేరు కవులు రచించినందునను భాగవతమున ఆశ్వాసాంతపద్యములు ఒక నియమమునకు నిలబడలేదు. కనుక దానిని గురించి చర్చించుట అనవసరము.

రామాయణమున వేంకటకవి బంధకవిత్వము, గర్భకవిత్వములతో కూడిన వృత్తపద్యము నొకదానిని, ఒక కందమును, మార్చి మార్చి మరొక వృత్తమును వ్రాసెను.

ఈ ఆశ్వాసాంతములలో వేంకటకవి చక్రబంధము, ఖడ్గబంధము, ఫణిబంధము మొదలగు బంధ కవిత్వ పద్యములను, చతుర్విధ కందము, అనులోమవిలోమ కందము, పాద గోపనమైన చంపక పద్యము, కంద, గీతా ద్రుతవిలంబిత స్వాగతా గర్భ చంపకము, వృత్త, కంద గర్భిత చంపకము రచించి యుండుట విశేషము. ఇట్టివి కథాగమనమున రసభంగము కనుక ఆశ్వాసాంతములందు రచించి నన్నయ, తిక్కన, పోతన రూపుడైన అక్షరుడు తన భారత, భాగవత, రామాయణములలో అన్ని ప్రక్రియలు ప్రయోగించి తన ఏకత్వమును ధ్వనించేనేమో అని ఈ ఆశ్వాసాంత క్రమవృద్ధిని బట్టి తలంపవచ్చును.

వేంకటకవి బాలకాండాంత పద్యములను పరిశీలింతము.

పుష్ప మాలికాబంధము

చ॥ ధరధర వీర శాశ్వత ధృతవ్రత మాధవ దేవదేవ మం
దరదర ధీర మోక్షదపదప్రద సుందరతారహార భా
స్వర సురవారపోష వరవల్లవ శేఖర హారహార శం
కరధరసారకీర్తి కవి కల్పక గోకుల బాల ఖేలనా (గో.రా. – బాల – 1348)

క॥ విశ్వాధిప విశ్వోదర, విశ్వాత్మక విశ్వసాక్షి విశ్వాధారా
విశ్వమయ విశ్వరూపక, విశ్వస్థితి విలయకరణ విశ్వాతీతా (గో.రా.– బాల – 1349)

మాలిని. సరసిజదళనేత్రా సజ్జన స్తోత్ర పాత్రా, నిరుపమ సుచరిత్రా నీలమేఘాభగాత్రా
పరమగుణ పవిత్రా పాపవల్లీలవిత్రా, హరివర సుతమిత్రా యబ్ధి కన్యాకళత్రా

శా. ఈ కావ్య ప్రతిపాదితుండయిన సీతేశుండు రామప్రభుం
డీ కళ్యాణ కృతీశ్వరుండయిన శ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపా పూర్ణతన్
లోకస్తుత్య కుమారయాచ దరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్ గో.రా. బాల – 1351)

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

మొదటి పద్యము భగవంతునికి పుష్పమాలికగా చంపకము వ్రాయుట అందు మోక్షదపద ప్రద అని ఉండుట. కడపట సర్వజ్ఞ కుమారయాచేంద్రుని ఆశీర్వదించుటయును గమనింపదగినది.

ఈ రచనలలోకూడ నన్నయనుండి తిక్కన, పోతన, వేంకటకవుల వరకు ఉత్తరోత్త రాభివృద్ధి కననగును. కనుక ఇదియును ఒకే అక్షర రచన అని స్ఫురింప చేయుచున్నది.

నన్నయ 'హరిహరాజ' పద్యమున ధ్వనించిన భారత, రామాయణ కథలకు ధర్మనాయకులైన శ్రీకృష్ణ, శ్రీరాములు సర్వజ్ఞ కుమారయాచేంద్రుని ఆశీర్వదించుట వలన భారతకారకుడైన చంద్రవంశపు రాజు రాజరాజును ధ్వనించుచున్నది. దీనివలన రాజరాజ, మనుమసిద్ధి, సర్వజ్ఞ సింగ భూపాల, సర్వజ్ఞ కుమారయాచేంద్రులు కూడ ఒకే అక్షరుడా అని భావింపదగి యున్నది.

### కథాంశముల పరిశీలన

కవి కథాంశమును ఎన్నుకొనుట తన ఇష్టము. కాని ఏ రాజు కాని, దైవము కాని కృతిభర్త కాతలచి కవిని రచింపమని కోరినపుడు కృతిభర్త తన ఇష్టమును తెలుపుచుండును.

రాజరాజు తెలుగు దేశము పాలించినా, తెలుగువాడు కాడు. (చాళుక్యుడు) అట్టి రాజరాజు తన కీర్తి చిరస్థాయిగా ఉండుటకు ఆనాటి ప్రఖ్యాత కవియైన నన్నయను గుర్తించి రచింపచేయుట కాలశక్తి. రాజరాజు చంద్రవంశపు రాజు కనుక, తన పూర్వ పుణ్యకీర్తనుల చరిత్ర, తనను పులకాంకితము చేయును. కనుక భారతమును తెలుగు చేయమని నన్నయను కోరెను.

ఋషితుల్యుడైన నన్నయ భారత, భాగవత, రామాయణములు మూడు మూడు రకములుగ రచియింప నెంచి అన్ని రకముల కవిత్వములకు ఆఅక్షర పురుషుడు ఆద్యుడై ఉండవలెనని తలంచెనా అనునట్లు కాలశక్తి, ఆ తలంపు నీడేరుటకు వేదత్రయ మూర్తులను పదమును, నన్నయ నోట పలికించినది.

అది నెరవేరుటకా అనునట్లు, నన్నయ అరణ్యపర్వ చతుర్థాశ్వాస మధ్య వరకు వర్ణించి వర్ష వర్ణనతో ఆకాశం చేరినాడు. రాజరాజ మరణించిన కొన్ని రోజులకు నన్నయ మరణించినట్లు జనశ్రుతి. నన్నయ ఆదిజుడైన బ్రహ్మ ఉదయంబున కాస్పదమైన వాడు అని తను అరుణు పుట్టుకకు కారణుడనని చెప్పుకొనెను. అరుణాంశుడైన తిక్కన పుట్టి కిమస్థిమాలాం, కిం కౌస్తుభం వా అని శారదరాత్రులను కార్తీకచంద్రపౌర్ణమి వరకు (ఆసకల ప్రమోదకరమై) శరత్కాల వర్ణనతో ప్రారంభించి నన్నయ ప్రారంభించిన భారతమును హరిహరనాథాంకితముగ పూర్తిచేయుట. సంస్కృతపద బహుళముగ బయలుదేరిన కవితా వాహిని, తెలుగు పద సౌరభ్యమును సంతరించుకొనె మనట్లున్నది. ఇది నన్నయ మరణమునకు పూర్వము భగవదంకితము చేసిన బాగుండెడిదే అని తలంచెనా అనునట్లు ధ్వనించుచున్నది.

### గోపీనాథ వేంకటకవి పూర్వకవి పరంపర

తిక్కనను మామ చేయమని కోరిన సూర్యవంశపు రాజు మనుమసిద్ధి, రాజరాజుల సత్యచరిత్ర మనకు తెలియదు. తెలిసిన వారిలో ఒకే అక్షర గుణములు కనబడునేమో. ఇద్దరికి సాహిత్య పిపాస కలదు. ఒకరు చంద్రవంశపు రాజు, మరొకరు సూర్యవంశపు రాజ. తిక్కనను ఊరక మామచేయమని అడుగగనే, ఆ మనుమసిద్ధి వంశపు పూర్వ రాజు శ్రీరాముని ఉత్తర చరిత్ర, తిక్కననే రచియించి యిచ్చుట, వారి ఒకే అక్షరత్వమును సూచింపునేమో.

ఉ॥ అంచితమైన దర్మ చయమంతయు జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు దర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణ విశేషము లెన్నినఁ గాక నీకు నీ
కొంచెము పెచ్చుపెల్ల హరిఁగోరి నుతింపుమి నార్యపూజితా (భాగ – 93))

ప॥ మహానుభావుండవు వేదార్థదర్శునుండవు. సకలదిగంత దవళకీర్తివి. సత్యరతుండవు ధృతవ్రతుండవగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ వర్ణింపుము(భాగవతము) అని నారదుడు వ్యాస భగవానునికి ఉపదేశించెను. తిక్కన భారతములోని విష్ణు సహస్రనామము తెలుగు చేయలేదు. భగవద్గీత క్లుప్తముగ తెలిగించెను. భారత రచన తర్వాత భాగవత, భగవద్గీతలు తెలిగింప తలంచి యుండేనేమో.

కందుకూరి వీరేశలింగం పంతులు తిక్కన కృష్ణశతకము రచించినట్లు జనుశ్రుతి ఉన్నదనియు దానిలోని పద్యముగా క్రింది పద్యమును పేర్కొనినారు.

అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై గుబ్జపై
నరుపై ద్రౌపదిపై గుచేలుపయిన్ నందవ్రజశ్రేణిపై
బరగం గల్గు భవత్కృపారసము నాపై కొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాను జగదీశా ! కృష్ణ ! భక్తప్రియా !

ఈ విషయమును అముద్రితగ్రంథచింతామణిలో చర్చించి ఇది తిక్కనది కాదని, వెన్నెలకంటి జన్నయ వ్రాసిన దేవకీనందన శతకములోనిదని ఋజువు చేసిరట అని 'సమగ్ర ఆంధ్ర సాహిత్యము' న ఆరుద్ర వ్రాసియున్నారు. కాని అనేక జనశ్రుతులు సత్యమైనట్లుగా ఈ గ్రంథమున తేల్చబడినందున ఇదికూడ సత్యమేమో. తిక్కనగారి పద్యమును వెన్నెలకంటి జక్కన కొలది మార్పులతో చేర్చుకొన వచ్చును కద.

ఇది సత్యమే అయినచో తిక్కన కృష్ణశతకము, పోతన నారాయణ శతకము, వేంకటకవి రామస్తవము (రామశతకము) వారి నారాయణశబ్ద భావమైన నన్నయ పరంపరకు సరిపోవును.

పుణ్యమూర్తి పోతన సర్వజ్ఞసింగ భూపాలుని కోరికపై భోగిని దండకమును రచించి

విరక్తుడై భాగవత కదిను శ్రీ రామాంకితముగ రచించి సర్వజ్ఞ సింగ భూపాలుని రక్షక భటుల తాపములను అనుభవించియుండవచ్చును.

సర్వజ్ఞసింగభూపాలుడు కూడ సంస్కృతపండితుడు, రచయిత. రాజరాజు, మనుమసిద్ధి, సర్వజ్ఞ కుమార చరిత్రలు పూర్తిగ తెలిసిన అందరు ఒకే అక్షరుడా అను అంశమును పరిశీలింప వీలగును.

భక్త పరతంత్రునకున్ అని భాగవతమును సూచించు పదము వాడి, భగవద్గీతా పూర్వ రామాయణ రచనలచే పోతన, తిక్కనలనువెంకటకవి ధ్వని చేసెనేమో అనునట్లున్నది. వేంకటకవి రామాయణమున రావణుడు కడపటి సారి యుద్ధమునకు వెళ్ళుముందు మండోదరితో

చ॥ నళినదళాయతాక్షి కదనంబున రాముని( జంపు లొండె న
య ్యలఘు చరిత్రు దివ్య విశిఖాహతి( జచ్చుట యొండె నంతె పో
పలుకులి(కేల యే నచట( బంచత నొందిన నీవు దుఃఖ మ
వ్వల విడి జానకిం దునిమి వహ్నిముఖంబున(జావు మొక్కుటన్ (గో.రా. యుద్ధ – 2584)

అని చెప్పుట రావణుని వైరము జన్మాంతరమునకు తీసికొని పోవుచున్నాడని ధ్వని.

కనుకనే శిశుపాలునిగ పుట్టిన రావణునిపై వైరము వరసతియైన (పతివ్రత) కాంతవలె స్వభావమును అనుసరించి వచ్చెనట చూడుడు.

చ॥ పరగ జిగీషు(డైన శిశుపాలుని చేల బరాపిలేపితన్
దురుసుగ నిప్పుడు జగము లొంటి విధంబున గాసి నొందెడున్
వరసతియైన కాంతవలె వారక సుస్థిరమౌ స్వభావమున్
దర( బ్రతిజన్మమం దవి తథంబుగ( బూరుషు నొందునే కదా (శిశు –1– 134 )

అని శిశుపాల వధం బాపాదించి వచ్చు శ్రీ కృష్ణుని వర్ణింపుచు

సీ॥ కరిబృంహితంబులు హరిహేషలును జయ, డిండిమ స్వనము లొండొండ బెరయ
నంబోధిసంకాశ యాదవసేనలు, జయ జయ ధ్వనులు దిక్చయము నిండ(
బ్రద్యుమ్న సాత్యకి బలభద్ర ముఖ్యులు, రదముల నెక్కి పార్శ్వముల రా( గ(
బరికింప "రాజగోపాలకృష్ణ ! పరా, కని వందిజనంబు లందంద( బొగడ

గీ॥ సమరజయజాత మందహాసంబు వదన, చంద్రచంద్రికా విస్ఫూర్తి సంతరింప
క్షితిసురులు ప్రీతి తోడ నాశీర్వదింప, నమల నేత్రుండు ధర్మజు(గాన వచ్చె( (శిశు 4 –231)

అను పద్యము వేంకటకవి 'రాజరాజ సమధనాఢ్య క్షునకున్' అని షష్ఠ్యంతముల యందు చెప్పిన గోపాల కృష్ణ యాచేంద్రుని కంకితము. ఇది మొట్టమొదటి నరాంకితము. అంతకుముందరి

రామాయణము కృష్ణాంకితము. శ్రీకృష్ణ జన్మఖండము రామాంకితము.

పై పద్యములోని 'రాజగోపాలస్రష్టే ! పరాకో' అను పదము అంకితమిచ్చిన రాజు నుద్దేశించిన సంబోధననా అనునట్లున్నది.

కాని ఇది శ్రీకృష్ణున కన్వయము. ఇది రాజ రాజు శ్రోతగా భారతము రచించిన నన్నయ రూపమైన అక్షరుడు. శిశుపాలుని విలీనము చేసుకొనిన శ్రీకృష్ణుని చూచిన ఆనందమున ముగ్ధుడై వేంకటకవి రూపుడైన ఆ అక్షరుడే పలికిన పదమా అనిపించుచున్నది.

ఈ సందర్భమున నన్నయ భారతమును ప్రారంభించుచు రాజరాజునుద్దేశించి చెప్పిన 'అయినను దేవా ! నీ యనుమతంబున' అను వచనమును తిక్కన విరాట పర్వప్రారంభమునందలి 'దేవా! దివ్యచిత్తంబున నవధరింపుము' వేంకట కవి భగవద్గీత ప్రారంభము 'దేవా యవధరింపుము' అను వచనము భారతరచనను గుర్తుచేయుచు ఒకే అక్షరత్వమును ధ్వనించుచున్నది.

వేంకటకవి 'నేను పదియాఱు వత్సరంబుల వాడనై యుండుతఱి సింహపురంబునుండి నృసింహదేవ కళ్యాణోత్సవ సమాలోకన కుతూహలాతిరేకంబున వేదశైలంబునకుం జని యందొక్క మహాయోగి వలన నొక్క విద్య వడసి తత్ప్ర సాదలబ్ద కవిత్వ విద్యా విశేషుండనై. అను వచనములోని వేదగిరి లక్ష్మీనరసింహస్వామి, తిక్కన భావించిన హరిహరనాథుని మూలరూపుడేమో. ఒక అక్షరుని అత్యంత సన్నిహితమైన స్థలము అట్లు జన్మాంతమున నైనను లాక్కొని వెళ్ళునని శాస్త్ర విశ్వాసము.

దీనిని ధృవపరచు నందుకే నేమో అనునట్లు ఎఱ్ఱన నృసింహ పురాణము రచించినాడు. ఎఱ్ఱన చెప్పుకొన్నది నన్నయ సారస్వతాంశ ప్రశస్తి తన్ను చెందెనని. కాని కలిపిన కథాంశములు తిక్కన రచన అని మనము ముందు గ్రహించితిమి. కనుకనే ఎఱ్ఱన తిక్కన శైలి నలవరచుకొని, తిక్కన రచనల కనురూపమైన రచననే చేసినాడు.

పోతన శ్రీరామచంద్రుని కంకితముగ భాగవతమును ఆబాల గోపాల మానందించునట్లు భక్తిరసము వెల్లిగొల్పి ధనుర్మాసపు హేమంత ఋతువు వలె వెలసినాడు.

వేంకటకవి తను వసంతుడునని శ్రీ రాధికా పరిణయమున చెప్పుకొనెను. చూడుడు.

తే॥ వెలయ సకల వర్ణనములు గలగునట్లు, చాల సత్కవులందరు మేలనంగ
దెలుగుఁజేసితి నిపుడాంధ్ర దేశ విపిన, ఘన వసంతుండ వేంకట కవి వరుండ (శ్రీ రాధి.ప)

తిక్కన, పోతన వేంకటకవులు అంకితమిచ్చిన హరిహరనాథుడు, శ్రీరాముడు, కృష్ణులను నరసింహస్వామి, శ్రీ రామ, శ్రీకృష్ణులుగా గ్రహించిన జయుడు ఎత్తిన మూడు

జన్మలు హిరణ్యా కశిప, రావణ శిశుపాలురను చంపిన మూర్తులుగా తెలిసికొనగలము.

నన్నయ అక్షరుని వేద త్రయమూర్తులు వీరనునట్లు వేంకటకవి రామాయణ బ్రహ్మ ప్రార్థనమున 'త్రయీసరణిన్ మజ్జగముల్ సృజించిన జగత్స్రష్టన్ విధిన్ కొల్చెదన్' అని రచించి సూచించినాడు.

నన్నయ ప్రారంభించిన పద్య విద్య సంస్కృత పదబహుళమై గంగా ప్రవాహమై తిక్కన వద్ద నటభాష సంస్కారముగ తెలుగు సుగంధమును చవిచూచి పోతన నుండి మధురముగ భక్తి మయము, లక్ష్యమయము చేసి తెలుగు పద్యము ఆనందముతో ఆంధ్రదేశము నలరించినది. వేంకటకవి పద్యగద్యములు శిఖర స్థాయిని వన్నె కెక్కి అందరి నలరించి వచన యుగమునకు దారితీసినది. శిఖరస్థాయిని చేరిన పద్య గద్య విద్య, వచన రచనకు దిగజారుట కనుక ప్రాచీన విపినతరు కవితకు వేంకటకవి వసంత ఋతువు.

కనుక నన్నయకు పూర్వ వాఙ్మయము గ్రీష్మ ఋతువుగను, నన్నయ నాటి వాఙ్మయము వర్ష ఋతువుగను, తిక్కన నాటి వాఙ్మయము శరదృతువుగను, పోతన కాలము నాటి వాఙ్మయము హేమంత ఋతువుగను, పోతన, వేంకటకవుల మధ్య వాఙ్మయమును శిశిర ఋతువుగను వేంకటకవి నాటి వాఙ్మయమును వసంత ఋతువుగను పోల్చవచ్చునేమో ! ఈ సందర్భమున ప్రబంధయుగమున పద్యరచనా శిల్పము శృంగార వర్ణన కావ్యము లే కాని లోకహిత కావ్యములు ధర్మ ప్రబోధమైన భక్తిని, ధర్మమును పెనుపొందించు మంచి పెద్ద కావ్యములు రాకుండుట గమనింపగలము.

ప్రాచీన వాఙ్మయము తాళపత్రముల నుండి ముద్రణా పరిణతి చెందినది. అనేక ప్రతులు ఒకేసారి ముద్రింపబడి లేఖక ప్రమాదములు ఒక్కొక్క తాళపత్రమందు ఒక్కొక్క రీతిగ కాక అన్నింటిలో ఒక్కటిగనే ఉన్నవి.

అట్టి కాలమున కాలశక్తి వేంకటకవిని పుట్టించి తన పూర్వజన్మలైన నన్నయ, తిక్కన, పోతన రచనలను తను మారురూపమున చూచుకొనునట్లు పుట్టించెనా అనునట్లు వేంకటకవి ఆరచనలను చూచి, తన రామాయణ, శ్రీ కృష్ణ జన్మఖండ, శిశుపాలవధలను ముద్రణలో చూచుకొని పరమపదించెను.

పుట్టినది లక్ష్మీపురం. పరమపదించినది వేంకటగిరిలో. పుట్టినది శ్రీముఖ సంవత్సరం. పరమపదించినది నందననామ సంవత్సరం. వేంకటగిరి పోయినది ఒకడుగ కాక సకుటుంబముగా (తన పరమపదము తనకు తెలిసినట్లుగ) మంచికి మరణం సాక్షి ఇవి

విరూపించుటకా అనునట్లు వేంకటగిరి శ్రీ రాధికా పరిణయ సమర్పణ కని వచ్చి విన్నది తన పోషక ప్రభువు సర్వజ్ఞకుమార మరణవార్త.

రాజుశవము చూచుటకు వెళ్ళి తన ప్రతిమను ఛాయా చిత్రములో వదలి ఇంటికి వచ్చినది

ఉ॥ ద్వారము లన్ని మూసి యెదఁ దప్పక చిత్తము చేర్చి శీర్షమం
దారయఁ బ్రాణమున్ జొనిపి యంచిత వైఖరి ధారణాయుతుం
డై రహి బ్రహ్మమైన ప్రణవాక్షరమున్ ననుఁ గూర్చి పల్కుచున్
వారక దేహమున్ విడుచు వాఁడటు సద్గతి ఁ జేరు భారతా ( శ్రీ భ.గీ. – 206)

అని శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లు

చ॥ అలస సమీరు రాక విషమాయె మనోహర కీరశారికా
కల కంఠనాదములు కర్ణకఠోరము లాయెఁ బండు వె
న్నెల కడు వేఁడి యాయె విరితేనె చవుల్ వెగటాయెఁ దమ్మిడా
నలినదళాయతాక్షి గహనంబునఁ బాసిన నాట నుండియున్ (గో.రా. యుద్ధ – 99)

అని ఎప్పుడు తన ఆస్థాన కవి రచించిన రామాయణములోని పద్యమును తన సహచరులతో చెప్పుచుండు రాజు

అనిశము భోజరాజ సభయందుఁ జెలంగెడు కాళిదాసు చా
డ్పున మహిఁగృష్ణ రాయ సభఁ బొల్చుగు పెద్దన సూరి భంగి న
త్యనుపమమైన యత్మ సభయందు మహాకవినై చెలంగునన్
ఘనమతిఁబిల్వనంపి'

నట్లు వేంకటకవి తన రాజు వెళ్ళినట్లే లోకము వదలి వెళ్ళినాడు అనునట్లు వేంకటకవి పరలోక గతుడైనాడు.

సత్య చరిత్రలు మనకు తెలియవు కాని తెలిసిన రాజరాజు, మనుమసిద్ధి, సర్వజ్ఞ సింగ భూపాలుడు, సర్వజ్ఞకుమార యాచేంద్రులు ఒకే అక్షరుడను బుజువులు లభించునేమో.

సంపూర్ణ అక్షర చిహ్నములు

వేంకటకవి శ్రీ రామనవమి శ్రీ కృష్ణాష్టములలో సప్త దినములు పూజలు జరిపి పురాణ పఠనము, భజనలు, అన్నదాన సంతర్పణ చేసెడి వాడు. ఆ భజనలలో గోపినాధ వేంకటకవి తను రచించిన కీర్తనలు సామూహికముగ కీర్తించుచుండెడి వారు. అందులో ఒకటి

సంప్రదాయముగ పాడుకొనుచున్న గాడేపల్లి సుబ్బమ్మ (మా అమ్మమ్మ) గారి నోటి నుండి విని వ్రాసుకొన్న గీతము క్రింద యిచ్చుచున్నాను.

నీకే సేవ చేసితి నీరజలోచన
చేకొని నను బ్రోవరా ॥నీకే॥
గట్టిగ మకరము పట్టి బాధింపగ ఇ
క్కట్టు పడలేక అట్టే దీనత మొరపెట్టగా విని కృప
పుట్టి గజేంద్రుని బ్రోచినా వని విని ॥నీకే॥
తులువ దుస్ససేనుడు వలువలు వొలువగ
తలచి ఆ సభలోని తలపగ తలపాపిటములిచ్చి ద్రౌపది మానము
కలికి కృష్ణుడవగుచు కాచినా వని విని ॥నీకే॥
ఖలుడైన అన్నతో కలహించి వచ్చియు
సలలిత పద పద్మములు తలసోక ప్రణమిల్లి దయ
యేలు మనునంత ఎలమి విభీషణు ఏలినావని విని ॥నీకే॥
శరణన్న మాత్రాన శరములు విడువక
శరధి కభయ మిచ్చియు
కర్మ మీఱగ లక్ష్మీపురమున నెలకొన్న
చరణు సేవకుల రక్షింతువని విని ॥నీకే॥

దీనిని పరిశీలించిన మొదటి పాదము భాగవత పాఠము, రెండవది భారత పాఠము, మూడు నాలుగు పాదములు రామాయణ పాఠములుగా గమనింపవచ్చును. ఇదియును రామాయణ, భారత, భాగవతములు రచించిన అక్షరుని రచననా అనిపించును.

వేంకట కవి తన కవిత్వమున శిరీషప్రసూనంబులం గల పేశలత్వంబును, సౌగంధిక పుష్పంబులం గల సౌరభ్యంబును, పారిజాతలతాంతంబులం గల మాధుర్యంబును కలదని తన కడపటి శ్రీ రాధికా పరిణయమున తెలుపుకొనెను.

శిరీష ప్రసూనంబులంగల పేశలత్వము నన్నయ ప్రసన్నతతో కూడిన గంగా ప్రవాహపు ధారాశుద్ధికిని, సౌగంధికపుష్పంబులంగల సౌరభ్యము తిక్కన అర్థగౌరవయుక్తికిని (అర్థాలంకారములకును) పారిజాతలతాంతంబులం గల మాధుర్యము పోతన లలిత శ్రవణ సుభగ శబ్ద మాధుర్యమునకును (శబ్దాంకారములకును) సంకేతములుగా గ్రహింపవచ్చును.

ఈ మూడు కవితాగుణములు తన కవితయందు కలవని చెప్పినందున ఆ ముగ్గురుఒకే ఆ వులని వాని రూపాంతరముచే రచించుచున్నట్లు ధ్వని కలదు.

గోపినాథ వేంకటకవి పూర్వకవి పరంపర

పై కవితా ఛాయ వేంకటకవి మొదటి కావ్యమైన రామాయణములోనిప్రథమశ్లోక పరివర్తనమునందే చూడవచ్చును. చూడుడు.

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్ (1-1)

శతకోటి ప్రవిస్తరంబై బ్రహ్మలోకంబు నందు సుప్రసిద్ధంబైన రామచరితంబు భూలోక వర్తులైన నాలుగు వర్ణంబుల వారికి దాపత్రయ విమోచనంబు కొఱకు సంక్షేపించి రచియింప నుద్యుక్తుండై పరమ కారుణికుండైన పరమేష్ఠి వాల్మీకి రూపంబున విశ్వంభరయం దవతరించె నట్టి బ్రహ్మాంశసంభూతుండైన వాల్మీకి తన చేతఁ జికీర్షితంబైన రామచరితంబు గురుముఖంబు వలనం వినంగోరి భగవత్కథోపదేశంబునందు సర్వగురుండైన నారదుం బ్రతీక్షింపుచుండ నొక్కనాడు భగవంతుండైన యన్నారదుండు బ్రహ్మనియోగంబున వాల్మీకి కడకుం జనుదెంచిన నత్త పస్వివర్యుండు తపస్స్వాధ్యాయ నిరతుండును వాగ్విశారదుండును దేవముని శ్రేష్ఠుండునైన నారదు నవలోకించి పూజించి మునీంద్రా.

పై తెలుగు చేతలో శ్లోకమును వచనముగా పరివర్తించుట, ప్రసన్నపదములు వాడుట నన్నయ గారి ఆది కవితా శక్తి. అది రాబోవు వచన యుగమునకు సూచననా అనునట్లు వచనములో ప్రతికాండమును ప్రారంభించి, వచనములో ముగించి మధ్యమధ్య పెద్ద వచనములు వ్రాసెను.

శ్లోకమునకు ముందరి పూర్వాపరములు నాటకీయతతో పాత్రల మనస్సునందలి అభిప్రాయములను పరితల అవగాహనకు చెప్పుట (అవలోకించి, పూజించి వంటి పదములు) తిక్కన పద్ధతి.

పై వచనము నందు మహేశ్వర తీర్థ వ్యాఖ్యను తెలుగు చేయుట పోతన పద్ధతి.
కనుక మొదటి వచనముననే నన్నయ, తిక్కన, పోతనలను ధ్వనించెను.
పద్యములలో నన్నయ పేశలత్వమున కుదాహరణము

సారథి కంటె దవ్వుల విశాలరసాల మహీరుహాళిచే
భూరి గభీరమై పొలుచు పుణ్య వనోపవనంబులన్ శర
న్నీరద పంక్తిఁ బోలు మణినిర్మిత శర్మద హర్మ్యపాళిఁజె
న్నారెడు రాజమార్గముల నద్భుత భంగి వెలుంగు మత్పురిన్ (గో.రా. - అయో-1440)

తిక్కన సౌరభ్యము

తే. గీ. ఆ రఘూత్తముని సత్త్వ సేమమునకు వచ్చు, [illegible] జనకులు పల్లవింప
గరికరాహతి విఱిగిన చెఱకు వోలె, ఘనరవంబునఁ దచ్చరాసనము విఱిగె

ఈ పద్యపు ఎత్తుగడలోనే శ్రీరాముని శౌర్యము ప్రకటితము.

అయోధ్య కాండలో సీతాదేవి అనసూయాదేవికి తన వివాహము వర్ణించునపుడు

సీ॥ అఖిల జగంబుల కాధారమైనట్టి, కనకాద్రి చందానఁ గ్రాలు దాని
యాగ సంతుష్టుఁడై యనుపమ కరుణతో, నబ్ధినాయకుఁ డిచ్చినట్టి దాని
మానవేంద్రులు కలలోనైన గుణ మెక్కు,పెట్టఁ జింతింప లే నట్టిదాని
ననుదినంబును గుసుమాదికంబుల చేత, నతిభక్తిఁ బూజితం బైన దాని

తే॥ మఱియు బహుకాలమున నుండి మందిరమున, నలరుదాని మాహేశ్వరంబైన దానిఁ
జాపము నొకటిఁ దెప్పించి సంభ్రమమున, నృపుల నందఱ రావించి యిట్టులనియె
(అయో – 2238)

అను సీస పద్యమున విల్లు కొండలతో పోల్చబడినది. శివధనుర్భంగము (సీతా స్వయంవరము) నందు మందసమును ఐదువేల మంది తెచ్చుటను వర్ణింపుచు మందసమును

సీ॥ కమనీయ సుమనః ప్రకాండ సంకీర్ణమై, కనకాచలము భంగిఁ దనరు దాని
నగరాజ నందినీ నాధాంకయుక్తమై, యలరజతాద్రియ ట్లలరు దానిఁ
జటుల వేగోద్ధత చక్ర సందీప్తమై యుదయాచలము మాడ్కి నొప్పుదాని
ననదృశ శ్రీ గంధరసఘుమంఘుమితమై, గంధమాదన మట్ల గ్రాలు దాని

తే॥ ననుపమాయస నిర్మితంబైన దాని, మహిత గతి నొప్పుదాని నా మందసమును
గాంచి కడుదీర్ఘ దేహులై క్రాలునమిత, బలులఁ బంచ సహస్ర వీరులను బంచి (బాల–1195)

అని కొండలతో వర్ణింపబడినది సీస పద్యములో

అట్టి ధనస్సును భంగము చేయుట ఒక తేటగీతిలో వర్ణింపబడినది.

'పల్లవింప' పద ప్రయోగము వలన సీతారాముల కళ్యాణము దుష్ట శిక్షణకు నాంది అని సంతోషమును వ్యక్తము చేయుచున్నది. ఇంతకాలము ఎవ్వరును సాధింపలేని కార్యమును శ్రీరాముడు సాధించుట, జనకుడు వీర్యశుల్క అని చేసిన ప్రతిజ్ఞ సఫలీకృతమగుట 'పల్లవింప' యొక్క ధ్వని. 1887, 1894 ప్రతులలో పల్లవింపనే ఉన్నది. దీనిని తీసివేసి వావిళ్ళవారు పల్లటిల్ల చేసినారు.

కరికరాహతి విఱిగిన చెఱకు వోలె అనునది ఎంత అవలీలగా విరిచినది ధ్వనించుచున్నది. ముందు పర్వతములతో పోల్చిన విల్లు శ్రీరాముని చేతిలోచెఱుకుగా వర్ణించుట, చెఱుకు మన్మధుని విల్లు కనుక శృంగార రసము ధ్వనించుచున్నది. సీత వీర్యశుల్క కావున వీర, శృంగారము లిందు ధ్వని.

పోతన మాధుర్యము

సీ॥ డెందాన నెప్పుడు సౌందర్య నిధియైన, కువలయేశుని పొందు గోరుచుండుఁ
బలుకుల నెప్పుడు భానువంశాంబోధి, చంద్రుని నామంబు సంస్మరింతుఁ
గన్నుల నెప్పుడు కాకుత్స్థతిలకుని, సుందర రూపంబుఁ జూడఁ దలఁతు
వీనుల నెప్పుడు వీరసమ్మతుఁడైన, విభుని మంగళకథల్ వినఁదలంతు

తే.గీ॥ నన్యమేమి యెఱుంగక యనవరతము, తత్సమర్పిత చిత్తనై తనరు నాకుఁ
గాంతుని శుభ స్వరూపంబు గానఁబడక భయద కపిరూప మేల చూపట్టె నకట !

(గో.రా-సుం-703)

పరిశీలనా ముగింపు

నన్నయ, తిక్కన, పోతన వేంకటకవుల కావ్యముల నుండి మొదటి పద్యములు, ఇష్ట దేవతాస్తుతులు, కవిస్తుతులు, స్వప్న వృత్తాంతములు, షష్ఠ్యంతములు, ఆశ్వాసారంభ పద్యములు, ఆశ్వాసాంత పద్యములు మొదలగు విషయముల నన్నింటిని కూలంకషముగ పరిశీలించి వారు అన్ని విషయములలో ఒక క్రమపద్ధతి, పరంపరాభివృద్ధి గమనించి ఒకే అక్షరుడు రచించిన రూపాంతర మార్పులుగా ఉండవచ్చునని గమనించితిమి.

గోపినాధ వేంకటకవిని ప్రాచీన మహా కవుల కోవకు చెందిన వారిలో కడపటి వానిగా వర్ణించినందున సంస్కృత, తెలుగు మహాకవులపై వేంకటకవి వెలిబుచ్చిన ప్రత్యేకతను గమనింతము.

శృంగారాది రస పోషితయు, నానాలంకార భూషితయునగు కవితాకన్యకు జనకుండైన వాల్మీకి మునివరున కభివందనంబులు గావించి లోకహితార్థం బష్టాదశ పురాణంబులును నానావిధేతి హాసంబులును బంచమ వేదంబైన శ్రీ మహాభారతంబును బ్రహ్మసూత్రంబులును నిర్మించిన సుజనమానసదేయు సాత్యవతేయుం బ్రస్తుతించి విరించనుం డతిప్రయత్నంబున భువన త్రయంబు నిర్మించు కైవడి బాలబోధార్థంబు మృదు మధుర శబ్దార్థ సంచితంబైన కావ్య త్రయంబు రచించిన యనంతవిద్యా విలాసుఁ గాళిదాసుం కొనియాడి నానా విధగద్య పద్యాత్మక ప్రబంధరచనా దక్షులైన దండి, భవభూతి, మాఘు, మయూర బాణ, భారవి ప్రముఖుల నభినందించి యాంధ్రభాషా ప్రబంధ నిర్మాణ చతురులగు వారికెల్లఁ ప్రథమా చార్యుండైన నన్నపార్యుం ప్రశంసించి భారత పురాణ కౌశలీ విరాజి తిక్కన సోమయాజి నభినుతించి సకల వేదాంతసార సంగ్రహం బైన శ్రీ మహాభాగవత పురాణంబు నంధ్ర భాష

రచించిన సహజపాండిత్యుండైన పోతనామాత్యు నారాధించి యుభయ భాషా కావ్యరచనా చమత్కార తిరస్కృత గురుకవియైన, శ్రీ నాథ భట్ట సుకవిం బ్రస్తుతించి యంధ్రభాషా శబ్ద ప్రపంచ ప్రకాశన భాస్కరుండైన భాస్కరు వినుతించి చతుర్విధకవితానిర్వహణచాతురీవిశేషాభిరాముండైన సోమునిం గీర్తించి బహువిధ సంస్కృతాంధ్ర ప్రబంధ రచనా చాతుర్య ధుర్యులైన వర్తమాన కవివర్యులకు విధేయుండనై

పై విశ్లేషణ పరిశీలించిన వేంకటకవి వివిధకవులకు వాడిన విశేషణములలో, వారి వారి ప్రత్యేకతను చెప్పినట్లును, పోతన పట్ల వారికి అత్యంత గౌరవమున్నట్లును గమనింపగలము.

తన కవిత్వము నన్నయాదుల కంటె అల్పమైనను శ్రీ కృష్ణ కథావిలాసము కనుక అతి పవిత్రమై సకల జనముల చేత, జహ్నుమహాముని నుండి వచ్చిన గంగవలె, కొనియాడ బడునని తన ఆత్మవిశ్వాసమును శ్రీకృష్ణజన్మఖండమున ప్రకటించినాడు. చూడుడు.

'మత్కవిత్వంబు నన్నపార్యాదుల కవిత్వంబుకంటె నల్పంబైనను శ్రీకృష్ణ కథావిలాస బహుళం బగుట వలన నతిపవిత్రంబై సకలజనంబులచేతం గొనియాడబడి యుండునది యెట్లనిన

సీ॥ గంగాజలంబు పంకజ గర్భకుండిక, యందుండి మొదల మహాప్రవాహ
రూపమై వెడలి స్వర్లోకంబునం దట్లు, ప్రవహించి పదపడి భవుని శిరముఁ
జేరి యచ్చటనుండి చెలువొప్పగాఁ బెక్కు, ముఖముల బహుదేశములకుఁ బాఱె
నందులో నొకకొంత యల జహ్నుమునిచే వి, పీతమై గ్రమ్మఱ వెల్వరింప
బడి మొదటి కంటె మిక్కిలి స్వల్పమయ్యు, హరిపదాంభోజ సంభవమగుటఁ జేసి
చాల పరిశుద్ధమై సర్వజనములకును, సేవ్యమై ధాత్రిలోఁ బ్రకాశింప లేదె

రామాయణములోని కొన్ని పోతనను తలపించు పద్యములను పరిశీలింతము.

సీ॥ వెడఁద కన్నులవాఁడు విపులాంసములవాఁడు, రాకేందుబింబవక్త్రంబువాఁడు
కంబు కంఠమువాఁడు ఘన లలాటమువాఁడు, రమణీయ మృదుకపోలములవాఁడు
పీనవక్షమువాఁడు పృథునితంబమువాఁడు, సముదగ్ర చారు మస్తకమువాఁడు
దివ్య దేహము వాఁడు దీర్ఘ బాహుల వాఁడు, కమనీయ శుభలక్షణముల వాఁడు
తే॥ ప్రబల చాపంబు మూఁపునఁ బరఁగువాఁడు, శ్యామ వర్ణంబువాఁడు ప్రశస్త గూఢ
జత్రు దేశంబు గలవాఁడు సమవిభక్త, సముచిత మనోజ్ఞ సుందరాంగముల వాఁడు (బాల–77)

క॥ దిక్కెవ్వడు దుర్బలులకు, దిక్కెవ్వఁ డనాథులకు నధీర జనులకు
దిక్కెవ్వఁ డట్టి నాథుం, డొక్కట నే డెందు బోవుచున్నా డకటా (అయో – 875)

శా॥ రామక్ష్మావిభుఁ డబ్ధి దాఁటి రయమారన్ వచ్చునో రాడో దో
స్సామర్థ్యంబున దైత్యు నాజి సుర లెంచం ద్రుంచునో ద్రుంపడో

వామాంకంబునఁజేరి నన్నుఁ గొని పోవం జూచునో జూడడో
నా మీదం గృప గల్గునో గలుగదో నా భాగ్య మెట్లున్నదో (సుం –624)

మ॥ కలయో దైత్యుని మాయయో హృదయవై కల్యోత్థమో నిక్కమో
తెలియన్నేరక యున్నదాననో ధరిత్రీ పుత్రినో కానో కే
వల భక్తిన్ బ్లవగుండు నాదువిభునిన్ వర్ణింపుచున్ ధీనము
జ్జ్వలుఁడై యుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగన్ (సుం – 702)

శా॥ అన్నా రాముడు భక్తవత్సలుడు సువ్యక్తప్రతాపుండు తా
నన్నుం గానక దుఃఖశోకముల సంతాపించుచున్ డస్సి యా
పన్నుండై రవినందనుండు ధృతి తెల్పన్ మాల్యవంతంబుపై
నున్నాఁడా కుశలంబుతోడ నను జన్మోపేతుడై మారుతీ (సుం – 841)

శ్రీ కృష్ణ జన్మఖండములోని కొన్ని ఆధ్యాత్మిక బోధనలను చూడుడు.

సీ॥ అబ్జాక్షి ఫలమున కాధారమగుఁ బువ్వు, పువ్వు కాధారమై పొల్చుఁ జిగురు
చిగురు కాధారమై చెల్వొందు కొమ్మయు, నలకొమ్మ కాధారమగునుఁ జెట్టు
చెట్టు కాధారమై చెన్నారు నంకుర, మంకు రాధారమై యలరు బీజ
మవని బీజాధారమై యొప్పు నవనికి, దలపోయ శేషుఁడాధార మగును

తే॥ మిగుల శేషున కాధారమగును గూర్మ, మరయ దానికి నాధారమగు సమీర
మా సమీరున కాధారమగుదు నేను, నాకు నాధార మగు దీవు నలిన నేత్రి (శ్రీ కృ.జ.–1 ఆ)

సీ॥ పాదపముల యందు ఫలముల పగిది నే, నఖిల భూతములయం దధివసింతు
ఫలములయందు బీజములుఁబోలె నిత్యంబు,నఖిల భూతములు నాయందె యుండుఁ
గడగి సర్వమునకుఁ గారణుఁడను నేను, రహి నాకు నెద్ది కారణము లేదు.
వినుతింపఁ గార్య కారణము లేనగుదును, సర్వేశ్వరుండును సర్వ బీజుఁ

తే॥ డనుచు నను కొనియాడు దురఖిల విదులు, మొనసి మామక మాయా విమోహితాత్ము
లైన జనములు ననుఁ దెలియంగ లేక, మోహసంసార వార్ధిలో మునిగి యుంద్రు.(శ్రీ కృ–5ఆ)

శ్రీ కృష్ణ జన్మ ఖండములోని క్రింది పద్యములువినగనే అవి పోతనవని భ్రమింతుము.

తే॥ గీ॥ నీవే మా కుల దైవం, బీవే మా కిష్టదైవ మీశ్వర ! జగముల్
వావిరి సృజింపఁ గరుణం, గావగ నణగింప నీవె కర్తవు దలపన్ (శ్రీ కృ.జ – 3ఆ)

క॥ హరి నీ మంగళనామము, స్మరించి గావించి నట్టి సత్కార్మమున
స్గర మెద్ది హీనమైనను, బరి పూర్ణంబై దనర్చు బద్మదళాక్షా (శ్రీ.కృ.జ –3 ఆ)

తే॥ ఉన్నవాఁడను వారల కున్నవాఁడు, లేనివాఁడను వారికి లేనివాఁడు
యోగియును యోగమయుడును యోగివర్యు,డెలమి నా మది నెప్పుడు వెలయుగాక (3 ఆ)

కI తన నామమె పరియింపుచు, దనరూపం బాత్మలోనఁ దలపుచు దన్నుఁ
ఘన భక్తిఁ గొలుచు నాతఁడు, వనజాక్షునకుం బ్రియుండు వసుమతిలోనన్ ( శ్రీ.కృ.జ–3ఆ)
కI తన సద్గుణ నామంబులు, వినినంతనె మాధవుండు వేడుక తోడన్
దిన భక్తుని వెంటఁ గృపం, జనుచుండు నిరంతరంబు ఛాయ విధమునన్ ( శ్రీ.కృ.జ–3 ఆ)
కI తారకల నెన్నవచ్చును, భూరజము గణింపవచ్చుఁ బొలుపొందగ నా
శ్రీ రమణు నామ మహిమలు, వారక గణింపలేరు పండితులైనన్ ( శ్రీ.కృ.జ–2 ఆ)
ఉI గట్టితనంబునన్ మదిని గానక బాలకుఁడంచుఁ గృష్ణునిం
బట్టదలంచి వెఱ్ఱియయి నందుని గేహిని యేగె గాక యే
పట్టున శంకరాది సురవర్యులు యోగి వరేణ్యు లాత్మలో
బట్టగ లేని బ్రహ్మమును బట్టగ శక్యమె యవ్వేలందికిన్ ( శ్రీ.కృ.జ –2 ఆ 7)

ఇక అంత్య ప్రాసలుకు రెండు పద్యములు చూతము

కI గర్గుడు సతతారాధిత, భర్గుడు దూరీ కృతారి వర్గుఁడు ముని
సర్గుడు కలిత శ్రేయో, మార్గుడు చనుదెంచె నందమందిరమునకున్ ( శ్రీ.కృ.జ.4–ఆ)
కI రామా జనకామా రణ భీమా సుగుణాభిరామ విమద విరామా
రామా వనదశ్యామా, కామిని నగు నన్ను బ్రీతిఁ గైకొను మిచటన్ ( శ్రీ.కృ.జ. –5–ఆ)

వేంకటకవి రచనలో తిక్కన పోలికలు

ఇక తిక్కనను తలిపించు పద్యములను వేంకటకవి రామాయణమునుండి పరికింతము.

శాI ఎంతో గౌరవ మింతయయ్యె నయిన న్నేమాయెఁ గానిమ్ము మా
కింతే చాలు గొఱంత యేమి పను లింకేరీతిచే నైన నా
క్కింతైనం దుది ముట్టదే పలుకు లింకేలా మృషావాదివై
సంతోషంబున నుండు మీవు సుఖియై క్ష్మానాథ యేఁబోయెదన్ (బాల – 489)
తేI విన్న మొన్నటి వాఁడె యీ చిన్నకుఱ్ఱ, డకట రాఘవుఁడేడ యసురు లేడ
సమరమున వారి నీతఁడు సంపుటేడ, యింత చింతింపవలదె మీరేమి చెప్ప (బాల – 475)
కI రొదసేయుచు సుడి దిఱుగుచు, నెదురేఁగుచు గగనమునకు నెగయుచు వడితోఁ
బదపడి ధరపై వ్రాలుచు, ముదమునఁ జనుదెంచె గంగ భూపతి వెంటన్ (బాల– 856)
ఉI పాడిమితో విదేహపతి పుత్రికనై యజరాజ సూతికిం
గోడలినై జగజ్జన మనోహరు రామునిఁ జెట్టఁ బట్టి నే
డాడిక కిట్లు పాల్పడితి నం చల జానకి యేడ్వఁబోలు నీ
జాడనె యంతనంతఁ గనుపట్టెఁ దదంజన మిశ్రితా శ్రువుల్ (అయో – 1696)
శాI అస్మద్ఘోరకర ప్రముక్త పటు శస్త్రాస్త్రమ్ము లొక్కుమ్మడి
న్విస్మేరావహ భంగిఁ దాఁకి తనువు న్భేదింపఁగా దారుణా

ప స్మారంబున భీరము న్విడిచి తద్బాణానల జ్వాలలన్
భస్మీ భూతుడు వయ్యె దీవు విను మీ ప్రాగల్భ్య మింకేటికిన్ (అర - 335)

ఉ॥ పూనికి దేహికిం బుడమిఁ బుట్టిన యప్పుడె చావు నిక్కమౌ
మానికి వారిబుద్బుధ సమం బగు గాయమునందుఁ జూడ నె
వ్వానికి నేమిశోకమగు వర్ణితతత్త్వ వివేకులైన సు
జ్ఞానకు లొల్ల జన్మ మరణంబులకుం దలఁకొంద రెంతయున్ (కిష్కింధ - 546)

శా॥ ధీరోదాత్త గుణోత్తరుండు విజయ స్థేమాభిరాముండు దు
ర్వారోదగ్ర పటుప్రతాపుఁడు రిపుప్రాణాంతకాపాది దో
స్సారోదారుఁడు భూరి శౌర్యుఁడు రఘుక్ష్మానాదుఁడా ధీవరుం
డీ రక్షః పతి నాజి గీటణఁచు దేవి చింత నీ కేటికిన్ (సుం - 951)

మ॥ జనకోర్వీపతిపుత్రివై దశరదక్ష్మానాద వంశాబ్ద చం
ద్రునకుం గోడలివై జగన్నుతగుణాఢ్యున్ రామునిం బ్రాణ నా
ధునిగా (జేకొని పుణ్య సాధ్వియన నెంతోఖ్యాతి వాటించి యా
ఘనునిన్ రామునిఁ బాసి దిక్కఱి మనంగా నేర్తునే యిచ్చటన్ (సుం - 614)

చ॥ అనవిని భూమిపుత్రి హృదయంబున నిండిన రాగపూర మ
ల్లన వెల్లి కుబ్బి పాఱిన తెఱంగున గన్నుల హర్షబాష్పముల్
చినుకఁగ సారె సారెకు హరిప్రవరుం గను గొంచు రామ భ
ర్తను మదిలో దలంచి యనురాగము తేటపడంగ నిట్లనున్ (సుం - 1236)

శా॥ పాతాళంబున కేగినన్ సురగిరి ప్రాంతంబునన్ డాఁగినన్
ద్రాతం గానక మిన్ను ప్రాఁకినఁ బయోరాశిం ప్రవేశించిన
న్సీత న్మ్రుచ్చిలి నట్టి రావణుని దుశ్చిత్తున్ విదారింప కే
ఖ్యాతిన్ వెండి యయోధ్యకుం జొరమి నిక్కం బింత దైత్యోత్తమా (యుద్ధ - 394)

చ॥ గగనమునన్ జనించి లయకాలమునాఁటి రయంబుఁ దాల్చి చం
డగతిఁ బ్రభంజనుండు వికటస్ఫుట దారుణ పాంసుయుక్తుఁడై
నగములఁ గూల్చి మేఘముల నల్దెసలం బడఁ బాఱద్రోలి పొం
దుగ గిరి శృంగముల్ విఱుగఁ ద్రోచి రహిన్ విహరించె నుద్ధతిన్. (యుద్ధ - 461)

తిక్కన వలె అనేక క్రియలు ఒకే పద్యము నందు ప్రయోగించు గుణము వేంకట కవిలో కలదనుటకు ఉదాహరణ పద్యములు.

ఆ.వె. ॥ వచ్చి వాకిట నిలచి దౌవారికులను, గాంచి మారొక యాన్నపాగ్రణికిఁ దెలుపు
మనుడు రయమున నొక ఫణిహారుఁడరిగి, నరవరాగ్రణి కొలువున్న నగరు సొచ్చి (చా - 439)

ఆ.వె॥ సంశయించి యిట్లు చనుదెంచితివో జాగు, సేయ వలదు మఱల చెప్పనేల
రయము మీఱ నేగి రాముని రవివంశ, తోయరాశి సోము ( దోడి తెమ్ము (అయో – 389)

ఆ. వె॥ సైపలేక సారె సారెకు భ్రమఁగొని, పలుకుచున్నవాఁడఁ బరమ కృపను
నెగులుఁబాపి నన్ను నిత్యసుఖాత్ముని, గా నొనర్చి యశముగాంచు మదిప (కి –230)

అక్షరరమ్యత గంగా ప్రవాహ కవితాధార వేంకటకవి కవిత చదివిన ప్రతిచోట ప్రత్యక్షము. కనుక ఉదాహరణము లిచ్చుట నివ్వలేదు.

వేంకటకవి జీవితవిశేషములు తెలుపుచు గోపినాఽమూలకొండయ్య వేంకటకవి శ్రీనాథసముడని చెప్పినట్లు వేంకటకవి సంస్మరణ వర్ధంతి సభయందు 9–5–1937 తేదీని కావలిలో శ్రీ. కేసరి సుందర రామశర్మ తెలిపిన విషయము సుబోధిని పత్రికలో ప్రకటింపబడినది. దీనిని బట్టి శ్రీనాథుని వలె సీసపద్యములు రచించి, శ్రీనాథుని వలె మూల గ్రంథమును అనువాద మనిపించ నంత సహజముగ వేంకటకవి చేసినట్లు భావింపవచ్చును.

పై విషయమును ధృవపరచుటకా అనునట్లు కాశిఖండములోని సూర్యోదయ సీస పద్యములను పోలినట్లు శ్రీ మద్రామాయణమున

సీ॥ ప్రాచీముఖంబున వఱలు ముత్యాల చే, ర్చుక్క కైవడి వేగుచుక్క వొడిచె
నరుణోదయ, స్నాతలగు విప్రులను మేలు, కొలుపుచు గల కలఁ బలికెఁగవులు
రతి పరిశ్రాంత నిద్రిత దంపతుల మేని, చెమట లార్చుచు సమీరములు విసరె
భూసురోత్తమ గృహంబుల ఁజెవి కింపుగాఁ, దత సామ గాన శబ్దములు మీఱె (యుద్ధ – 3319)

తే.గీ॥ హిమకరుండైన కువలయా ధీశ్వరుండు, చనుట కల యుగ్రకరుఁడైన చక్రవిభుఁడు
వచ్చుటకుఁజాలఁ జింతించి వన్నెఁ బాసె; ననఁగఁ దారలు గతకాంతులయ్యె నపుడు

సీ॥ గగనకాసారోడు కైరవంబులు గోయఁ, బ్రాచి సాఁచిన హస్త పల్లవంబు
నెఱసిన బలితంపు నిబిడాంధకార, కాంతారసీమకు బృహద్భానుహేతి
ప్రబల విభావరీ ప్రతతి ద్రుంపఁగ సానఁ, బట్టించి యెత్తిన పరశుధార
జలజాత వనవాటికలఁ గల్గు జాడ్యంబు, పరిహసింపంగఁ బాల్పడ్డ మందు

తే॥ పయనములు వేకువం బోవు పథికతతికి, దారిఁజూపెడు తెరువరి దంపతులకుఁ (3320)
బంచశరజన్య విరతిఁబుట్టించు చతురుఁ, డరుణుఁ డుదయించెఁ బ్రాక్పర్వ తాగ్రమందు

సీ॥ గ్రహరాజతురగరింఖాఘుట్ట నోత్థిత, ప్రాక్శైల ధాతుపరాగ మనఁగ
ధరణీసురార్ఘ్యంబు శరలూనమందేహ, దేహోత్థితా సృక్ప్రవాహ మనఁగ
హరిసమాగత హృష్టయై ప్రాచి యురమునఁ, బ్రామిన కాశ్మీరపంక మనఁగ
బూర్వాచలంబుపైఁ బొడమిన చూతవృక్షము, మీఁది చికురాకు కదు మనంగ

తే॥ సమయరజకుండు పూర్వ దిక్సతి కొసఁగ, నాఱఁ బఱచిన చెంగావి చీరె యనఁగ
శక్రపురి కోట కలఁదిన జాజనంగ, నలరెఁ దూర్పున నూనూఁగు మొలక యెండ

సీ॥ ప్రాక్పయోరాశిలోపల నుండి పయికిఁబ్రా, కిన బడబానల కీలలొక్కొ
తోయజాప్తుని తేరుఁదోలు పిచ్చుక కుంటు, పాఱఁదీసిన రశ్మిపటల మొక్కొ
ప్రాగాశ భేదించి పయికుద్గమించిన, ఫణిఫణా మణిఘృణి గణములొక్కొ
తగ నుదయాద్రి నెత్తము మీది పాదిలో, మొలకలెత్తిన కందమోసులొక్కొ

తే.గీ॥ ప్రాఙ్మహీధర పక్ష మూలచ్ఛిదాక్ష, తోద్ధ శోణిత ధారా సమృద్ధులొక్కొ (3322)
యనుచుఁగొనియాడ రవికిరణాంకురములు, పాటల ద్యుతి నొకకొన్ని ప్రాఁకె నభము

సీ॥ ఉస్రంబు లొకకొన్ని యువతుల కొప్పుపైఁ, జెంగల్వ రేకుల రంగు దెలుప
నంశువు లొకకొన్ని యంభోజవనములందుఁ, గా ర్కొన్న నిద్రాంధకార మడఁప,
గిరణంబు లొకకొన్ని తరుషండముల యందుఁ, గెందలిరుల విచికిత్స నొసఁగ
బానువులొక కొన్ని పరమానురక్తిచే, గగనలక్ష్మిని బ్రీతిఁ గౌఁగిలింప

తే.గీ.॥ వైరిమదసంతమ సహేళి వాలి నాజిఁ, దునిమిన రఘుప్రవీరుని దోః ప్రతాప
మంచితంబుగ మూర్తీభవించినట్లు, మిహరమండల ముదయాద్రి మీఁద దోఁచె (3323)

సీ॥ పసఁగు నిగ్గులు దేరఁ బ్రాచి నెన్నొసలుపై, దిద్దిన సిందూర తిలక మనఁగ
దులకించు తొలిసంజ నెలఁత పేరురముపై, భాసిల్లు మాణిక్య పతకమనఁగ
బాకశాసను వీటి పడమటి గోపురాగ్రమునఁ గ్రాలు సువర్ణ కలశమనఁగఁ
బూర్వాబ్ధి జలముఁదేఁ బోయిన హరిమస్త, కము మీది తపనీయ ఘటమనంగ

తే.గీ॥ బంధురార్జిత చక్రతపః ఫలంబు, భూసురకృత నమస్కారములకు బాత్ర
మజహరి పినాకిమూర్తి త్రయాభిరాముఁ, డర్కుఁడల రారెఁ బ్రాగ్ది శాభ్యంతరమున (3324)

చ॥ కనదలివేణి కోకకుచ కంబుశిరోధర హంసయాన ప
ద్మనయన చారుసైకత నితంబ మృణాళ భుజాఢ్య సారస
స్వన మృదునాద సన్మకర జంఘికయై కడు రక్తిఁదాల్చె న
య్యినకరసంగతిం గనుల కింపుగఁ బద్మిని కాననంబునన్ (3325)

సీ॥ మకరందరసపాన మత్తరోలంబ క, దంబంబు మదుర గీతములు పాడఁ
గారండవ క్రౌంచ సారసాది పతత్రి, రాజికూజిత వాద్యరవము లెసఁగ
శరదిందుచంద్రికా స్వచ్ఛ పాండుచ్ఛద, చ్ఛద చామరములు పార్శ్వములఁ జెలఁగ
సూర్య భానుచ్ఛటా స్ఫురితోరు పుండరీ, కమహార్ఘ పుండరీకములు వెలయ

తే॥ నేర్పు మెఱయ సారంగముల్ నృత్యమాడఁ, బ్రమదమునఁ గోకములు బరాబరులు సేయ
నభినవ విచిత్ర సరసీసభాంతరమునఁ, గమల గొలువుండెఁ గెందమ్మి గద్దె మీఁద (3326)

శ్రీరామపట్టాభిషేకమునకు సరసీసభాంతరమున కొలువున్నఁ కమలఃః తద్వారాఁ ప్రకృతి, సౌందర్యము మనోజ్ఞము. ఈ అమూలములైన రచన వేంకటకవి కవితా సౌభాగ్యమును వెల్లడించుచున్నది.

జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి అని శ్రీ సం॥రామాయణమును రచించిన వాల్మీకి తెలుగు వాడని ఒక జనుశ్రుతి. దానిని నిజమని తెలః కా అనునట్లు తెలుగు కావ్య భాషకు సృష్టికర్త వలె నన్నయయై రామాయణ రచన తెల ఏతరింప తలచి యుండ రాజరాజు కోరిక్పై భారత రచన వేదత్రయమూర్తిగ నవతరింతుసి.. ధ్వనించుచు తన రామాయణ కాంక్షను 'హరి హరాజగ జానన' పద్యమున ధ్వనించి తన పునర్జన్మల ద్వారా ఆంధ్ర సాహిత్య పోకడల నన్నిటిని గోపీ నాథ రామాయణమున ప్రతిబింబించెనా అనునట్లు వేంకటకవి వాల్మీకిని ప్రార్థింపగా ప్రత్యక్షమై బ్రహ్మదేవుడు వాల్మీకి కిచ్చిన యోగ విస్ఫురణ శక్తి తన కిచ్చినట్లుచెప్పుకొనెను. బ్రహ్మదేవుని ప్రార్థనలో 'త్రయీసరణిన్' విధి పద ప్రయోగములుచేసి కవిస్తుతిలో 'నన్నయ కవి తిక్కన భాస్కర పోతనాథులన్' అను సమాసమున భాస్కర అనిన ప్రకాశింప అని భావించిన నన్నయ, తిక్కన, పోతనలోకే అక్షరుడని భాసించును. దానినే 'మొదల నన్నపాఖ్య వదన వినిర్గతంబై ప్రబంధ పరమేశ్వరుని కుక్షి ప్రదేశంబున విశ్రమించి తిక్కన యజ్వయందు ప్రవేశించి అని ధ్వనించెను.

అట్లు ధ్వనించి నన్నయ, తిక్కన, పోతనల త్రివేణీ సంగమము వంటిది తన కవిత అని, అది తన కవిత కాదని జహ్నుమహామునితో పోల్చి చెప్పుకొనినట్లు గమనించితిమి.

ఉపసంహారము

సృష్టి సజీవ సృష్టిమయ చేతన సృష్టి. బహుచిత్రము (భగవంతుని సృష్టి బహుచిత్రమైనది. భూమి నీరు, ఆకాశముల యందు పుట్టిన జీవరాసులు అన్నియు తమ స్వేచ్ఛతో చరింపగలవి. జీవరాశిలోని ఇంద్రియములు వాటి క్రియలను, అనుభవములను మరొక కాలమునకు గుర్తుచేయు ముద్రణా (జ్ఞాపక) శక్తి మరియు తగు కాలమునఅనుభవింపగల శక్తి కలవి. అవి కూడ తమవంటి సజీవ సృష్టిని చేయగల జీవరాసులను పుట్టింపగలవి. ఇట్లు చేసి సృష్టి నిరంతరము స్వకీయ సృష్టిగా చేయగలవు). కవిత్వము ధ్వని రంజిత నాద రస శిల్ప సృష్టి (కవిత్వము ధ్వనితో రంజింప చేయుచు నాద సౌందర్యము, రూపకల్పనలతో సహృదయుల మనస్సును రసమయము చేయునవి)

ఆ వసుదాధరంబు ముదమారఁగ మున్నటు పెక్కుమాఱు లి
చ్ఛావిధి దృష్టమైనను బ్రసన్నత శౌరి కపూర్వ విస్మయం

గోపీనాథ వేంకటకవి పూర్వకవి పరంపర

బాపహిలంగ( జెసె. ప్రతియాసుము నందు నవత్వమొందుటే
వావిరి రామణీయ గుణ వైభవ యుక్తికి లక్షణం బిలన్ (శిఖ 1 – 325)

మ॥ జనితానందిత తాళ వృత్త గతులన్ సంగీత సాహిత్యముల్
స్తనయుగ్మంబయి రాగముల్ కళలు విద్యాప్రౌఢి దీపింప సా
రనితాంత శ్రుతి పర్ణ రూప కలనన్ రాజిల్లు వాగ్దేవి మ
నన్న నెల్లప్పుడు నాదు నాలుకపయిన్ నాట్యంబు గావించుతన్ (శ్రీ రాధి. ప –7)

అక్షర రమ్యత కలిగిన పద్యములు చదువగా చదువగా ఒక్కొక్క పర్యాయ మొక్కొక్క భావమును కలుగ జేసి సహృదయుడైన చదువరికి అపూర్వ విస్మయము కలుగజేసి రమణీయత నొందును.

స్వరములు ఏడే అయినా ఆ స్వరములతో ఏర్పడిన సంగీత ప్రవాహ మనంతము. ఇక అనేక అక్షరములతో ఏర్పరుపబడిన సాహిత్య ప్రపంచము యొక్క వైశాల్యత అనూహ్యము అంటాడు మాఘుకవి.

ప్రపంచ సాహిత్యములో పెద్ద వాటిలో మొదటిది, రెండవదిగా పేరుపొందని భారత, రామాయణములు సమగ్రమున దిగినది తెలుగు భాషలోనే. అట్టి సాహిత్య సృష్టి తెలుగుననే ప్రతిబింబించియుండుట 'జననీ జన్మ భూమిశ్చ' స్వర్గాదపి గరీయసి' అని తెలిపిన వాల్మీకి వలన పునర్జనల కృషి అని తలంచుట కాస్పదము. దీనికి కొండవీటి వేంకటకవి 'గోపీనాధ రామాయణ సమీక్ష, అను శీర్షికను ఈనాడు ఆదివారం 22, జనవరి 1989లోని క్రింది వాక్యములు బలము నిచ్చుచున్నవి.

"ఆదికవి యైన వాల్మీకి మహర్షి ఆటవికుడు అవడం చేతఅచ్చమైన ఆంధ్రుడే అనడం నిర్వివాదాంశం. దీని కుపోద్బలకంగా తెలుగు వ్యాకరణ గ్రంథ కర్తల్లో వాల్మీకుల వారు ముఖ్యాతి ముఖ్యులని పెద్దలైన వైయాకరణులు నిర్ధారించారు. తెలుగు భాషలోని తియ్యదనం సహజంగా అతని మేను మేనుల్లో జీర్ణించుకపోయింది. అందువల్లనే సంస్కృతంలో కూడ నాటికి నేటికి అంత సుళువుగా మృదుమధురంగా గంభీరంగా అర్థయుక్తంగా కవిత లల్లడం కానరాదు. ఈ వాల్మీకి రామాయణం తరువాత సంస్కృతంలో రామాయణా లెన్నో పుట్టాయి. కాని వాల్మీకి రామాయణానికున్న గొప్పదనం దేనికి రాలేదు.

ప్రప్రథమంగా ఆంధ్రకవుల చరిత్ర అందించిన శ్రీ కందుకూరి వీరేశలింగం గారు తమ కవుల చరిత్ర మూడో భాగంలో "మూలగ్రంథంలో నున్నదాని కంటె నెక్కువ కాని తక్కువకాని లేకుండునట్లు సరిగా వాల్మీకి రామాయణ మంతయు నితడు పద్య కావ్యముగా జేసెను. అని

స్ఫుటీకరించెను. తెలుగునాడులో ప్రచలితమైనది మొల్లరామాయణం. ఆ మీదట వాకొన దగినది గోపీనాధ రామాయణం. మూలంలో లేని కుల, మత ద్వేషాలు వాల్మీకి కంటగట్టిన వ్యాఖ్యాతలైన గోవింద రాజాదుల వలె గాక ఈ గోపీనాధ వేంకట కవి కేవలం వాల్మీకి హృదయాన్నే ఆవిష్కరింప చేసి ధర్మమార్గాను వర్తులయ్యారు"

ఆదిత్య హృదయము పారాయణ యోగ్యముగ గోపీనాధ రామాయణమున ఉండుట, గరీయసి పదము తెలుగు కావ్యములన్నిటికంటె ఎక్కువగా వాడుట, వాల్మీకి శ్లోకముల నన్నిటిని తెలుగు చేయుట, వాల్మీకి పదములను తెలుగులో అనేకములు వాడుట వలన తన రామాయణమును, తన భాషలో తన జన్మ పరంపరలో పరివర్తించిన భారత, భాగవత, రామాయణములు ముద్రణ ప్రారంభమైన కాలములో తన కావ్యములను చూచుకొనుటకు కాలము వేంకట కవి రూపమున పుట్టించినదేమో అని నా అల్పమతికి తోచుచున్నది.

గోపినాధరామాయణ ప్రత్యేకతలుగా ఈ విషయములను గమనింపవచ్చును.

1. నన్నయ, తిక్కన, పోతనల తెలుగు సంప్రదాయమును పాటించుట.2. వాల్మీకి హృదయావిష్కరణకర్తలైన వ్యాఖ్యాతలలోని వాల్మీకి హృదయమును బహిర్గత పరచు విషయములను మత భేదము లేక గుణములైన వాటిని స్వీకరించుట. 3. వాల్మీకి హృయావిష్కర్తగ నున్న భాస్కరాది తెలుగు కవుల విషయమును స్వీకరించుట. 4. పాత్రలను పరిచయము చేయుటలో ప్రబంధ రీతిలోని పాత్రలను పరిచయము చేయుట. 5. మూలమున కుశలవులు రామకథను పాడుచున్నట్లు చెప్పి, కాండ అంత్య, ప్రారంభములందు కాని, యుద్ధకాండాంతమందు కాని దాని ప్రస్తావన లేదు. వేంకటకవి ఈ విషయమున శ్రద్ధ తీసికొనినట్లు గమనింపవచ్చును. వీటిని ఉదాహరణముల ద్వార పరికింతము.

శ్రీరాముని జనన వివరములలో మూల రామాయణమున బుధవారము లేదు. చూడుడు.

తతశ్చ ద్వాదసే మాసే చైత్రే నావమికే తిథౌ (18–8)
నక్షత్రే దితి దైవత్యే స్వోచ్ఛ సంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ (18–9)
దాని తెలుగు చేత
మేటిగఁ జైత్రశుద్ధనవమీ బుధవార పునర్వసూడు క
ర్కాటక లగ్నమందు గురురాజులు నొక్కటఁగూడి సర్వ స
య్యాటముతో శుభగ్రహము లైదు సముచ్ఛగతిం జరింప నా
ఖేటవిభుండు మింట నడుఁకేవ సముజ్జ్వలుఁడై వెలుంగగన్

శ్రీ రామచంద్రుని గుణములు పట్టాభిషేకము చేసెద నన్నను, అడవికి పొమ్మనినను ముఖ తేజస్సు తగ్గక సంతోషముగ వెళ్ళుట. అట్టి శ్రీరాముని గుణములన్నియు బుధగ్రహ

జనన లక్షణము. ఇది శాస్త్ర సిద్ధము. కావుననే భాస్కర రామాయణ కర్త వాల్మీకి చెప్పక పోయినను హృదయాను సారముగ గ్రహించినాడు. ఇది సంస్కార పరము కనుక వేంకటకవి గుణ గ్రహణము చేసినాడు. అట్లే సీతారాముల కళ్యాణానంతరము పరశురాము డెదురొచ్చుటకు ముందు దుశ్శకునములు వచ్చినవి. అప్పుడు వశిష్టాదులు 'భయ నివారక మంత్రము లుచ్చరించి' రని భాస్కర కర్త వ్రాసిన విషయము కూడ మూలమున లేకున్నను యిది సహజ స్థితి. వాల్మీకి హృదయానుగుణము కనుక నివి గ్రహించినాడు. పూర్వ కవులపై నిది గౌరవము సూచించును.

శివధనుర్భంగము కాగానే జనకుడు దశరథునికి 'కుమార భద్రమును, భర్గధనుర్దళనంబు, వీర్యశుల్కను ముదమూర నిచ్చుటయు, కౌశికు రాకయు తెల్పి పెండ్లికై పిలుపు పంపును. జనకుని మంత్రులు వచ్చునప్పటికి దశరథుడు 'కొడుకులపై నొకింత కూర్మి' తలపోయుచున్నట్లు వేంకటకవి భాస్కరాదులు కాని, మూలమున కాని, చెప్పక పోయినను రచించెను. ఇది వాల్మీకి హృదయము

ఇంద్రజిత్తు అభిమంత్రించి నాగాస్త్రము వేయగా శ్రీరామలక్ష్మణులు నాగపాశబద్ధులగుదురు. కొంత తడవునకు శ్రీరాముడు స్పృహలోనికి వచ్చును. లక్ష్మణుని చూచి దుఃఖించును. అప్పుడు గరుత్మంతుడు యాదృచ్ఛికముగ వచ్చి లక్ష్మణునికి విముక్తి కలిగించినట్లు వాల్మీకిమూలమున కలదు. భాస్కర, రంగనాథ రామాయణకర్తలు నారదుడు వచ్చి గరుత్మంతుని స్మరింపమని శ్రీరామునికి చెప్పినట్లు వ్రాసిరి.

కాని గోపీనాథ రామాయణములో వాయుదేవుడు వచ్చి గరుత్మంతుని స్మరింపమని చెప్పినట్లున్నది. వాయుదేవుడు శరీరాంతర్వర్తి, జగత్ప్రాణుడు. కనుక రామునికి స్ఫురణకు వచ్చినట్లు ధ్వని సూచన. ఇది వాల్మీకి హృదయావిష్కరణము.

విశ్వామిత్రుని పాత్రను రామాయణమున ప్రథమముగా ప్రవేశపెట్టునప్పుడు మూలమున లేకున్నను ప్రబంధ పద్ధతి వలె (గో.రా. – బాల–438)

సీ॥ అలవసిష్ఠుని తోడఁ గలహించి యెవ్వాడు, సదమల బ్రహ్మర్షి పదము వడసె
సురలపై నలిగి భూవరునకై యెవ్వాడు, ప్రతినాక మొనరించె వితత మహిమ
ఘనతపంబునకు విఘ్నము సేయ వచ్చిన, రంభ నెవ్వడు దిట్టె రాయిగాఁగఁ
బరఁగ నెవ్వఁడు యాగపశువుగాఁ గొనిపోవు, ద్విజపుత్రు బ్రతికించె విపులకరుణ

తే. నట్టి తాపసకుల వర్యుఁ డమితతేజుఁ, డంబురుహ గర్భసముఁడు మహామహుండు
గాధినందనుఁ డమ్మ హీకాంతుఁ జూడ, నక్కజంబుగఁ జనుదెంచె నొక్కనాఁడు

గతే ష్వథ నృపో భూయః పౌరేషు సహ మంత్రిభి :

మంత్ర యిత్వా తత శ్చక్రే నిశ్చయజ్ఞ స్స నిశ్చయమ్ (అయోధ్య 4-1)

అను శ్లోకమును మంత్రబలము కలదో అనునట్లు అయోధ్యకాండ 108వ పద్యముగ

కం॥ అట దశరథ రజనీ, విటుఁడు ప్రదాన యుతుఁడగుచు వెండియు హర్షో

త్కటమున మంత్రం బొనరిచి, పటుమతి నిశ్చయముఁజేసి పదపడి పలికెన్

రచించెను. ఇందు ప్రధాన యుతుడగుచు; బొనరిచి, పటుమతి చదువునపుడు వేంకటకవి తన రచనాధారను త్యాగము చేసి కుంటి నడకతో పట్టాభిషేక విఘ్నమును ధ్వనించినాడు. అందుకనే నృప శబ్దమునకు దశరథ రజనీ విటుఁడనినాడు.

కావ్యమునందు పలుచోట్ల దైవతంత్రమును కైకేయీ, రావణ మాటల ద్వారా ధ్వనించినాడు. రావణుడు కడసారి యుద్ధమునకు పోవునపుడు చెప్పు మాటలలో కూడ తన వైరము మరుజన్మకు వెంటగొనిపోవుచున్నా నన్నట్లు ధ్వనించినాడు.

అగస్త్యుని ఆశ్రమము పోవు సందర్భమున ఈ అమూలకమైన పద్యము ద్వారా అగస్త్య ప్రభావమును వర్ణించుటచూడవచ్చును.

చ॥ కమల ప్రభుండగు నగస్త్య మహాముని నాదు పావనా

శ్రమ మిదె రమ్మటంచు విలస త్కిసలాంగుళి సాలహస్తముల్

క్రమమున నెత్తి యున్మద ఖగధ్వనులున్ ననుఁ బల్చుచున్న చం

దమునం జెలంగుచున్నయవి తమ్ముడ ! కంటె విశాల సాలముల్

విశాలసాలముల్ తీసివేసి వావిళ్ళవారు 'యివ్వనావళుల్' అని మార్చిరి.

సంపాతి, జటాయువు పందెము వేసుకొని సూర్యుని తాకుటకు వెళ్ళిరి. అప్పుడు పై నుండి క్రిందికి చూడగా భూమి, వింధ్యాదిపర్వతములు, అడవులు, నదులు కనబడిన తీరును వాల్మీకి ఇట్లు వర్ణించినాడు.

ఆవా మాలోయయావ స్తద్వనం శద్వల సన్నిభమ్

ఉపలైరివ సంఛన్నా దృశ్యతే భూః శిలోచ్చయైః

ఆపగాభిశ్చ సంవీతా సూత్రైరివ వసుంధరా

హిమవాంశ్చైవ విందశ్చ మేరుశ్చ సుమహోన్నగః

భూతలే సంప్రకాశంతే నాగా ఇవ జలాశయే (కిష్కింధ 61, 7,8,9)

సీ॥ మరలిచూడఁగ దోఁచె మాకు శతాంగర, థాంగ ప్రమాణంబులై పురములు

శిఖరి సంఛన్నయై చిదుపజాల్ పఱచిన, చేనికైవడి భూమి గాననయ్యె

మడుగులోఁ జిక్కిన మాతంగముల మాడ్కి, వింధ్యాది కులశైల వితతులొప్పెఁ
జంపకారణ్యాది సకల కాంతారముల్, పచ్చిక తిన్నెల పగిదిఁ దోఁచె

తే॥ జేరుగల నదులన్నియు వేఱ వేఱ, ముత్తియపుఁ బేర్ల చందాన మొనయుచుండె
శరదు లద్దపు బిళ్లల కరణి నలరెఁ, బాదపము లెవ్వియు గనుపట్టవయ్యె (కిష్కి-1290)

ఈ శ్లోకమునకు భాస్కర రామాయణమున ఇట్లు ఉన్నది.

క॥ పురములు రథ చక్రంబుల, కరణిన్ గిరు లుాళ్ల పగిది ఘననదులు వసుం
ధర హంసగణముల గతిన్, ధరగల కులగిరులు సౌధ తతి గతిఁ దోపన్

వాల్మీకి వదలిన పుర, సాగర, పాదపములను వర్ణించి వేంకటకవి భావపూర్ణత చేకూర్చినాడు. ఇందు పురవర్ణనము భాస్కర రామాయణ కర్తనుండి గ్రహించినట్లు తెలియగలదు.

వాల్మీకి 'సూత్రైరివ' అనిన నదులను ముత్తియపు పేర్లని వేఱ వేఱ అని నదిపాయలను కూడ వర్ణించి పదమునకు సొగసు చేకూర్చినాడు. సముద్రములు అద్దపుబిళ్లలనుట భావగర్భితము, తెలుగు తనము కానవచ్చుచున్నది.

వాల్మీకి శరదృతు వర్ణనమున కొండను ఒకశ్లోకమున వర్ణించి వయ్యారముగ, తిన్నగ ప్రవహించునదిని వర్ణించినాడు. ఆశృంగార భావము గమనించిన వేంకటకవి నది నడకకు ముందు స్వంతముగ కొండ సౌందర్యమును శృంగారముగ నిట్లు వర్ణించినాడు.

క॥ ధరవరనందన శశి, కిరణవ్యాప్తంబులగుచు గిరిశిఖరంబుల్
వర చందన లిప్తములగు, తరుణుల పాలిండ్ల పగిదిఁ దనరెడుఁ గంటే (గో.రా – కి. 746)

సీతాదేవి హనుమంతునికి కాకసుర వృత్తాంతము చెప్పి శిరోరత్న మిచ్చి తన సంపూర్ణ విశ్వాసము ప్రకటించినది. 'నీకు సముద్రము ఒక్క ఊపున దాటుట లెక్కకాదు. ఎందుకంటే నీవు వాయుదేవునంత బలపరాక్రమశాలి పుత్రుడవు అని హనుమతునితో సీత చెప్పి 'దుఃఖ సాగరము దాటుటకు పడవవలె మునుగకుండ అవతలి గట్టుకు చేర్చినపుడు కదా నీకు యశస్సు కలిగేది అని అంటుంది. చూడండి.

ఉ॥ నీఁక సమీరునంత బవిక్రమశాలికిఁ బుట్టి నందు కి
ట్లో కపివీర యీ జలధి నుక్కున నొక్కట దాఁటి వచ్చుట
స్తోకముగాదు నీకు మము దుఃఖపయోధి మునుంగ కుండగ
జేకొని నావమాడ్కి దరిఁ జేర్చినఁ గాక యశంబుగల్గునే

ఇందలి 'నుక్కున నొక్కట' 'నావమాడ్కి' అమూలములైనను పద్యమునకు శోభచేకూర్చుట గమనింపగలము.

ప్రస్థ రేషు చ రమ్యేషు వివిధా : కానన ద్రుమా :
వాయువేగ ప్రచలితా : పుష్పై : రవకి ర్ణితాన్
మారుత సుఖ సంస్పర్శో వాతి చందనశీలః
షట్పదై దనుకూజద్భి ర్వనేషు మదుగందిషు (గో.రా. యుద్ధ – 81)
అను శ్లోకమును ఇట్లు అలంకారయుతముగ తెలిగించి నారు.

సీ॥ మలయ చందన వృక్షముల సౌరభము ( బూని, మెల్లమెల్లగ వీచెఁ జల్లగాలి
గాలి రాకకుఁ గొనల్ గదల దావుల నీను, తరువులు కురిసె క్రొవ్విరుల వాన
విరుల పాటున కుల్కి వెడలు తుమ్మెద చాలు, ఝుమ్మని మింట గానమ్ముఁ జేసె
నళుల గానమునకు నడరి వెంటనె జంట, కోయిల లిరువంకఁ గూయఁ దొడఁగెఁ

తే॥ బికరవంబులఁ జెలరేగి శుక కులంబు, కలరవంబునఁ గల కల పలుక సాగె (
జిలుక కదుపుల కలరి కేకు లచల, శిఖరాగ్రముల మీఁద నాఁడ దొడఁగె

సువాసనలతో చల్లగాలి వచ్చి చెట్టుకొమ్మలను కదలించి, పూలు రాలచేసి, పూలలోని తుమ్మెదలు ఉలిక్కిపడి గానము చేయుచు బయటకు వచ్చి, కోకిల చిలుకలచే మధుర శబ్దములు చేయించి నెమళ్ళచే కొండపై నాట్యమాడు నట్లు చేసినది.

మూలములో లేని క్రమమును చేర్చి ప్రకృతి సిద్ధము, సహజముఅయిన ఒక దృశ్యమును వేంకటకవి మన కండ్ల ముం దుంచినాడు.

తావుల నీను తరువులు అను ప్రయోగముచే పూలసువాసన పూలది కాదని చెట్టు విత్తనమునుండే వచ్చినదని, అది చెట్టు నుండి వీడి బయటకు వచ్చినను కొంతకాలము వరకు ఆ సువాసన ఉండుట చెప్పి కవి ప్రతిభను ప్రదర్శించినాడు.

కాలనేమి వృత్తాంతము ప్రక్షిప్తమని ప్రస్తుత రామాయణ ప్రతులలో తీసివేసినారు. కాని విభీషణుడు రావణ వీరులను యుద్ధరంగ మందుచూపి చెప్పుచు 'అకంపనుని' చూపి చెప్పు మూల శ్లోకములో అ కంపనుడు, ధాన్యమాలినికి రావణుని వలన పుట్టి నట్లు కలదు. అది ప్రస్తుత రామాయణమూల మందును కలదు. అట్టియెడ ధాన్యమాలిని రావణ ప్రధానమైన కథను చెప్పుట ఉండవచ్చును కదా. కనుకనే ఈ వృత్తాంతము ఒక స్వంతత్ర కావ్యము వలె శిల్పయుతముగ రచించుటే కాక, తన మారుతి శతకమున 3 పద్యములు వ్రాసినాడు. అందలి సరస్సు నిట్లు ఆతిధ్య దృష్టితో వర్ణించినాడు.

సీ॥ అనిశంబు నాశ్రయించిన హంస తతులకు, విడువక తామరతూండ్ల గుడువనిచ్చి
వదలక గీ పెట్టు కొదమ తుమ్మెదలకు, విరుల తేనియలిచ్చి విందు చేసి

యభ్యాగతుండైన యలసవాయువునకుఁ, గుసుమ సౌరభమిచ్చి కూర్మి నెఱపి
తన చుట్ల నున్న యున్నత తరులతలను, బువ్వుఁ ణరకములు పోసి పెంచి
మత్స్య కచ్ఛప నక్రకూర్మ ద్విరసన, ముఖ నిఖిల జంతు సంతానములకు నియత
మైన యాహార మిడి తనయఖిల భువన, జీవనత్వంబు తెల్లంబు సేయు దాని (యుద్ధ – 2416)

ఇందు తన సంతానమునకు నియత ఆహారమిచ్చి తన చుట్ల నున్నవారు, అభ్యాగతులు, ఎప్పుడు ఆశ్రయించు బంధువులు, వదలక గీ పెట్టు మిత్రులకు గృహిణి చేయు ధర్మము చక్కఁగా వర్ణింపబడినది. ఈ వర్ణనములందే ధాన్యమాలినిని రావణుడు చూచినపుడు 'హరి చక్ర మఱచేత నవల తట్టిన నన్ను చెలి, నీదు జఘనంబు గాసిపరచె' అని చెప్పుకొనుట శాండిల్యమహాముని అదే ధాన్యమాలిని తనుద్యుతి పాఱఁజూచి మొఱుంగు తీగయో, చంద్రకళయో అని పరీక్షింపవచ్చి సరోవరములో నుండు పద్మముల వంటి వాటిచే పోల్చుకొనుట ఒక శిల్పము.

గోపీనాద రామాయణము ప్రారంభమున 'తపస్వాధ్యాయనిరతం' అను శ్లోకమును తెలుగు చేయునపుడు మహేశ్వర తీర్ధ వాఖ్యను గ్రహించుట. అయోధ్య కాండ ప్రధమ శ్లోకమును తెలుగు చేయునపుడు గోవింద రాజీయ వ్యాఖ్యను గ్రహించుట వ్యాఖ్యాతలందరి గుణ గ్రహణము చేయుటకు ఉదాహరణము. పూర్తి రామాయణమునుసూక్ష్మముగ పరిశీలించిన ఈ రెండు వ్యాఖ్యలను సమాదరముగ చూచినట్లు మనము గ్రహింపగలము. అట్టియెడ కేవల గోవిందరాజీయమునే గ్రహించినట్లు రామాయణ పీఠిక యందు మేడేపల్లి వేంకటరమణాచార్యులు వ్రాయుట శోచనీయము.

తెలుగులో వ్యాఖ్యలు లేనందున తెలుగు పాఠకుడు తేలికగా తెలిసికొను రీతిగా "కింత్వా మన్యత వైదేహ : ... స్త్రియం పురుష విగ్రహం" అను శ్లోకమును మహేశ్వర తీర్థవ్యాఖ్య సహాయముగా అయిదు విధములుగా వికల్పించి అయోధ్యకాండ 655 నుండి 659 పద్యములను రచించారు. అట్లే "రామం దశరధం విద్ధి" అను శ్లోకమునకు గోవింద రాజీయ వ్యాఖ్య ననుసరించి మూడు పద్యములుగా (అయోధ్య) 854 నుండి 856 వరకు) రచించారు. ఇట్లు చేయుటవలన సామాన్య పాఠకుడు కూడ వాల్మీకి హృదయము నానందింపగలుగుచున్నాడని తెలిసికొనగలము.

ధర్మాత్మనో గుణవతో లోకే రామస్యధీమత :
వృత్తం కథయ ధీరస్య యధాతే నారోదాచ్ఛ్రుతమ్ (బాల–2 – 32)

అని నారదుడు వాల్మీకిని తను చెప్పిన రామకథను సవిస్తరముగ రచింపమని చెప్పుశ్లోకమును వేంకటకవి

క॥ శ్రీమంతుడు గుణవంతుడు, ధీమంతుడు ధార్మికుండు ధీరుండగు నా
రాముని చరితముఁ జెప్పుట, ప్రామాణ్యము పుట్టువునకు ఫలమగు సుమ్మీ

అని రామకధ వాల్మీకి అడిగిన ఉత్తమ లక్షణ పురుషునికి చెప్పి ఆ కధను రచింపుమని ఉపదేశ మొసంగెను.

మూల రామాయణ శ్లోకముతో ఈ పద్యమును సరిపోల్చి చూడగా 'ప్రామాణ్యము పుట్టువునకు ఫలమగు సుమ్మీ' అనునది వేంకటకవి వ్యాఖ్యానముగ మనకు తెలియగలదు. వాల్మీకి చెప్పిన నారద హృదయముగ కూడ తెలియగలదు.

అట్టి వాల్మీకిని ప్రార్థింపగా వాల్మీకి ప్రత్యక్షమై 'తన కజుడొసగిన తెల్విని ఘనముగ నా కొసగి చనియె కారుణ్యమునన్' అని వేంకటకవి సవినయముగ తెలిపికొనుట, తనకు కవిత్వము యోగి వరేణ్యుని వలన యాదృచ్ఛికముగ తిక్కనకు హరిహరునిగ స్ఫురింపచేసిన వేదగిరి నరసింహ స్వామి దేవళ ప్రాంగణమున ప్రసాదమగుట చూడగా వాల్మీకి అక్షరుడే నన్నయగా పుట్టి తన తెలుగు భాషలో భారత, భాగవత, రామాయణములు సహజ సుందరమగు శబ్దములతో వెలయింప చేసినా అని నా అల్పమతికి తోచుచున్నది. అట్లుకానిచో భారతీయ భాషలయందే భాషయందును లేని విధమున భారత, భాగవత, రామాయణములు సమగ్ర సుందరముగ తెలుగు భాషలోనే సృష్టింపబడినవేమి ? దానికి ఒక అక్షర దీక్ష అవసరము కదా.

రామాయణము కావ్యము. కనుక ప్రతి శ్లోకము తెలుగున అవతరింపవలసిన అవసరమున్నది. అట్లుండి కవితా సుందరత ఉండవలెను. కనుకనే భారత, భాగవతముల అనుభవముతో ఆ అక్షరుడట్లు ప్రౌఢ సుందరముగ రామాయణమును తెలుగున తీర్చినాడు. ఇందుకు ఉదాహరణముగా ఆదిత్య హృదయ అనువాదమును పరిశీలింతము.

శ్రీరామునలకు నగస్త్యుం డాదిత్య హృదయం బుపదేశించుట

సీ॥ దశరథ తనయ యెద్దాని జపించినఁ, గలన శత్రుజయంబు గలుగు నట్టి
యాదిత్యహృదయాఖ్య మగుస్తోత్ర మిపు డుప, దేశింతు దానిఁ బ్రతిగ్రహింపు
మది గుహ్య మది పుణ్య మది విజయావహం, బది శత్రునాశన మదియు జప్య
మది శివ మక్షయ్య మది సర్వమంగళ, మాంగళ్యమును బరమంబు సర్వ
తే॥ తాపనాశంబు శోకచింతా ప్రశమన, ముత్తమం బప్రతర్క్య మాయుష్కరంబు
వీర్యవర్ధన మంచితైశ్వర్యకరము, నిఖిల పాపప్రణాశంబు నిర్మలాత్మ
వ. మఱియు నాదిత్యమండల మధ్యవర్తి పరమపురుష ప్రతిపాదకంబగుట వలన నమ్మహా
స్తోత్రం బాదిత్య హృదయ సంజ్ఞికం బయ్యెఁ గావున 2698

క. పరమాంతరంగ భక్తాం, తరమున భాసిల్లువానిఁ దప్పక దేవా
సురనరగరుడోరగముని, వరుల కుపాసింపఁ దగినవాని స్మరియున్ 2699
క. ధర్మము సంస్థాపించుట, కర్మిలి యుగయుగమునందు నభినవపణితి
న్నిర్మలమతిఁ బుట్టి విహిత, కర్మము నడిపించు నట్టి కారుణ్యనిధిన్. 2700
క. నిరతిశయదీ ప్తిమంతుని, సురుచిరముగఁ జంద్ర వహ్నిసూర్యాదులకున్
వరదీప్తి యొసఁగువానిని, బురుషోత్తము భువనపతిని బూ.జింపు మొగిన్ 2701
తే. ఇతడుసర్వదేవాత్మకుం డితడురశ్మి, భావను డితండుతేజస్వి పరమపురుషుఁ
డమరులను విష్టపంబుల ననవరతముఁ, దన గభస్తులఁ బాలించుదాత యితఁడు.
తే. విష్టపంబుల సృజియించు విధి యితండు, పరఁగ నన్నిటిఁ బాలించుహరి యితండు
వరుస నన్నిటి గ్రసియించు హరుఁ డితండు, మూఁడు మూర్తుల కిరవైన మూల మిత ( డు
తే. శత్రుశోషణ మొనరించు చతురుఁ డితఁడు, షణ్ముఖాకృతి గైకొన్న జాణ యితఁడు
వసుధలోఁ బ్రజాపతి శబ్ద వాచ్యుఁడితడు, వర్ధి తైశ్వర్యమున నిరవధికుఁడితఁడు.
తే॥ ఇతఁడు లోకసంహారకుం డితఁడు వేద, సిద్ధ సర్వఫలప్రదుఁ డిద్ధయశుఁడు
సర్వకారణమయ సోమశబ్ద వాచ్యుఁ, డితఁడు సమవర్తి యితఁడపాంపతి యితఁడు
క బుతు వితఁడు కర్త యీాతం, డితడుఁ వసువు లితఁడు సాధ్య లితఁడు మరుత్తుల్
పితరులు వాయువు వహ్నియు, నితఁ డాశ్వను లితఁడు ప్రాణ మితఁడు మనువగున్.

వ. వత్సా స్తోత్రపకారం బెఱింగించెద నీవు సమాహితుండ వై సూర్యమండల మధ్యవర్తి యైన పరమపురుషు నుద్దేశించి దేవా నీవశేష విషయభోక్త వగుటం జేసి యాదిత్యుండవు సమస్త జగంబునకుఁ బ్రేరకుండ వగుటంజేసి సవితవు కర్మ ప్రేరకుండ వగుటం జేసి సూర్యుండవు పరమాకాశ గతుండ వగుటంజేసి ఖగుండవు స్థితికర్త వగుటంజేసి పూషుండవు సర్వవ్యాపిని యగులక్ష్మి గల వాఁడవగుటంజేసి గభస్తిమంతుండవు పక్షవంతుండ వగుటం జేసి సుపర్ణుండవు సర్వతపనుండ వగుటంజేసి తపనుండవు సర్వంబును వెలుంగం జేయువాఁడ వగుటం జేసి భానుండవు హిరణ్మయంబైన యండోత్పాదక ద్రవ్యంబు గలవాఁడ వగుటంజేసి హిరణ్య రేతసుండ వజ్ఞాననివర్తన పూర్వకంగా జ్ఞానం బుత్పాదించు వాఁడ వగుటంజేసి దివాకరుండవు మనోహర గరుడ వాహనంబు గలవాఁడ వగుటంజేసి హరిదశ్వుండ వసంత కళ్యాణ గుణవంతుండ వగుటంజేసి సహస్రార్చి వి సప్తాఖ్యసప్తి గలవాఁడ వగుటంజేసి సప్తసప్తివి శంఖ చక్ర గదాధరుండ వగుటంజేసి మరీచిమంతుండవు జ్ఞానోత్పత్తి ప్రతిబంధకదోష నివర్తకుండ వగుటంజేసి తిమిరోన్మథనుండవు నీవలన సుఖంబుగలుగుటవలన శంభుండ విరువదియొక్కమాఱు వెదకి ధరణీచక్రం బక్షతంబు గావించినవాఁడ వగుటంజేసి త్వష్ట వచేతనం బైన బ్రహ్మాండంబు జీవింపఁజేయుటం జేసి మార్తాండుండ వంతర్బహిర్వ్యాప్తిమంతుండ వగుటంజేసి యంశుమంతుండవు సకలజగదుత్పాక సమష్టి జీవజాతంబు గర్భంబునందుఁ గల వాఁ డవగుటం జేసి హిరణ్యగర్భుండవు తాపత్రయసంతప్తు లగు వారికి విశ్రమస్థానంబ వగుటం జేసి శిశిరుండవు విరోధి సంతాపకరుండ వగుటంజేసి తపనుండవు సర్వవస్తు సాక్షాత్కార హేతుభూతుండ వైన లోక కర్త వగుటంజేసి భాస్కరుండవు సర్వ ప్రాణుల చేత స్తూయమానుండ వగుటవలనను దేవతల కుపదేశించువాఁడ

వగుటవలనను రవివి కాలాగ్నిరుద్రుండు గర్భంబునందు గలవాఁడ వగుటంజేసి యగ్నిగర్భుండవు పురందరుని రక్షించువాఁడవగుటంజేసి యధితిపుత్రుండవు నిరవధికానందవంతుండ వగుటంజేసి శంఖుండవు సూర్య రూపంబున హిమంబు నాశంబు నొందించువాఁడవు గావున శిశిరనాశనుండవు తామసాహంకారరూపంబున నాకాశస్రష్ట వగుటంజేసి వ్యోమ నాథుండవు భక్తులతమోగుణంబు భేదించువాఁడ వగుటంజేసి తమోభేదివి సకలవేదపర్యవసాన భూమి వగుటంజేసి ఋగ్య జుస్సామపారగుండవు నీవలన సకల కర్మఫలంబు లధికంబులై నెగడుఁ గావున ఘనవృష్టివి మహోర్ణశాయి వగుటం జేసి యపామ్మిత్రుండవు ముక్త ప్రాపకుండ వగుటంజేసి వింధ్యవీదీప్లవంగముండవు జగన్నిర్మాణసంకల్పంబు గలుగుటంజేసి యాతపివి కౌస్తుభాదికంబు గలుగుటంజేసి మండలివి మృత్యు శరీరకుండ వగుటంజేసి మృత్యువవు సుశీలుండ వగుటం జేసి పింగళుండ వేకకాలంబున సకలాండ సంహారకుండవు గావున సర్వతాపసుండవు విదితాఖిల వేద్యుండవు గావునఁ గవివి విశ్వశరీరకుండవు గావున విశ్వుండవు నిరవధిక పరాభిభవ సామర్థ్యంబు గలవాఁడవు గావున మహాతేజుండవు సర్వ రంజకుండవు గావున రక్తుండువు సర్వ జగదుత్పత్తి హేతుభూతుండవు సర్వభవోద్భవుండవు నక్షత్రగ్రహ తారాకాంతర్యామివి గావున నక్షత్రగ్రహతారకాధిపుండవు విశ్వస్థితి కారణంబవు గావున విశ్వభావనుండవు ప్రశస్త తేజస్వివి గావునఁ దేజోవంతులకుఁ దేజం బొసంగువాఁడవు ద్వాదశ మండలాంతర్వర్తివి గావున ద్వాదశాత్మకుండ వట్టినీకు నమస్కారంబు గావించెద. 2707.

సీ. పూర్వ పశ్చిమ మహాభూదరాంతర్యామి, కత్యంతము క్షజనాధివిభున
కప్రతిహత విక్రమాధికునకు నుషా, సకుల నానాకిల్బిషంబు లడఁచి
కళ్యాణ మొసఁగెడు ఘనున కవ్యయునకు, హరివాహనునకు దినాదిపతికి
నాదిత్యునకును సహస్ర జీవున కను, పాసకోగ్రునకు శుభప్రదునకు

తే. వీరవరునకు హంసావతారునకును, బ్రణవమునఁ బ్రతిపాదింప బడెడు వాని
కనవరతము సారగ్రాహి యైన వాని, కందముగ నేను గావింతు వందనములు.

తే. తగ నచేతన మైన యీజగమునెల్లఁ, జేతనత్వం బొసంగి రక్షించువాని
కర్థిఁ బద్మప్రబోదకుం డైనవాని, కంచితంబుగ వినతి గావించువాఁడ. 2709

తే. సృష్టి సంహారసంస్థితు ల్సేయునట్టి, యజహరాచ్యుతులకు విభుండైన వాని
కఖిల యజ్ఞ స్వరూపకుం డైనవాని, కంజలి ఘటింతుఁ నతిభక్తి ననవరతము 2710

తే. అఖిల కర్మ సంప్రేరకుం డైనవాని, నగణితదినేశ తేజుఁ డై నట్టి వాని
నమిత సౌందర్య విగ్రహుం డైనవాని, నఖిల మఖభోక్త యగువాని నాశ్రయింతు.

క. అరిసంహారార్థము నర, హరిరూపము దాల్చి నట్టి యధిపునకుఁదమో
హరునకు రవిరూపంబున, నురుహిమము నడంచువాని కొనరింతు నతుల్.

క. తనయంతఁ దానె వెలిఁగెడు, ఘనునకు విజితేంద్రియునకుఁ గలికల్మష నా
శనున కఖిల సురరూపున, కనంత మహిమాధికునకు నభివందనముల్ 2713

తే. కల్పితాజ్ఞానతిమిర విఖండనునకు, విశ్వకర్మకు వేదాంత వేద్యునకును
బరమగతికి హిరణ్మయి పురుషునకును, సర్వసాక్షికి మ్రొక్కెద సంతతంబు.

వ. అని యిట్లు స్తోత్రంబు గావింపుము మఱియు నితండు మహాప్రళయంబున సర్వభూతంబుల నాశంబు నొందించి పదంపడి కర్మసహాయంబుగా సృజించి సూర్యరూపంబు దాల్చి గభస్తులచేత సర్వరసంబుల నాకర్షించి క్రమ్మఱ వర్షించుచుఁ బ్రవర్ధమాన నానావిధౌషధుల వే రక్షించుచుండు నదియునుం గాక యితండు భూతంబులయం దంతర్యామిత్వంబున నుండి సుషుప్తిసమయంబునఁ దనయంతం దాను ప్రకాశించుచుండు. 2715

తే. అగ్నిహోత్ర ఫలంబు నయ్యగ్నిహోత్ర,మధ్వరంబులు వేదంబు లధ్వర ఫల
మితఁడు సర్వకార్యములకుఁ బతి యితండు, సకల భువనంబులకుఁ బ్రవర్తకుఁ డితండు
2716.

తే. కాననములందు ఘోర సంకటములందు, భయమునం దాపదలయందు భక్తితోడ
నితని భజియించు పురుషుఁ డొకించుకైన, వంత నొందక కుశలియై వఱలు నధిప

మ. అనుమానింపక నీవు భక్తి నిపుడేకాగ్రుండ వై విశ్వరూ
పుని విశ్వాత్ముని దేవదేవు నితనిం బూజించి ముమ్మాఱు నీ
వినుత స్తోత్ర మొగిం జపింపు మిటు గావింప న్రణోర్వీం దశా
ననుఁడిల్లు న్విజయంబు నీకుఁ గలుగుం దథ్యంబు రాజోత్తమా. 2718

అని ఆదిత్య హృదయము పారాయణ యోగ్యముగ తెలుగు చేసి
అనృతం బత లోకోఽయ మజ్ఞానా ద్యద్ధి వక్ష్యతి
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే (అయోధ్య 30–4) అను శ్లోకమును

శా॥ అస్తీనే తపతీవ రామనృపతా వత్యంత తేజః పరం
చాస్తోకం బనుమాట నన్నిఁచటఁ బాయం బెట్టి నీ వేగినన్
నాస్తీనే తపతీవ రామనృపతా వత్యంత తేజః పరం
చాస్తోకం బని మ్రోయు నింక భువిలో నార్యాన్య సందీప్తమై

అని వాల్మీకి హృదయానుసారముగ రచించుట తాను కోకిల స్వామి[1] ననియే కదా.
అంతేకాక
పురుష స్యేహ జాతస్య భవంతి గురవస్త్రయ :
ఆచార్య శ్చైవ కాకుత్స్థ ! పితామాతా చ రాఘువ :
పితాహ్యేనం జనయతి పురుషం పురుషర్షభా :
ప్రజ్ఞాం దదాతి చాచార్య స్తస్మాత్స గురు రుచ్యతే (అయోధ్య 111 – 2, 3) అను శ్లోకమును

క॥ నరనాథ శిరోమణి విధి సరణిన్ జనకు డనంగ జనయిత్రి యనం
గర మాచార్యుం డనంగా , బురుషున కీ లోక మందు ముువ్వురు గురువుల్

క॥ కని పెంచుఁ దల్లి జన్మం,బునకుం గారణము తండ్రి బుద్ధిప్రదుఁడౌ
ఘనుఁ డాచార్యుఁడు గావున, ననఘా యాచార్యుఁ డెక్కు డా మువ్వురిలోన్ (గో.రా అయోధ్య)

అని భారతములోని సారము ననుసరించి తెలిగించుట పూర్వజన్మానుబంధమేమో. కాకపోయిన మూలము ననుసరించి మీ కులపెద్దలందరకును గురువునను మూలమును మాఱు పరచి భారతము ననుసరించునా ?

ఇట్లు తెలిగించి యుండుట చేతనే తెలుగు విశ్వవిద్యాలయము వారు గోపీనాధ రామాయణమును ముద్రించి సమీక్షకు పంపగా '[illegible]' దినపత్రిక 13-12-1988 లో 23వ పుటన ఇట్లు సమీక్షించినారు.

The epic Remayana has a unique place in the world of Sanskrit literature and poetry Outside Vedic-poetry, Valmiki's Ramayana is the first work of poetry,in Sanskrit Valimiki is hailed the poet's poet and his classic is the first work of importance The book is unmatched in the sublimity of its theme, supremely artistic, magnificently dramatic and charmingly lyrical The greatness and the unique nature of this classic is also retained in its translation Every regional translation of this classic is hailed as a great work The translations also have become classics For example Kamban's Tamil version, Tulasi's Ramacharitha Manas, Gopinath's Telugu version (under review) Krithivasa's Bengali and Ezhuttachan's Malayalam are all regarded master pieces in their respective languages

In the Telugu language, the Ramayana has been the favourite of the poets We have several verisions of Valmiki prose, poetry, drama We have Bhaskaras, Raghunatha, the woman-poet Molla, Ramabhadra But among all of them Gopinath's version is the closest to Valmiki When we read each verse of this book we hear the ring of the authentic voice of Valmiki

The present volume covers all the six Kandas Sundara stands out as the most poetic of all of them It celebrates the devoted message of service of that great link character Hanuman There is a familar verse in tradition which states - "The story in the Sundara Kanda is, beautiful, the character of sita is beautiful, the pranks of the monkeys are beautiful, we do not know what is not beautiful in the Sundara Kanda " The present edition given by the scholar is splendid in every way

The hundred pages of introduction contain a praiseworthy appraisal of the moral and spiritual values of Ramayana.

The great oriental scholar has summed up in an unimprovable way the message and excellence of the Ramayana It is here affectation not to quote

There are in the whole range of world's literature few more poems charming, than the Ramayana The classical purity, clearness, and the simplicity of style, the exquisite touches of poetic feeling, with which it abounds, the graphic description of the heroic incidents and nature's grandest scenes, the deep acquittance it displays with the conflicting workings and the most refined emotions of the human hearts, all these entitle it to rank among the most beautiful compositions that have ever appeared at any time in our country".

**- P. Nagaraja Rao**

తెలుగు విశ్వవిద్యాలయము వారు గోపీనాధ రామాయణ ప్రకాశ విజ్ఞప్తిగా యిట్లు తెలిపియున్నారు.

"ఒక జాతి సంస్కృతికి దర్పణం ఆ జాతి సాహిత్యం. భిన్నత్వంలో ఏకత్వం భాసించే భారతీయ సంస్కృతికి పలు భారతీయ భాషా సాహిత్యాలు భాష్యం చెప్పాయి. ఆ పలుభాషలలో తెలుగు భాష ఒక విశిష్టమైన స్థానాన్ని కలిగి ఉంది.

అపారమైన చరిత్ర సంస్కృతి కలిగిన తెలుగు జాతి ఆయా కాలాలలో వెలువడిన సాహిత్యాన్నంతా పరిరక్షించుకొంటూ తన సంస్కృతిని సుసంపన్నం చేసుకొంటూ వస్తున్నది. ఈ సంస్కృతి భాండాగారాన్ని ఒక తరం నుంచి మరో తరానికి అందించడానికి అంకితభావంతో కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు చేస్తున్న కృషి అనుస్యూతంగా సాగుతూ వస్తున్నది. అందుకే ఆ పెన్నిధిని మరింత పరిపుష్టం చేసి ఆగామియుగాలకు అందించడం అవుతున్నది.

ఈ సంకల్పంతో శిల్పితమైన తెలుగు విశ్వవిద్యాలయం తెలుగు వారి చరిత్ర, సంస్కృతి సర్వతోముఖ వికాసానికి చేసే కృషిలో ఉత్తమ సాహిత్యాన్ని అందించడం అన్నది ఒక భాగం. ఆ ఆశయంతో ప్రకటితమైనది ప్రకృత గ్రంథం.

మానిషాద ! ప్రతిష్టాం త్వమగమ్ శ్శాశ్వతీ స్సమా :
యత్క్రౌంచ మిథునా దేక మవధీ : కామ మోహితమ్ [1]

శోకంలో నుంచి అప్రయత్నంగా వెలువడిన ఈ శ్లోకం భారతీయ సాహిత్య లోకంలో ఆదికావ్యమైన రామాయణం ఆవిర్భావానికి అంకురార్పణ గావించింది. వాక్య విశారదుడైన ఆదికవి వాల్మీకి సంస్కృత భాషలో రచించిన రామాయణం క్రమేణ దేశభాషలన్నింటిలోకి అనూదితమై వివిధసాహితీరూపాలలో అలరారింది. విశ్వసాహితిలోని రామాయణ కథా సంవాది రచన లన్నింటికీ వాల్మీకి రచనమే మొదటి సంచి అని విజ్ఞుల విశ్వాసం.

ఆర్షబద్ధమైన భారతీయ సంస్కృతికి ప్రతిబింబంగా నిలిచిన రామాయణం అన్నికాలాలలోను, అన్ని యుగాలలోను నిత్యనూతనమై నిలిచింది. పరమపవిత్రమైన రామకథ ఎన్ని విధాలుగా కీర్తించినా, ఎన్నెన్ని రకాలుగా రచించినా తనివి తీరదనే భావన భారతీయులలో జీర్ణించుకొని పోయింది.

రామాయణం సంస్కృత భాషలో ఆది కావ్యమైనప్పటికీ తెలుగులో మాత్రం రామాయణం

---

1. గోపీనాధ వేంకటకవి వాల్మీకి నోటినుండి కవితావతరణకు మూలమైన ఈ శ్లోకాన్ని తెలిగించలేదు. శ్లోకమునట్లే పెట్టినాడు. కారణము వాల్మీకి నోటినుండి ముందు వచ్చిన మాట అట్లే చెప్పవలెను దాని భావముతో పాటు అట్లే ఉంచుట ప్రధానము. కనుక దీనివి మంత్రతుల్యముగ భావింపవచ్చును.

కంటే భారతమేముందు వెలువడింది. అయినా రామాయణాన్ని తెలుగు కవులు నాటినుంచి నేటి దాకా పలువిధాలుగా ప్రవచిస్తూనే ఉన్నారు. ప్రపంచీకరిస్తూనే ఉన్నారు. పద్యం, గద్యం, ద్విపద, నాటకం వంటి బహుప్రకియలలో తెలుగులో వెలువడిన రామాయణాలలో భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయం, తిక్కన నిర్వచనోత్తర రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, గోపీనాథ రామాయణం, వాసుదాసుల శ్రీ మద్రామాయణం, జనమంచి వారి, విశ్వనాథవారి శ్రీ మద్రామాయణ కల్పవృక్షం ప్రముఖంగా ఎన్న దగినవి.

తెలుగు రామాయణాలలో ఈనాడు గోపీనాథ రామాయణం దాదాపుగా అలభ్యమనే చెప్పాలి. 1923లో వావిళ్ళవారు ప్రకటించిన తరువాత ఇది మళ్లీ వెలుగు చూసినట్టు లేదు. అందుకే రామాయణాన్ని నిత్యపారాయణం చేసే తెలుగుపాఠకలోకానికి ఈగోపీనాథ రామాయణాన్ని అందించాలనే సంకల్పంతో దీనిని పునర్ముద్రించాం. మూలమైన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి రాయబడడం గోపీనాథ రామాయణం ప్రత్యేకత. అందువల్ల సంస్కృత రామాయణంలోని కావ్య ఔచిత్యాన్ని తెలుగులో ఆవిష్కరింప జేసే ఈ గోపీనాథ రామాయణం సహృదయుల మన్ననలకు పాత్రమై మా యత్నం సాఫల్య మొందగలదని భావిస్తున్నాం".

పై తెలుగు విశ్వవిద్యాలయ రచనలో సూత్రప్రాయముగ తెలుపబడిన ఒకతరం నుండి మరో తరమునకు అందించుటకు అంకితభావముతో కృషి చేసిన వ్యక్తిగా వాల్మీకి మహర్షిని భావింపవచ్చును.

కనుకనే తెలుగు వాడైన వాల్మీకి తన భావలో రామాయణమును వెలయింప చేసి రాజరాజనరేంద్రుని కోరిక ననుసరింపుచు 'హరి హరాజ' అని తన రామాయణ రచనా కాంక్షను నన్నయ ద్వారా వ్యక్తము చేసెను. అంతేకాక 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ' శ్లోకము ద్వారా తాను భారత, భాగవత, రామాయణములను వేదత్రయమును తెలుగున బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్థానములలో వెలయింప చేసెదనని ధ్వనిగా వ్యక్తము చేసెను. ఋషితుల్యుడైన ఆ మహనీయుని కోరికె తీరెనా అనునట్లు నన్నయ, తిక్కన, పోతన, వేంకటకవుల ద్వారా తెలుగులో భారత, భాగవత, రామాయణములు తెలుగు నేలకు దిగినవి. ఇట్లు మరే భారత భాషయందును (మూలమైన సంస్కృత భాష తప్ప) దిగలేదని తలంచిన అట్టి మహనీయుని సంకల్ప బలము వ్యక్తము కాగలదు. కనుక ఆ మహనీయునికి మనము ఎంతో ఋణపడి ఉన్నామని తలంచుచున్నాను.

ఈ సందర్భమున 'శ్రీ మదుభయ కవిమిత్ర' అని తనను చెప్పుకొనిన తిక్కన పూర్వజన్మలైన వాల్మీకి (కవి అనగా వాల్మీకి కనుక), నన్నయ ఒక ప్రక్కను, పరజన్మలైన

పోతన, వేంకటకవులు మరో ప్రక్కను (రెండువైపుల ఇద్దరు పూర్వజన్మకవులు – అందుకే శ్రీమత్) ఉన్న ఉభయ కవిమిత్రుడుగా ఐశ్వర్యము కలవాడు అను భావము ధ్వనించుట గమనింపగలము.

ఉపసంహారము

తను తన సహధర్మచరియైన భార్యయందు ఆనందాహ్లాదులచే వర్షించి బీజరూపుడై, క్రమముగ వృద్ధిచెంది రూపముతో పుట్టిన తనుజులలో ఒకరు తన రూపముతో పాటు తన నడక తన గుణాదులు గ్రహించి ప్రకాశించునట్లును, మరొకరు తన రూపము మాత్రమే గ్రహించి మిగత గుణాదులు వేరై ఉండుటయు, మరింకొకరు తన రూపమును కూడ గ్రహింపక వ్యక్తమగుట మనము లోక వ్యవహారమున చూచుచుందుము. అట్టి వారి నుండి తండ్రి పుత్రులను కనుగొనుటకు చేయు ప్రయత్నము వంటిదే పూర్వ కవి పరంపరను తెలిసికొన ప్రయత్నించుట. బహుజన్మ సుకృత పరిపాక వశంబున అని పుణ్యాత్ములైన కవులు చెప్పుకొనిన విషయ మిచట స్మరణీయము శబ్ద బ్రహ్మమే వారి ఉపాసనా బలము కదా.

కవితా మార్గము ననుసరించిన మాత్రమున ఒకరి పరంపర మరొకరు అని చెప్పలేము. కాని వేంకటకవి – పోతన జీవిత సంఘటనలు జనశ్రుతిగా వారి వారి కాలముల నుండి ప్రచారమై గ్రంథమున కెక్కి ఋణాను బంధముగ గోచరించుట వలన ఆ ఉపపత్తులతో వారు దేహాంతర ప్రాప్తి పొందిన ఒకే వ్యక్తి అని మనము గమనించితిమి.

తిక్కన వ్రాయక వదలిపెట్టిన భగవద్గీత పూర్వరామాయణములు రచించుటే కాక శ్రీ రాధికాపరిణయమున పరిశిష్ట భారతకరుడు 'తిక్కన' అని చెప్పుట చేతను 'నన్న పాఖ్య మహాకవి వదన వినిర్గతంబై ప్రబంధ పరమేశ్వరుని కుక్షిప్రదేశంబున విశ్రమించి తిక్కయజ్వయందు ప్రవేశించి' అని శ్రీ కృష్ణ జన్మఖండమున చెప్పుట చేతను, 'భారత రామ సచ్చరిత భాగవతాది మహాపురాణముల్ కోరి తెలుంగునన్ నిఖిలలోక హితంబుగ చేసిన నన్నయ, కవి తిక్కన, భాస్కర, పోతనాదులన్' అను రామాయణ పద్యములో భాస్కర అనిన ప్రకాశించు అని అర్థముతో, భారత రచనమును ప్రారంభించిన నన్నయ, రామాయణ రచనను ప్రారంభించిన తిక్కన, భాగవతమును ప్రారంభించిన పోతన (ఇక్కడ తిక్కన నన్నయ భారత కావ్యమును పూర్తి చేయుటే కాని తను స్వంతముగా ప్రారంభించినది కాదను భావమును స్వీకరించుట లోక వ్యవహారముగా తలంపవలెను. కారణము ఎప్పుడైనను అందరను సమస్థితిలోనే పరిపోల్చవలెను కాని అసమముగ పోల్చుట సహేతువు కాదు) ఒకే వ్యక్తిగా ప్రకాశించు అక్షరుడని ధ్వనింపచేయుట చేత అట్టి రచన వేంకటకవియే పూర్వజన్మలలో తిక్కన, నన్నయ దేహాంతరములలో చేసి

యుండుననియు కాకపోయిన అట్లు ప్రయోగించి రచించుట అసంభవమని ప్రయత్నించగా పై హేతువులుకనబడి వారి ఒకే అక్షరత్వమును నిరూపించుచున్నది.

నన్నయ, తిక్కనగనే పుట్టి యుండినచో నన్నయ వదలిన చోటు నుండి తిక్కన ప్రారంభించి ఉండవలె.ఇది ఇట్లుండగా ఎఱ్ఱన భారత శేష రచన చేసినప్పటి నుండి ఒకజనశ్రుతి వినవచ్చుచున్నది. అది ఏమో మనకు సరిగా తెలియరాదు. ఈ జనశ్రుతి కాల గర్భితమై పోయినది.

ఎఱ్ఱన చతుర్థాశ్వాసమున 'స్ఫురదరుణాంశు' నుండి రచించెనా ? లేక నన్నయ రచించిన భాగములో కొన్ని భాగములుచెదలుకొట్టి వేయగా వాటిని రచించెనా అను వివాదము మాత్రము గ్రంథస్థమైనది.

సాహిత్య ప్రపంచమున ఎవ్వరును తిక్కన రచించి యుండునను తలంపునే స్వీకరింపలేదు. పైగా తిక్కన అసత్యమాడునా? తిక్కన నన్నయ మూడు పర్వముల రచన చూచి యుండును అవి భావించి ఎఱ్ఱన శేషమును పూరించెనా; లేక చెదలు కొట్టిన పద భాగములను పూరించెనా; అను అంశములే చర్చించి యున్నారు.

కనుక నన్నయ, తిక్కనగ పుట్టిన విషయము నిజమైనచో తిక్కన నన్నయ వదలిన చోటు నుండి రచించి యుండవలె. ఈ విషయములనుసూక్ష్మముగ పరిశీలింపగా ఎఱ్ఱన రాజ రాజ ప్రశంస (రాజ రాజ ప్రశస్తి) 11 పద్యములు రచించి వాటిని వ్రాయక వదలిన తిక్కన భాగమును అదియు అరణ్య పర్వశేషమే కనుక, ఆ వ్రాసిన పద్యములు ఆశ్వాసాశ్వాసములను బంధించునవే కనుక, ప్రబంధ పరమేశ్వరుడనని అలంకార యుతముగ చెప్పినట్లును, దీనిని ధృవపరచుటకు తాను తన స్వగతమును సప్తమాశ్వాస రాజరాజ పశస్తి ముందే తెలుపుకొని నట్లును, (తాను కథాంశమే రచించినో తన స్వగతమును చెప్పుకొను పద్యములు చతుర్థాశ్వాసమున రాజ రాజ ప్రశస్తి తరువాతనే ఉండెడివి) బయల్పడినది.

అరణ్య పర్వ కథాంశము తిక్కన రచించి నన్నయనే రచించెనని చెప్పియుండ . కేవలము 11 రాజరాజ ప్రశస్తి పద్యములనే రచించిన ఎఱ్ఱన భారత సప్తమాశ్వాంతమున రచించిన తన స్వగతమునుగూర్చి సమకాలికులు విమర్శించి యుండవచ్చుననియు, దానికి ప్రత్యుత్తరమున ఎఱ్ఱన 'భాసుర భారతార్థములభంగులునిక్క మెఱుంగ నేరమిన్' అని నృసింహ పురాణమున రచించెననియు గ్రహింపవచ్చును. పై భావమును చెప్పుటకే నృసింహ పురాణమున ఎఱ్ఱన మూడుపద్యములు రచించి ప్రతి పద్యమునను నన్నయతిక్కనలను విడదీయక వ్యాసముని మహాముని ప్రణీత భారతకథ నన్నయ, తిక్కనలే రచించిరని నొక్కిచెప్పెను. అంతేకాక

స్ఫురదరుణాంశు పద్యరచనలోని అరుణ పద ప్రయోగమునే కవిబ్రహ్మగా తిక్కనను నుతించి ఎఱ్ఱన, తనను నూతన అరుణునిగా నృసింహ పురాణమున చెప్పికొనుట భారతములో 'స్ఫురదగుణాంశు' పద్యము తిక్కనదని ధృవపరుచున్నది. దీనికి ఎఱ్ఱన 'ఏ ముఖంబు తావల్కిన పల్కు లాగమములై పొల్పొందునను 'తను కావించిన సృష్టి' లోని పాదము బలము నిచ్చుచున్నది.

వ్యక్తిలో తండ్రి గుణములే కాక తాత, ముత్తాతలతో ఏడవ తరము వరకు గల గుణము అభివ్యక్తమగునని శాస్త్రము. అట్లే వ్యక్తి యొక్క పూర్వ వాసనా పరంపరలు కూడ అభివ్యక్తమగున కూడ శాస్త్రము. వేంకటకవిలో పూర్వకవులైన తిక్కన, నన్నయ గుణములు (నన్నయ తిక్కనగనే పుట్టినట్లు ధ్వనించు గుణములు) కలిగి నందునను నన్నయకు దాదాపు 150 సం॥ ల తర్వాత తిక్కన, తిక్కనకు దాదాపు 150 సం॥ తర్వాత పోతన ఉండినట్లును, పోతన తర్వాత దాదాపు 300 ఏండ్లకు వేంకట కవి జీవించి ఉండు కాలవ్యవధి కూడ వారి ఒకే అక్షరత్వమునకు అవకాశమిచ్చుచున్నది.

వేంకటకవి కాలముననే భారత, భాగవత, రామాయణములు ముద్రణ నందుటచే కాల మట్టి సమయముననే ఆ మహనీయుని పుట్టించి యుండవచ్చునని భావింపవచ్చును.

ముఖేముఖీ సరస్వతిఅని పెద్దల వాక్కు కనుక నా పై నిశ్చయములను నన్నయ, తిక్కన పోతన వేంకట కవుల రచనలను కూలంకషముగ పరిశీలించి ఆంధ్రజాతి యొక్క మహోన్న భాగ్యమును వెల్లడించగలరని ఈ గ్రంథమును ముగించుచున్నాను.

శ్రీరామ చంద్రః శ్రిత పారిజాతః సమస్త కళ్యాణ గుణాభి రామః
సీతా ముఖాంబోరుహ చంచరీకో నిరంతరమ్ మంగళ మాత నోతు